# చతుర

సంపుటి: 3 జనవరి 1981 సంచిక: 12

## ఈ నెల సమగ్ర నవల

మితిమీరిన ప్రేమ, హద్దులు దాటిన క్రమశిక్షణ ఆమెనో మట్టిముద్దగా మార్చేయి. ఏ అనుభూతులూ లేని ఆమె తనకోసం గాక తల్లి ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా మాత్రమే పెరగగలిగింది. ఆమెనో వ్యక్తిత్వముమన్న మనిషిగా తీర్చిదిద్దాలనుకున్న స్నేహితురాలి సాంగత్యంలో మారినట్లే కనుపించినా ఆచరణలో విఫలమై ఎప్పటిలాగే మిగిలిపోయింది ఫలితంగా జీవితంలో ఆమె కావాలనుకున్నవన్నీ దూరమై ఏ సుఖాలూ దక్కకుండా పోయాయి. చివరికి రెండో పెళ్ళివాడి సగసన వధువుగా కూర్చోవలసి వచ్చింది.

అందుకు సిద్ధపడినా కనీసం భర్త సాహచర్యంలోనైనా మట్టిముద్ద లాంటి ఆ అందం లేని

# లావణ్య

లో చైతన్యం కలుగలేదెందువల్ల ?

ఆమెని మార్చాలని విశ్వప్రయత్నం చేసిన స్నేహితురాలి వైఫల్యానికి కారణాలేమిటి ?

ఎంత కన్నపేగు అయినా ఆప్యాయతతో హద్దులుమీరితే కలిగే దుష్పరిణామాన్ని తెలియజేసే

**జి. హేమంత**

రచన 'లావణ్య' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : జేవీ

2,3 కవర్లు : మోహన్ కుమార్ శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్రతాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

చతుర, ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# మామిడి చెట్టుకు జామకాయలా?

ఓ మామిడి చెట్టు ఉంది. అది మామిడి కాయలు కాస్తుంది. అయితే, అది మామిడికాయలు కాస్తుంది గనుకనే దాన్ని మామిడి చెట్టు అంటున్నామా? మామిడిచెట్టుకు మామిడికాయలు కాయకపోతే మాత్రం దాన్ని మామిడి చెట్టు అనమా? అది మామిడిచెట్టు గనుక ఎప్పుడైనా కాయలంటూ కాస్తే మామిడికాయలే కాస్తుంది. కాని జామకాయలు కాయదు. మరో విషయం ఏమిటంటే, మామిడి చెట్టుకు కాపు ఉన్నా లేకున్నా అది మామిడి చెట్టే అవుతుంది. ఎంచేతనంటే మామిడికాయలు లేని మామిడి చెట్టును పట్టుకొని జామచెట్టు అని పిలవం. కాపును బట్టి చెట్టుకు పేరు పెట్టం. కాని చెట్టును బట్టి కాపు ఉంటుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే మామిడిచెట్టు పుట్టుక మామిడి విత్తనం లోంచి మామిడి చెట్టుగా పుడుతుంది, మామిడిచెట్టుగా పెరుగుతుంది. తర్వాత ఫలిస్తే మామిడికాయలే కాస్తుంది. కాయలు కాయకపోయినా మామిడి చెట్టే అవుతుంది. మామిడి స్వభావాన్నే సంతరించుకొంటుంది.

ఒకవేళ పాప పుణ్యాలను వివేచించడం చేత ఏ మనిషైనా పాప కార్యాలు చేయడం మానివేసినా పుట్టుకతోనే, సహజంగానే పాపమును సంతరించుకొన్న మనిషి పునీతుడెలా కాగలడు? అంచేత పాపం చెయ్యని మనిషి కూడా పాపి అనే అర్థమవుతోంది. కాకపోతే పాపం చేసిన మనిషి మరింత పాపాత్ముడవుతుంటాడు.

పోతే, పాపాత్ములంతా నరకానికే వెళ్తారు అనేది మనం సర్వసాధారణంగా అంగీకరించే సత్యం. అలాంటప్పుడు మనం నరకం నుండి తప్పించుకొనేందుకు మార్గం ఏదీ లేదా అనే తలంపు మనలో కలిగితీరుతోంది. ఏ పాపాత్ముడైనా నరకం నుండి తప్పించుకొనే మార్గం, స్వర్గ ప్రాప్తిని పొందేందుకు సోపానం ఒకటుంది. "నేనే మార్గం, సత్యం, జీవం" అన్నాడు యేసుక్రీస్తు ప్రభువు. ఆ యేసు స్వామిని తెల్సుకోవడం ముక్తి యోగం లభించడమే అవుతుంది.

—బి. వి. ప్రతాప్ కుమార్.

ముక్తిమార్గమైన యేసు స్వామిని గూర్చి వివరంగా తెలియజేసే ముచ్చటైన పుస్తకం కోసం నేడే మాకు వ్రాయండి. ఉచిత బహుమతిగా మీకు పంపిస్తాము.

ఎ. ఎం. జి. ఇండియా, పో. బాక్సు. 1820, హైదరాబాదు-500020.

# పగ

ముసలి సర్పంచ్ తన ఇంట్లో పని చేస్తున్న గౌరిని బలవంతంగా లొంగ దీసుకుని అనుభవించాడు. ఫలితంగా గౌరి గర్భవతి అయింది. ఇప్పుడు తన గతేం కావాలని గౌరి ఏడుస్తూ నిలబడింది. సర్పంచ్ కాసేపు ఆలోచించి ఓ ఉపాయం చెప్పాడు.



తను మర్నాడు పంచాయితీ ఏర్పాటు చేస్తాడు. గౌరి అప్పుడు తనకు నచ్చిన యువకుడు పేరు చెబితే ఆ యువకుడు ఎవడైనా సరే అతడితో పెళ్ళి జరిపిం చేస్తాడు. గౌరి సరేనని ఒప్పుకుంది. ఎందు కంటే ఆ గ్రామంలో సర్పంచ్ మాటకు తిరుగులేదు. రెండో రోజు పంచాయితీ ఏర్పాటైంది. గ్రామ ప్రజలంతా హాజరయ్యారు. అప్పుడు అందరి సమ క్షంలో సర్పంచ్ గౌరిని అడిగాడు.

"చెప్పు-ఈ పాపానికి ఒడిగట్టిన వాడె వడో చెప్పు. ఇప్పుడు, ఇక్కడే వాడితో నీ పెళ్ళి జరిపించేస్తాను"

దాదాపు గర్జిస్తున్నట్టు ప్రశ్నించాడు సర్పంచ్. గౌరి హడలిపోయింది. కంగారు పడి తత్తరబి త్తరగా చూసింది.

"అయ్యా! అతడు...అతడే...! మీ కొడుకు?" గౌరి శాంతంగా జవాబిచ్చింది అయ్యగారి పక్కనే కూర్చున్న అందాల కుర్రాడిని చూస్తూ. అది విన్న సర్పంచ్ నెత్తిన పిడుగు పడినట్టైంది. సభికులు చప్పట్లు కొట్టేరు.

# చతుర

# కిరణాకొట్టు

మహాకవి సుబ్బశ్రీగారి సినీరంగ ప్రవేశం చాలా గమ్మత్తుగా జరిగింది. ఆయన గతంలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం మీద అభ్యుదయ పరంపరాభివృద్ధిన ఓ కావ్య ఖండిక రాసి ఖ్యాతి గడించాడు. అదో ఉర్దూ కావ్యానికి పచ్చి కాపీ అని ఓ బుడు గేశ్వరరావు రీసెర్చి చేసి ఆ తరువాత ప్రచారం చేసినా ఆయన ప్రఖ్యాతికి లోపం రాలేదు.

అసలు సంగతేమిటంటే ఆమధ్య సుబ్బశ్రీగారికి సినీకవినవ్వాలని ఓ గాఢ కోరిక మెడచుట్టూ పాములా చుట్టు కుంది. వెంటనే కార్యరంగంలోకి దూకాడు. అప్పటికి 'న్యాటవల్ కుమార్' ఫీల్డులో





# కతలు

పెద్ద హీరో. ఈ హీరోకు ఆపేరు రావటం వెనుక ఓ చిన్న కథ వుంది. షాటు షాటుకి ఆయనకో కొత్తటవల్ అందిస్తుండాలి. హీరోగారు దాంతో నటనా స్వేద బిందువులు అద్దుకుని వెంట తెచ్చుకున్న బాగ్‌లో పడేసాడు. మళ్ళీ కొత్తటవలు... టవళ్ళు అందించలేక విసిగిపోయిన నిర్మాతలు ఆయనకు 'న్యూటవల్ కుమార్' అని పేరు పెట్టేశారు.

సదరు న్యూటవల్ కుమార్ చుట్టూ వందసార్లు తిరిగి ఎవరూ చూడకుండా కాళ్ళు కూడా పట్టుకుని ఓ సినిమాకు ఊరికే పాటలు రాసే పనిని స్వంతం చేసుకున్నాడు. ఇదేమిటి ఫీల్డులో ఇంత మంది వుండగా అవకాశం వీరికిచ్చే రేమిటని న్యూటవల్ బంధువులు ప్రశ్నించారు.

"పర్వాలేదు బ్రదర్...మీడియోకర్ బ్రెయిన్...పనికొస్తాడు అదీకాక తను స్వంతంగా రాయలేకపోతే కాపీకొట్టి అయినా రాసిస్తాడు. ఇతర భాషలు తెలిసిన ఇలాంటి తెలుగు కవుల వల్ల మనకు చాలా లాభం" అని జ్ఞానోపదేశం చేశాడు న్యూటవల్.

ఆ చిత్రం హిట్టైంది. సుబ్బశ్రీ దాంతో సినీకవిగా పేరొచ్చి స్థిరపడిపోయి బోలెడు - బోలెడు పాటలు రాసేసాడు. వాటిల్లో చాలామటుకు హిందీ సినిమా పాటలకు మక్కికి మక్కి కాపీ అని గిట్టనివాళ్ళు ఎంత మొత్తుకున్నా ప్రొడ్యూసర్లు మాత్రం వినలేదు.

ఇలా వుండగా ఓ ఘోరం జరిగి సుబ్బశ్రీగారి పాటల ఖ్యాతి పడిపోసాగింది. కొత్త కొత్తవాళ్ళు ఫీల్డులో కొచ్చి చాకులు, బాకులు దూసేస్తున్నారు. దాంతో సుబ్బశ్రీగారికి దిగులు పట్టుకుంది. వెంటనే ఓ ఉపాయం ఆలోచించాడు. ఎవ్వరూ తన దగ్గరకు పాటలురాయమని రాకుంటే మానే తనే వాళ్ళ దగ్గరకు వెళ్ళి రాసాడు. వెంటనే దీన్ని కూడా ఆచరణలో పెట్టేసాడు. కొందరు మొదట్లో మొహమాటానికి ఇచ్చారు. కానీ తరువాత అదీ బంద్ అయింది. సినిమా పేరు



రిజిస్టరు చేసుకుని, షూటింగు ఒక షెడ్యూల్ పూర్తి చేసుకున్న నిర్మాతలు కూడా సుబ్బశ్రీతో అబ్బే ఈ సినిమా మాది కాదండి అని అబద్ధం ఆడేస్తున్నారు.

ఇలా కాదని మరో ఉపాయం ఆలోచించాడు. ఫలానావాడు ఫలానా కథను ఆధారంగా చేసుకుని ఫలానా చిత్రాన్ని నిర్మిస్తున్నాడు అన్న విషయాన్ని అభిజ్ఞవర్గాల ద్వారా నిర్ధారణగా తెలుసుకుని ఆయా దృశ్యాలకు సరిపడ


మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!
CHARMINAR
THE VAZIR SULTAN
TOBACCO CO LTD
10 CIGARETTES

పాటలు రాసుకెళ్ళి ప్రొడక్షన్ ఆఫీసులో బైఠాయించేయసాగాడు. అదీ కొంతకాలం నడిచింది. కానీ అతి త్వరలోనే ఇదీ బెడిసి కొట్టింది. సుబ్బుశ్రీని అంత దూరంనుంచి చూడగానే ప్రొడక్షన్ ఆఫీసుల తలుపులు ఠక్కున మూసుకుపోసాగాయి.

అయినా తన పట్టు విడవక ఆ రోజు ఫలానా చిత్రానికి పాటలు రాసుకుని నేరుగా నిర్మాత ఇంటికి వెళ్ళాడు. నిర్మాత సుబ్బుశ్రీని చూసి ఆశ్చర్యపోయి ఎలాగోలా వదిలించుకుందామని చిన్న అబద్ధం ఆడేడు.

"మాది చాలా చిన్న ప్రొడక్షన్‌సార్! అన్నీ ఓ కొత్తకుర్రాడి చేత రాయిస్తున్నాను. కుర్రాడికి ఎంకరేజ్‌మెంటుగానూ, ఇటు మాకు తక్కువ రేటులోనూ పాటలువచ్చి ఉభయతారకంగా వుంటుంది. మీరు పెద్దవారు. పాటకు కనీసం 500 రూ. ఇవ్వాలి. అంతకు తక్కువ ఇచ్చి మిమ్మల్ని అవమానించలేను కదా!" అన్నాడు. సుబ్బుశ్రీ చకచకా మరో ఉపాయం ఆలోచించి అన్నాడు.

"ఏ కుర్రాడి చేత రాయిస్తున్నారు"

"ఫలానా..."

"పాటకెంతిస్తున్నారు"

"వంద"

"ఇవిగో ఈ పాటలు తీసుకోండి. ఒక్క పాటకు యాభయ్యే ఇవ్వండి నేను కాదన్నానా? ఆపులు మీరు" అంటూ గబుక్కున లేచి పాటల దొంతిని నిర్మాత జేబులో కుక్కేసాడు.

నిర్మాత ఆశ్చర్యంలోంచి తేరుకోక మునుపే "డబ్బులు తరువాత పంపించండి" అంటూ అక్కడనుంచి బయటికొచ్చేశాడు.

ఆ మర్నాడు ప్రొడ్యూసరిగారి కుర్రాడొకడు 'ఆ పాత్రి[illegible]' మొహాన్న కొట్టేసి ఓ ఉత్తరం చేతిలో పెట్టి పారిపోయాడు. ఆ ఉత్తరంలో ఇలా ఉంది—

"అయ్యా ! క్షమించాలి. మా కుర్ర కవిగారికి మీ సంగతి చెప్పగా 'అయితే నేను పాతిక రూపాయలకే రాసిస్తా నన్నారు. కనుక మీ మహా కవితలను వాపసు పంపేస్తున్నాం."

# సహకారం



రామప్పపంతులు గారికి, పాఠం చెప్పటం అవగానే తన క్లాసులో పిల్లలకు మంచి నీతి కథలు, సత్ప్రవర్తనను గురించిన మంచి నిజఘటన చెప్పటం అలవాటు. అలా చెబితే పిల్లలు మంచి నడవడికను అలవర్చుకొని సమాజాభ్యుదయానికి పాటుపడతారని ఆయన నమ్మకం. ఆరోజు కూడా పాఠం చెప్పటం ముగిశాక అంగవైకల్యంకలవారికి

# మదిలో ప్రియ మెదిలేదెప్పుడు?

## ఎల్ల వేళలా...

ఉదాహరణకు ప్రయాణాల్లో...

నవులూరించే 'ప్రియ' అల్లం, టొమాటో పచ్చళ్ళు ప్రయాణ సమయాల్లో ఆదుకొనే నేస్తాలు. ఇడ్లీ, వడ, పూరీ, సాండ్‌విచ్... ఏదయినా సరే-'ప్రియ'తో జోడించండి. ఆ రుచి అద్భుతం!

మామిడికాయ, నిమ్మకాయ, గోంగూర, అల్లం, టొమాటో... అన్నీ మీకు నచ్చే పచ్చళ్ళే. తెలుగు నేల నాలుగు చెరగులా గాలించి తెచ్చిన పళ్ళూ, కాయలకు తగుపాళ్ళలో నాణ్యమయిన మసాలాలు మేళవించి, అధునాతన కర్మాగారంలో, అత్యంత పరిశుభ్రమయిన వాతావరణంలో తయారుచేసిన పచ్చళ్ళివి.

మీకిష్టమయిన 'ప్రియ' పచ్చడిని ఈరోజే కొనండి. మీరు వెచ్చించే ప్రతిరూపాయికి మించిన కమ్మదనాన్ని రుచి చూడండి.

ప్రియ పచ్చళ్లు 300 మరియు 650 గ్రాముల సీసాలలో లభిస్తాయి

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound, Somajiguda
Hyderabad-500 004



ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

KIRON/PF/ 8012TEL

సహాయపడటం గురించి చెబుతూ గుడ్డి వాళ్ళను రోడ్డు దాటించటం మహా పుణ్య కార్యమని చెప్పారు.

రెండోరోజు ముగ్గురు పిల్లలు క్లాసుకు ఆలస్యంగా హాజరయ్యారు. కారణమేమిటి అని కోప్పడ్డారు ఆయన.

'ఒక గుడ్డి ముసలమ్మను రోడ్డు దాటించి రావటం వల్ల' ఆలస్యమైందని ముగ్గురూ ముక్త కంఠంతో జవాబిచ్చారు. రామప్ప పంతులు సంతోషించి- "మీరు ముగ్గురూ కలిసి చేశారా? ఈ మాత్రానికి ముగ్గురెందుకురా?" అని అడిగారు నవ్వుతూ.

ఈసారి కూడా ముగ్గురూ ముక్త కంఠంతో అన్నారు - "అవును సార్... ముగ్గురం కలిసే చేశాం! అసలైతే ఆ ముసలమ్మ 'ఇక్కడ నీడ వుంది నన్ను వదిలి పెట్టండి. ఇక్కడే ఉండనివ్వండి బాబూ!' అని మొత్తుకుంది. అయినా సరే మేం ఊరుకోకుండా ఆ ముసలమ్మని మోసుకెళ్ళి రోడ్డుకు ఆవైపున కూర్చో బెట్టి మరీ వచ్చాం. అందుకే ముగ్గురం కలిసి చేయాల్సొచ్చింది సార్" అన్నారు సగర్వంగా.

రామప్పపంతులుగారు ఆ రోజు నుంచి క్లాసులో మళ్ళీ నీతి కథలు వగైరా చెప్పిన పాపాన పోలేదు.

# తనదాకా వస్తే!

సబ్ ఇన్స్పెక్టరు ఎదురుగా ఒక యువతి నిలబడివుంది. ఇద్దరు కానిస్టేబుల్స్ ఆమెను రకరకాల మొరటు ప్రశ్నలతో హింసిస్తున్నారు. యువతి మౌనంగా నిలబడివుంది. ఆమె కళ్ళలోంచి కన్నీళ్ళు జారుతున్నాయి. సర్దాగా సిగరెట్ తాగుతూ ఆ దృశ్యాన్ని విలోకిస్తున్నాడు యస్. ఐ. అంతలో యువకుడు హడావుడిగా స్టేషన్లో కొచ్చాడు. అతణ్ని చూడగానే యస్. ఐ. కానిస్టేబుల్స్ వైపుతిరిగి ఏదో సైగచేశాడు. వెంటనే కానిస్టేబుల్స్ ఆ యువతిని బర బరా ఈడ్చుకుంటూ లోపలకు తీసుకెళ్ళారు.

యస్. ఐ. వెంటనే యువకుడివైపు చూచి నవ్వుతూ అడిగాడు.

"చెప్పండి...ఏం పనుండివచ్చారు?"



"ఒక అమ్మాయిని కొంతమంది గూండాలు బలవంతంగా ఎత్తుకెళ్ళిపోయారు? రిపోర్టు ఇద్దామని వచ్చాను."

"ఆ అమ్మాయి మీకేమౌతుంది?"

యువకుడు ఏమని చెప్పాలా అన్న ఆలోచనలో పడ్డాడు.

"మీ సిస్టరవుతుందా?" యస్. ఐ. యువకుడి మౌనం వీడకముందే మళ్ళీ అడిగాడు.

"కాదు"

# తెలుగు సినీ పత్రికా రంగంలో అగ్రగామి

## జ్యోతిచిత్ర

కన్నుల కింపైన వర్ణ
చిత్రాలతో

కవ్వించి నవ్వించే
సెట్సుపై కబుర్లతో

ముచ్చట గొలిపే
తారల ముచ్చట్లతో

ఇంటింటా
తారాతోరణంగా
వెలువడుతున్న
రంగుల హరివిల్లు



"మరైతే రిపోర్టు రాయించటానికి మీరెందుకొచ్చినట్టు? ఆ అమ్మాయి తల్లి దండ్రులు లేరా?"

"తండ్రి వున్నాడు"

"అయితే ఆయన వచ్చి రిపోర్టు ఇవ్వ లేడా?"

"బహుశా ఇంకా ఆయనకీ విషయం తెలిసివుండదు. ఆయనో పోలీస్‌స్టేషన్‌లో పనిచేసాడు. ఆ అమ్మాయి నా క్లాస్‌మేట్"

"ఏం పనిచేస్తాడు స్టేషన్లో"

"సర్కిల్ ఇన్‌స్పెక్టర్"

"ఆయన పేరు తెలుసా మీకు?"

"తెలీదండీ! అసలు మా కాలేజీలో ఎవరికీ ఆ అమ్మాయి సర్కిల్ కూతురని తెలీదు. ఆ సంగతి చెప్పుకోడానికి ఆమెకు సిగ్గులెండి" అది చెప్పి యువకుడు బయటకు వెళ్లిపోయాడు.

యస్. ఐ. కెవ్వున కేకవేసి తనూ బయటకు పరుగెత్తాడు.

— గౌస్

# పాత చిట్కా కొత్త చిక్కు

వెంకటేశ్వరా మెడికల్ షాపు ప్రొప్రైటర్ తిరపతిరావు గుండు తడుముకుంటూ రోడ్డుకేసి చూస్తున్నాడు. ఆ వీధిలో అతనొకటే మెడికల్ షాపు. అంచేత గిరాకీ బాగానే వుంటుంది. రోడ్ల మీద వాహనాలు హడావిడిగా కొంపలు ముంచుకుపోతున్నట్లు పరుగులు తీస్తున్నాయి. అంతలో షాపు ముందో అంబాసిడర్ కారాగింది. అందులోంచి ఓ భారీ కాయం దిగి తిరపతిరావు వేపు నడిచింది. కారులో ఎవరో కూర్చున్న గుర్తుగా చీర చెంగు రెపరెపలాడుతూ కనిపిస్తోంది.

తిరపతిరావును సమీపించిన ఆ వ్యక్తి "ఏ ... మయ్యా... హె ... హెక్కిళ్ళకేమైనా హె...మందుందా!" అనడిగాడు. వెంటనే అతని చెంప ఛెళ్ళుమంది. ఆ వ్యక్తి కళ్లు గిరాగిరా తిరిగి సప్తర్షి మండలం చూసొచ్చాయి. బుగ్గ ఎర్రగా కందిపోయి, కళ్లంట నీళ్లు తిరిగాయి. ఆ దెబ్బతో ఎక్కిళ్లు ఠక్కున కట్టేసేయి.



అయినా ఆపుకోలేని కోపంలో – "ఏమయ్యా! ఎక్కిళ్లు తగ్గేందుకు నువ్వు ప్రయోగించిన చిట్కా బావుంది గానీ బయట కారులో మనల్నే చూస్తున్న నా భార్య ఎదురుగా నువ్విలా చెయ్యటం ఏం బాగోలేదయ్యా! ఇహ మీదట ఎక్కిళ్లు వచ్చినప్పుడు నా చెంపలు... బాబోయ్..." తలుచుకుంటూ బావురుమన్నాడా భారీవ్యక్తి.

—కిల్లాన మోహన్‌బాబు

"కంగ్రాచ్యులేషన్స్. ఆడపిల్ల!" ఆత్రంగా ఎదురుచూస్తున్న భాను మూర్తికి రిలీఫ్‌నిస్తూ చెప్పింది డాక్టర్.

"థేంక్యూ డాక్టర్..." అర్థోక్తిలో ఆగిపోయాడు మూర్తి.

"షి ఈజ్ ఆల్‌రైట్. కాకపోతే బాగా అలసిపోవడంవల్ల యింకా తెలివిరాలేదు. రండి బేబిని చూద్దురుగాని" అంటూ లోపలికి నడుస్తున్న డాక్టరుని అనుసరించాడు మూర్తి.

"ఇదిగోండి మీ పాప" అంటూ ఉయ్యాలలోకి చూపించి వెళ్ళిపోయింది డాక్టర్.

ఉయ్యాలలోకి చూసిన మూర్తి ఉలిక్కిపడ్డాడు. నల్లగా, సన్నగా, అసలు ఆకారమే లేనట్లున్న ఆ పిల్లను చూస్తుంటే వళ్లు జలదరించింది. తెల్లగా ఆరోగ్యంగా ఉండే పిల్లలే పుట్టగానే చూస్తే ఏదోగా అన్పిస్తుంది. అటువంటిది యిలా...!

తదేకంగా చూస్తున్న మూర్తి మనసులో ఏ మూలో అసహ్యం కలుక్కుమంది.

'అబ్బ! ఈ పిల్ల కోసమే కస్తూరి యింత కష్టపడింది! తెలివి వచ్చాక చూసి తట్టుకోగలదా? తన అందమైన కలల ప్రతి రూపం యిదని తెలుస్తే భరించగలదా' అనుకొంటూ అప్రయత్నంగా బెడ్ వైపు చూశాడు. పచ్చని ఛాయతో, అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్న ముక్కుతో, నల్లటి ముంగురులతో మబ్బుల చాటునున్న చందమామలా కనిపిస్తోంది. మూసివున్న కనురెప్పలు నల్లగా, పొడుగ్గా విశాలమైన కనుదోయిని సూచిస్తున్నాయి. పాలిపోయినట్లున్నా మొహంలో సంతృప్తి తొంగిచూస్తోంది.

'ఈ అందానికి దాసుడయ్యేగా అందరికీ దూరమయ్యింది!' తమకంగా చూస్తూ అనుకొన్నాడు మూర్తి. అంతలో వాస్తవానికొచ్చినట్లు ఉలిక్కిపడి ఉయ్యాలవైపు చూశాడు. ఆలసి కెందుకో నమ్మబుద్ధి కావడంలేదు. కాని...కాని ఇది ప్రయివేటు నర్సింగ్‌హోమ్, బాగా తెలిసిన డాక్టరు. ఏం జరుగుతుంది?

ఉయ్యాలకు, మంచానికి మధ్య అచేతనంగా నిలబడ్డ మూర్తిని చూసి ఇంజక్షన్ యిద్దామని వచ్చిన డాక్టర్ ఆశ్చర్యపోయి అంతలోనే మూర్తి బాధను అర్థం చేసుకుంది.

"అదేమిటలా ఉండిపోయారు మూర్తిగారూ! మీరేయిలా అయితే కస్తూరి అసలు తట్టుకోలేదు. భగవంతుడిచ్చింది స్వీకరించడమే మనపని. అయినా నాలుగు రోజులు పోయి వళ్లు చేస్తే పాప బాగుంటుంది. కనీసం మీ రంగన్నా రావల్సింది, ఏం చేస్తాం?" ఇంజక్షన్ చేస్తూ డాక్టరు అంటున్న ఊరడింపు మాటలకు మూర్తి సమాధానపడలేకపోయాడు.

"యింకాస్సేపటిలో తెలివి వస్తుంది. కాస్త కాఫీ తెప్పించి పట్టండి!" అని చెప్పి వెళ్ళిపోయింది డాక్టర్.

పోయినశక్తి కూడదీసుకొన్నట్లు ఒక్కసారి తల విదిలించి తనను తాను సర్దుకొని పైకి వచ్చాడు. వరండాలో కూర్చున్న ప్యూన్‌ను పిలిచి కాఫీకి పంపాడు. తిరిగి వచ్చి కస్తూరి మంచం పక్కనే స్టూలు మీద కూలబడ్డాడు.

ఏ క్షణంలో కస్తూరి కళ్ళు తెరుస్తుందో! 'పాప'ను చూడగానే ఏమంటుందో అన్న ఊహ అతని మనసుని నిలువనీయడం లేదు. ఇంతలో ప్యూన్




కాఫీ తెచ్చిపెట్టాడు.

"రాములూ! కాస ఈ నాలుగు రోజులు మీ ఆవిడను పంపవోయ్. పత్యం అదీ వండిపెడుతుంది. పసిపిల్ల చిన్నదికదా దానికేం తెలియదు. కాస్త సహాయం చేసిపెట్టు!" అన్నాడు ప్యూనుతో.

"అదేంటి బాబూ! అంతగా చెప్పాలా తప్పక పంపిస్తాను. మరి నేను ఆఫీసు కెళ్తానండయ్యా. తాసీల్దారుగారు ఏమన్నా కబురు చెప్తే వచ్చి చెప్తాను!" అంటూ తిరుగుముఖం పట్టాడు రాములు.

"పాపగార్కి అమ్మగారి రంగన్నా రాలేదండి!" అన్నాడు పోతూ పోతూ ఉయ్యాలలోకి తొంగిచూసి. ఏం చెప్పాలో తెలీక ఓ నవ్వు నవ్వి ఊరుకున్నాడు మూర్తి.

తలుపు దగ్గరగా వేసి వస్తున్న మూర్తి అప్పుడే కళ్ళు తెరచిన కస్తూరిని చూసి ఆత్రంగా దగ్గరకు వచ్చి "కాఫీ తాగుతావా? ఎట్లా ఉంది?" అన్నాడు. అతని గొంతులోని ఆప్యాయతకు కస్తూరి సిగ్గుగా కళ్ళు దించుకొంది.

"పాపా! బాబా?"

"పాప. ముందు కాఫీ తాగు!" అంటూ ఫ్లాస్కులోనుండి వంపబోతున్న మూర్తి చెయ్యి పట్టుకొంది.

"ఊహూ! ముందు పాపను చూపించండి. పాపను ఎత్తుకొన్న మిమ్మల్ని చూస్తే నాకు యింకేం వద్దు"

ఉయ్యాలచుట్టూ గుడ్డ ఉండడం వలన లోపలఉన్న పాపాయి కస్తూరికి కనపడటం లేదు. ఉద్విగ్నంగా ఎదురుచూస్తోంది. ఉయ్యాల దగ్గరకు వెళ్ళిన భానుమూర్తి భయంగా చూశాడు. కస్తూరి చూపులు వెగిరపడు తున్నాయి. పాపను గుడ్డలతో చుట్టి ఎత్తి పట్టుకున్నాడు.

అతని చేతుల్లోకి చూసిన కస్తూరి కెవ్వుమని అరచి గట్టిగా కళ్ళు మూసేసు కుంది. ఆ క్షణం కోసమే ఎదురు చూస్తున్న అతని మనసుకిపుడు రిలీఫ్‌గా ఉంది. ధైర్యంగా తీసుకొచ్చి పక్కలో వేశాడు. ఆ స్పర్శను తుళ్ళిపడ్డ కస్తూరి...

"అబద్ధం. నా పాపకాదు!" అంటూ ఏడవసాగింది.

"ప్లీజ్ కస్తూరీ! ముందు కాఫీతాగు. మన పాపే. కాస నల్లగ ఉందిగాని దానికేం! మనకేది ప్రాప్తమో అంతే జరుగుతుంది. బాధపడ్డం ఎందుకు?" ఊరడింపుగ అంటున్న మూర్తి చెయ్యి పట్టుకుంది కస్తూరి.

"ఏమండీ! నేనేం పాపం చేశాను? అయిదేళ్ళనుండి కలలు కన్నది దీనికోసమా" అంటూ బావురుమంది.

భానుమూర్తి మౌనంగా ఉండి పోయాడు. ఆ మౌనంలో అతనికి గతం కనిపిస్తోంది. పిల్లలకోసం ఆత్రపడు తూనే అయిదేళ్ళు గడిచిపోయాయి. నెల తప్పిన జాడ తెలిసిన క్షణంలో కస్తూరి ఎంత పొంగిపోయిందని.

"ఇంక నాకేం బెంగలేదండీ! మనల్ని కట్టిపడవేసే గట్టిముడి పడబోతోంది. ఇంక మీరు తప్పించుకొందామన్నా తప్పించుకోలేరు! అవునా?" మెరిసే కళ్ళతో గర్వంగా అంటుంటే, ఆ అందాన్ని తనివితీరా ఆస్వాదించాడా నాడు. తమకి అందం లేదా? ఆరోగ్యం లేదా? రంగు లేదా? ఎంత అందమైన బిడ్డ పుట్టవలసింది! 'కర్మ' అంటే ఇదే కాబోలు.

అతని మౌనం ఆమె దుఃఖాన్ని మరింత ఎక్కువ చేసింది. పుట్టబోయే

బిడ్డను గురించి ఎన్నెన్నో బంగారు కలలు కన్న కస్తూరికిది అశనిపాతంలా ఉంది. అనునయించి కాఫీ తాగించే సరికి మూర్తి అలసిపోయాడు.

"బాధపడి ప్రయోజనమేమిటి కస్తూరీ! ఈ సారి అందమైన అబ్బాయిని కందువు గానిలే! ఇపుడిలా ఏడుస్తే ఆరోగ్యం పాడవుతుంది.మరి నేనెలా వెళ్ళను చెప్పు" అంటూ అనునయించాక, ఆ ఉధృతం తగ్గింది. సాయంత్రం వరకు అక్కడే ఉండి ఇంటికి బయలుదేరాడు- పని పిల్లను పంపిస్తానని చెప్పి.

* * *

మరునాడు కాస్త కోలుకొన్న కస్తూరి వాస్తవాన్ని స్వీకరించడానికి సిద్ధపడింది. నర్సు వచ్చి స్నానం చేసిన పాపను పక్కలో వేసింది. అప్పుడే కాఫీ పట్టుకొని వచ్చిన మూర్తి ఆ దృశ్యంచూసి ఊరట చెందాడు. అతన్ని చూసి మొహం తిప్పుకొంది కస్తూరి.



"ఇది మన ప్రేమకు ప్రతిరూపం, మన అనురాగానికి చిహ్నం" అంటూ గర్వంగా పాపను ఎతుకొని అతనికి చూపించి, ఆ కన్నుల్లో మెరిసే తృప్తిని ఆస్వాదించాలనుకొంది. కానీ ఆ ఆనందం దక్కలేదు.

"నేను చేసిన ఏ తప్పుకో శిక్ష ఇది" చిన్నగా నవ్వుతూ అంది కస్తూరి.

"ఛ అవేం మాటలు! తప్పంటూ చేస్తే ఇద్దరం కలిసే చేశాములే" అంటుండగా డాక్టర్ వచ్చింది.

"ఏమిటండీ, ఇద్దరూ కలసి బాధపడి పోతున్నారు. పాప గురించేనా ? బేబీ కేమండీ, కొంచెం వీక్‌గా వుంది అంతే! ఒళ్ళుచేస్తే మీ బేబీ ఫస్ట్‌గా ఉంటుంది" నవ్వుతూ అని వెళ్ళిపోయింది.

కాస్సేపు కూర్చుని మూర్తి వెళ్ళి పోయాడు. పాప కదిలి పాలకోసం వెతక సాగింది. ఒక్కక్షణం భయం తొంగి చూసింది. మరుక్షణం అయిదేళ్ళుగా తపిస్తున్న మాతృత్వం ఆ భయాన్ని పక్కకు నెట్టింది. దగ్గరగా తీసుకొంటు న్నపుడు ఆమె మనసులో రగులుతున్న ఆవేదన, ఒంటరితనం, ప్రేమ, అను రాగం అన్నీ కలగాపులగంగా ఒక్కదు టన బయటపడ్డాయి. "ఇది నాది, నా రక్తం పంచుకు పుట్టిన బిడ్డ ! నా నీడ!" అనుకొనేసరికి అవ్యక్తమైన ఆనందం కలి గింది. నిండు మనసుతో పాపను గుండె లకు హత్తుకుంది.

* * *

పది గంటలకు ఫ్యాన్‌తో కేరియర్ పట్టించుకొని వచ్చాడు మూర్తి. అతను దగ్గర ఉండి ఆప్యాయంగా భోజనం వడ్డిస్తుంటే అది అమృతంలాగే ఉంది. కానీ ఏదోలోటు ... ఏం మాట్లాడాలో తోచనట్లు ఇద్దరి మధ్యా మౌనం. ఏ మాట పైకి వచ్చినా అది మరొకరికి బాధ అవుతుందేమోనన్న భయం ఇద్దర్నీ మాట్లాడనివ్వలేదు. భోజనం అయి పోయింది.

"నేను ఆఫీసుకి వెళ్ళొస్తాను కస్తూరీ మరోగంటలో పనిపిల్ల వస్తుంది. నేను సాయంత్రం వస్తాను!" అని చెప్పి వెళ్ళి పోయాడు మూర్తి.

అతను అలా వెళ్ళగానే వంటరితనం దెయ్యంలా మీదపడి ఉలిక్కిపడింది కస్తూరి. "అబ్బ ! ఎంత వంటరితనం ? అంతా వంటరితనమే కావాలని కోరి తెచ్చుకొన్న వంటరితనం, జీవితాన్ని ఏమర్చాలని వంటరితనం. అంతా ఉన్నారు. అయినా వంటరితనం మనసుకి కాదు మనిషికి. ఎందుకని? సంఘం దృష్టిలో తనులేచిపోయిన మనిషి.అందుకే ఈ తెరచాటు, ఈ ఒంటరితనం లేకపోతే ఇలా అయినందుకు అమ్మమ్మ, తాతయ్య ఎంత సంతోషించేవాళ్ళు! ఎంత ఘనంగా చేసేవారు. తన తెగింపు తన బిడ్డలను దురదృష్టవంతులను చేసింది. అయినా తను తప్పుచేసిందా ? ఏమో ఈ సమ యంలో ఇట్లా అనిపిస్తుందిగాని, ఈ అయిదేళ్ళుగా తనెప్పుడూ చేసిన పనికి బాధపడలేదు, ఆ అవసరం కలుగలేదు. ఇది తప్పయితే తనింత సుఖంగా ఎట్లా ఉండగలుగుతుంది? ఈ పనే చెయ్యకపోతే తన జీవితం ఎలా ఉండేదో? ఎలా ఉన్నాయింతకన్నా బాగా మాత్రం ఉండేది కాదు. మూర్తి...బాసు మూర్తి తననేనాడు మనసులో నిలుపుకొని ఆరాధించ నారంభించాడోగానీ ఈనాటికీ ఆ ఆరాధన, ప్రేమ ఏమాత్రం తరగ





లేదు. తమ దాంపత్యం నిత్య నూతనం. ఆరోజు ధైర్యం చేయలేకపోతే తనీ జీవన మాధుర్యానికే దూరం అయిఉండేది. తాతయ్య తెగల సంబంధం తన ఆశలకు, కోర్కెలకు వెయ్యో వంతయినా రూపం యిచ్చేది కాదని మాత్రం తనకు ఖచ్చితంగా తెలుసు. ఛాందసుడైన తాతయ్య తనను క్షమించలేకపోయాడు. మూర్తి కులం తక్కువ కావొచ్చు. భార్యాపిల్లలు ఉండొచ్చు, లోకం దృష్టిలో తాముచేసింది అన్యాయం, నీతిమాలిన పని కావొచ్చు. కాని ఈ ఆనందం ఎలా వస్తుంది? మనిషి సుఖపడ్డానికి ఈ నియమాలు అడ్డువస్తే, ఎవరికి కావాలి అవి? అలా అన్నీకాదని ఆనందిస్తున్నామనేనేమో భగవంతుడీ విధంగా శిక్షించాడు. మూర్తికి, తనకు జంట ఎంతబాగుంటుంది! అటువంటి తమకి యిలాంటి పిల్ల పుట్టడం దుర దృష్టం కాకపోతే మరేమిటి?తనెన్ని కలలు కంది! ఆడపిల్లలు లేని అతనికి అందమైన ఆడపిల్లను కని, ఆనందపరచాలనుకొంది. కాని యిలా జరిగింది. కాస్త పెద్దయ్యాక న్నా బాగుంటుందో లేదో ?

పిల్ల ఏడవడంతో ఉలిక్కిపడింది కస్తూరి. 'ఛ...ఛ... యిదేమిటి తనే యిలా ఆలోచిస్తే ఆయనకెలా ఉంటుంది? ఏది ఏమైనా, ఎలా ఉన్నా యిది తమ కలల పంట. ప్రేమకు ప్రతిరూపం. 'నాది' అనుకొనే బంధం. నా చిన్నారి తల్లి!' అనుకొంటూ ఎత్తుకొంది. ఆలోచనలు ఓ కొలిక్కి వచ్చినట్లు చుట్టు తిరిగి పిల్ల మీదకే కేంద్రీకరింపబడడంతో ఆపలేని తమకంతో గుండెలకు హత్తుకొంది.అనిర్వచనీయమైన ఆనందంతో తృప్తిగా కళ్లు మూసుకుంది. 'పాప'కి ఏ పేరు పెడితే బాగుంటుందో ఆలోచించసాగింది.

తనెప్పటి నుండో ఆడపిల్లయితే లావణ్య అని పేరు పెట్టాలనుకొంది. పుట్టింది ఆడపిల్లేగానీ ఆ పేరుకు తగినట్లుగా మాత్రం లేదు. ఆ... పాప యిలాగే ఉండిపోతుందేమిటి? 'కాలాని కొస్తే కాకయినా రూపుకొస్తుంది.' అంటారు. వయసు వచ్చాక ఆ మాత్రం బాగుండక పోతుందా? అయినా అందరూ మనుషలకి తగినట్లుగానే పేర్లు పెట్టుకొంటున్నారా? ఆ పేరే పెట్టాలి అని ఆలోచిస్తూండగా పనిపిల్ల వచ్చింది.యింటి సంగతులు అడుగుతూ మామూలుగా అయిపోయింది కస్తూరి.

* * *

కస్తూరి పాపను తీసుకొని యింటికి వచ్చేసింది. పాపను చూసేందుకూ, యితరపనులకూ సాయంగా మనిషిని పెట్టాడు మూర్తి. పైగా పనిపిల్ల ఉండనే ఉంది. యిక పెద్దగా పనిలేక పోవడంతో రోజులో పదిహేనుగంటలు కూతుర్ని అపురూపంగా చూసుకోవడంతోనే గడిచి పోయేది. భర్త సాయంత్రం వచ్చేసరికి పగలంతా కూతురితో ఎట్లా గడిచిందో కబుర్లు చెప్పేందుకు ఎదురుచూస్తుండేది. చిన్న పిల్లలా కళ్లింతలుచేసుకొని చెప్తున్న కస్తూరి కబుర్లు అతన్నేలోకాలకో లాక్కుపోయేవి.

"ఈ పిల్ల మోజులో పడి తనూ అందరి ఆడవాళ్లలాగే తయారవుతుందేమో"అనుకొన్నాడు మూర్తి. కానీ తద్భిన్నంగా పూర్వం కంటే చలాకిగా, తపనగా తన రాకకోసం ఎదురుచూస్తుంటే, తనకు తొలిరోజులలోలాగే ఉంది. కస్తూరి చాలా తెలివయినది. వయసు చిన్నదయినా ఎంత నేర్పు. పగలంతా పాపను ఒక్క

షణం వదలని కస్తూరి తనొచ్చే వేళకు మాత్రం చక్కగా తయారయి పిల్లను పనిపిల్లకు అప్పచెప్పి తనతోడిదే లోకంగా ఉంటుంది. ఆ నవ్వులు, ఆ కబుర్లలో తానొక బిడ్డకు తల్లినన్న భావమే రానీయదు. కస్తూరి లాంటి భార్య దొరకడం మగాడి అదృష్టం అనుకొంటూ ఆశ్చర్యపోతాడు భానుమూర్తి. అయినా అపశృతిలా అపుడపుడు అన్నపూర్ణ, పిల్లలు గుర్తుకువచ్చి ఒక్క క్షణం మామూలు మనిషిని చేస్తూంటారు. చూసి వద్దామని బయలుదేరాడు మూర్తి.

* * *

భోజనం ముగించి ఆరుబయట మల్లె పందిరి కింద మంచం వేసుకొని సిగరెట్టు త్రాగుతూ "కస్తూరి ఏంచేస్తూందో?" నన్న ఆలోచనలు రింగులు తిరుగుతూండగా పనులు ముగించుకొని వచ్చింది అన్నపూర్ణ.



"పోనీలెండి, ఆడపిల్లలేని లోటు తీరింది. ఆవిడ అదృష్టవంతురాలు" ంటూ పక్కనే కూర్చుంది.

ఆ మాటల్లోని అసూయ సూదిగా అతని గుండెను తాకింది. "ముగ్గురు కొడుకులను కన్న నీవదృష్టవంతురాలివా? ఆవిడా?" అన్నాడు నవ్వేస్తూ. హాల్లోనుండి మగపిల్లలు చదువుకోవడం వినిపిస్తోంది.

"ఇంటికి ఆడపిల్ల లక్ష్మి. ఆడపిల్ల ఉంటే ఇంటికి శుభం జరుగుతుంది.

పోనీలెండి! ఇంతకీ ఎవరి పోలిక, మీ పోలికేనా?" ఆసక్తిగా అడిగింది. ఆ ప్రశ్నకు భానుమూర్తి మొహం వాడి పోయింది. ఆవిడముందు తలవంచు కోవడం అవమానమనిపించింది.

"నాకు చేసిన అన్యాయానికి మంచి శాస్తి జరిగిందిలే" అని అన్నపూర్ణ పరిహ సిస్తున్నట్లు అనిపించి అతని అహం దెబ్బతింది.

"ఎలా ఉంటుంది? బాగానేఉంది" విసుగ్గా అన్న అతని తీరు అన్నపూర్ణ కళ్ళల్లో చివ్వున నీరు తెప్పించింది.

"అమ్మా!అన్నపూర్ణా మంచినీళ్ళు తెచ్చి పెట్టు" అన్న మామగారి కేకకు చటు క్కున లేచి వెళ్ళింది. పెద్ద భారం తీరినట్లు సిగరెట్టు విసిరేసి వెల్లికిలా పడుకొని ఆకా శంలోకి చూస్తుంటే, తండ్రి అన్నపూర్ణతో మాట్లాడ్డం వినిపించింది. భానుమూర్తి కస్తూరిని తీసుకొచ్చిన నాటినుండి ఆయన కొడుకుతో ఒక్క మాటా మాట్లాడలేదు. అన్నపూర్ణ కంటనీరు చూళ్ళేక ఆయన మూర్తి రాకను సహిస్తున్నారు. అంతే! విషయం పూర్తిగా తెలియని పిల్లలు మాత్రం తండ్రి అక్కడ ఉద్యోగం చేస్తూ అప్పుడపుడు తమను చూడ్డానికి వస్తున్నాడని అనుకొంటుంటారు. ఈమధ్యే పెద్దవాడు కరుణకు అసలు సంగతి చూచాయగ తెలిసినా ఎవరిని ఏమని అడగాలో అర్థంకాక ఊరుకొన్నాడు. కానీ తండ్రితో సరిగ్గా మాట్లాడలేక పోతున్నాడు. అడిగిన వాటికి యాంత్రి కంగా సమాధానాలు చెప్తున్న కొడుకుని సరిగా గమనించలేదు మూర్తి. నిద్రలో తూగుతున్న చిన్నవాడిని ఎత్తుకొని వచ్చి తన మంచం మీద వేసుకొంది అన్నపూర్ణ. ఎనిమిదేళ్ళు ఉన్నా వాడు మంచంలో సగం ఆక్రమించేసాడు. వాడి పక్కన చోటు చేసుకొంటూ భర్త మంచం వైపు చూసింది అన్నపూర్ణ. ఆ చిరు చీకట్లో అతను నిద్రబోతున్నాడో, చూస్తున్నాడో గుర్తించలేక నిట్టూరుస్తూ పక్కమీద ఒరిగింది. అలా అతన్ని మంచం మీద చూసినపుడల్లా అన్నపూర్ణకి తాము గడపిన దాంపత్యం గుర్తుకు వస్తుంది. ఈ అయిదేళ్ళుగా మూర్తిని అలా చూసి నపుడంతా, ఆ రోజు ఇపుడే జరుగు తున్నంత పచ్చిగా మనసును కుళ్ళ బొడుస్తుంది. ఆరోజు... ఎంత నిర్ద యగా,ఎంత నిర్భయంగా ఎంతస్వార్థంతో ఎంత సులువుగా చెప్పారు ఆ సంగతి.

"కస్తూరితో కాపరం పెట్టేశారన్న" సంగతి తెలిసి మామగారు చిందులు వేస్తుంటే,నమ్మలేని అశక్తతతో మూగగా తను భర్త రాకకోసం ఎదురు చూస్తుండి పోయింది. చీకటి పడ్డాక అలసటగా వచ్చిన భర్తకు వణుకుతూ నీళ్ళిచ్చింది. కేకలు వేస్తున్న తండ్రిని అట్లాగే వదిలి అన్నపూర్ణ రెక్కపట్టుకొని పడక గది లోకి లాక్కుపోయి తలుపు మూసాడు. పిల్లలు బిత్తపోయి చూస్తున్నారు. అయో మయంగా నిలబడ్డ అన్నపూర్ణ చేతులు పట్టుకొంటూ-

"పూర్ణా! నన్ను క్షమించమని అడగ డంలేదు. కానీ కానీ... కస్తూరి లేకుండా నేను బ్రతకలేనని చెప్పడానికి సిగ్గు పడుతున్నాను. ఇది మోహం అనుకో, వ్యభిచారం అనుకో, ఏమైనా అనుకో కానీ కస్తూరిని విడిచి జీవితాంతం నరకం అనుభవించే బదులు నిన్ను క్షమించ మనడం తేలిగ్గా తోచింది నాకు. చెప్పు పూర్ణా! నన్ను అర్థం చేసుకుని మన

పిల్లలకు తండ్రిగా ఈ ఇంటి బరువు బాధ్యతలు చూసే నీ మనిషిగా రమ్మంటావా, అదృష్టవంతుడినే! పూర్ణా నిన్ను, పిల్లల్ని అన్యాయం చెయ్యను, చెయ్యలేను. అయితే భర్తను మరో స్త్రీతో పంచుకోవడం బాధాకరమే కానీ, నా మనసు గురించి ఆలోచిస్తే నువ్వీ మాత్రం త్యాగం చెయ్యగలవు. నాకు తెలుసు పూర్ణా! నిన్ను బాధపెడుతున్నాను. కాని గత్యంతరం లేదుమరి.నన్నర్థంచేసుకో. బహిరంగంగా ఈ పని చేసానుకనుక అందరూ అడగగలుగుతున్నారు, కాని యిదే ఏ బజారు మనిషినో పెట్టుకుని వ్యభిచరిస్తే మీరంతా ఏంచేయగలరు? అందుకే నన్నర్థం చేసుకొని ఈ యింట్లో స్థానం నాకివ్వు. తెలివి తక్కువ తనంతో ఉన్నదాన్ని దూరం చేసుకోకు. నాన్నకి నువ్వేం సమాధానం చెప్తావోగానీ నువ్వు ఉత్తరం రాశాకే నేను మళ్ళీ యింట్లో అడుగు పెడతాను!" అంటుంటే ఆ తెగింపుకి అవాక్కయిపోయింది అన్నపూర్ణ. ఉప్పెనలా ముంచుకొస్తున్న దుఃఖాన్ని అదిమి పెట్టింది. "తనకు భర్త కాకపోవచ్చుకాని పిల్లలకు తండ్రిని దూరంచేసే పాపంగాని, హక్కుగాని తనకు వద్దు" అనుకొంటూ మామగారికి నచ్చచెప్పింది అన్నపూర్ణ. కానీ ఉత్తరం చూసుకొని వచ్చిన మూర్తి కృతజ్ఞతగా దగ్గరకు తీసుకోబోతేమాత్రం అగ్నిశిఖే అయ్యింది అన్నపూర్ణ. ఆరోజుతోనే ఆమె ఆనందాలు సమాధి చెయ్యబడ్డాయి. ఆ పల్లెలో మామగారి అండతో పొలం, యిల్లు, పిల్లలు, వాళ్ళ చదువులు చూసుకొంటూ తనలో తానే రగిలిపోతోంది. లావాను గుండెల్లో దాచుకొంటూనే నెల నెలా వచ్చి చూసిపోయే భర్తకు ప్రశాంతమైన చిరునవ్వుతో ఆహ్వానం చెపుతోంది. ఆమె ముఖంలో చిరునవ్వే అతనికి కొండంత ధైర్యం. ఆ ధైర్యంతోనే, ఆ ఆత్మవిశ్వాసంతోనే తోటివాళ్ళ మధ్యనుండి బంధువుల్లోనూ, సంఘంలోనూ 'మంచివాడే' నన్న పేరు తెచ్చుకొని తొందర్లోనే తలెత్తుకుని తిరుగగలిగేడు. అతన్ని చూసినపుడల్లా తను చేసిన త్యాగం కళ్ళముందు మెరుపులా మెరిగిపోతూ తననే భయపెడుతుంటే కసిగా తనను తాను ఆహుతి చేసుకుంటోంది అన్నపూర్ణ. ప్రతిసారిలాగానే ఈరాత్రీ ఆలోచనలు ఆమెను నిద్రపోనివ్వలేదు. అంతా తల్చుకొని ఏడ్చి ఏడ్చి మరీ నిద్రపోయింది.

అన్నపూర్ణ ఆవేదనను గమనిస్తున్న మూర్తి కళ్ళముందు కస్తూరి మెదిలింది. ఆమె తీయని చిలిపిమాటలు, చేష్టలు గుర్తు వచ్చాయి. పెద్దాడు పుట్టగానే అన్నపూర్ణ ఒక్కసారిగ ఎట్లామారిపోయిందో గుర్తు వచ్చింది. "పూర్ణా! జీవితంలోని మాధుర్యాన్ని అనుభవించడం తెలియని అతి మామూలు ఆడదానివి నువ్వు. కస్తూరి లాంటి వాళ్ళనుచూసి 'జీవితం జీవించడానికే' అని కొందరయినా తెలుసుకొంటే మగవాడెంత సుఖపడతాడు" అనుకొన్నాడు మొదటిసారిగా.

దగ్గరకు రానివ్వని ఆమె పట్టుదల చూసినపుడంతా ఒక సామాన్య పల్లెటూరి యువతిలోగల అభిమానానికి, అభిజాత్యానికి, ఆత్మస్థైర్యానికి అతనిలోని మానవుడు తలవంచితే, అతనిలోని పురుషాహంకారం మాత్రం కసిగా ఉసిగొల్పుతూ కవ్విస్తూంటుంది. కాని అతనిలోని 'మానవుడి' ముందు 'అహంకారం' ఎపుడూ

ఓడిపోతూ అన్నపూర్ణదే పైచేయి అని పిస్తుంది. యధాప్రకారం రెండు రోజులుండి తిరిగి బయలుదేరాడు. నైన్త్ చదువుతున్న పెద్దవాడు, ఎయిత్ చదువుతున్న రెండో వాడు శీను ఫీజు కట్టాలంటే డబ్బిచ్చాడు. స్కూలుకి వెళ్లి మంచి చెడ్డలు కనుక్కొన్నాడు. చిన్నవాడు మురళి యిచ్చిన బొమ్మల లిస్టు పట్టుకొని బస్సెక్కాడు.




ఆరు నెలలు యిట్టే జరిగిపోయాయి. కస్తూరి పాపను బేబీ అని పిలుచుకొంటోంది. అమ్మమ్మ పోయిందని తెలిసి. ఆరునెలల బేబీని తీసుకొని మొదటిసారిగ అయిదారేళ్ల తరువాత పుట్టిల్లు చేరింది. ఊరంతా మారిపోయింది. తాతగారు కూడా మారిపోయినట్లే ఉన్నారు. చంటి పిల్లనెత్తుకొని వస్తున్న కస్తూరిని ఏమన లేదాయన. యిరుగు పొరుగు, చిన్ననాటి స్నేహితులు అంతా కస్తూరిని చూసి, బేబీని చూసి పెదవి విరిచేసారు.

"అదేంటే అమ్మాయి! ఆర్నెల్ల పిల్ల అంటున్నావు, బొత్తిగా మూడునెలల పిల్లలా ఉంది. ఈ సరికి కూర్చోవడానికి పేచీ పెడతారు పిల్లలు" అంది పక్కింటి బామ్మ. అట్లాగే చూసిన వాళ్లంతా తలో మాట అంటుంటే, తను అనుకొన్నంత ఏక్టివ్‌గా వయసుకి తగినట్లు లేదని ఏడుస్తూకూర్చొంది. కార్యక్రమాలు అన్నీ జరిగాక తిరిగి భర్తతో బయలుదేరింది. తాతగారు ఏమీ అనలేదు.

"ఆస్తిఅంతా అమ్మాయిపేర రాసేసాను. ఏముంది... ఈ యిల్లు, ఏదో ఆ కొద్దిపొలం. నువ్వే దానికి దిక్కు!" గొంతు బొంగురుపోతుండగా భానుమూర్తికి అప్ప చెప్పారు.

"యిక్కడెందుకు?నాతోవచ్చెయ్యండి" అన్న కస్తూరి మాటలకు,

"ఇంత బ్రతుకు బ్రతికి... కుల భ్రష్టత్వం పొంది చావలేను. నన్నిలా ఉండనివ్వండి!" అనేసారు.

తిరిగి వచ్చిన దగ్గర నుండి కస్తూరి బేబీని డాక్టర్ల దగ్గరకు తిప్పుతూనే ఉంది. మందులు వాడుతూనే ఉంది. ఆ వయసు పిల్లల్లో ఉండే ఉత్తేజం ఏకోశానా లేని బేబీ పాలుత్రాగడం, అలాచూస్తూపడుకోవడం అంతే. కాస్త వళ్లు వెచ్చబడితే కస్తూరి చేసే హడావిడి అంతాయింతా కాదు. గంటకో రకంగా కూతుర్ని ముస్తాబుచేసి మురిసిపోవడంతో రోజు గడిచిపోయేది.

"ఏమండీ, బేబి పుట్టినరోజు వస్తోంది. ఓ బంగారు గొలుసు చేయించాలి. దీని కింకా జుట్టురాలేదు. ఏ మందయినా వాడితే వస్తుందేమో!" తనలోతను అనుకొన్నట్లు అంది కస్తూరి.

"అః చేయిద్దాం. పుట్టినరోజు అయితే ఏమిటి పార్టీ అదీ యిస్తావా, అందర్నీ పిలచి!" అన్నాడు.

ఆ మాట అనగానే మొహం ముడుచుకొంది కస్తూరి. ఈ ఊరువచ్చిన కొత్తలో జరిగిన అనుభవం గుర్తు వచ్చింది. పొరుగువారెవరో పేరంటంపిలిస్తేవెళ్లింది. అక్కడికి దురదృష్టవశాత్తు అన్నపూర్ణ

దూరపుబంధువు ఒకావిడ వచ్చి సూటి పోటీ మాటలనేసరికి, అందరికీ తనసంగతి తెలిసిపోయింది. విడ్డూరంగా చూస్తూ 'పిలిచి పొరపాటు చేశాము' అన్నట్లు మొహాలుపెట్టేసరికి అవమానంతో దహించుకుపోతూ ఇంటికి తిరిగివచ్చింది కస్తూరి. ఆనాటినుండి ఎవరితో పరిచయం పెంచుకోలేదు. ఎవరి గుమ్మం ఎక్కలేదు. ఏ కష్టమైనా, సుఖమైనా పంచుకొనేది భర్తతోనూ, పసిపిల్లతోనూ. అందుకే ముభావంగా–

"ఆఁ పార్టీలెందుకు? మనమే చాలు" అంది.

"అదికాదు కస్తూరీ, ఇలా ఒంటరిగా ఎన్నాళ్ళుండిపోతాం? ఏదో ఇలాంటి అవకాశాలు వచ్చినప్పుడే నలుగుర్నీ కలుపుకోవాలి. పిలుస్తే బాగుంటుందేమో!" అన్నాడు భానుమూర్తి.

ఆ మాటలకి గయ్యిమని లేచింది కస్తూరి.

"చూడండి! నాకు ఈ వేళాకోళాలు భరించే ఓపికా, సహనం లేవు. అక్కరలేదు. ఎవ్వరూ రానక్కరలేదు. మన పిల్లకు మన దీవనలు చాలు. చిన్నప్పటి నుండి నేను ఏ విషయంలోనూ, ఎవరితోనూ ఒక్క మాటకూడా పడలేదు. ఈ అమ్మలక్కలు నా గురించి చెవులు కొరుక్కోనక్కరలేదు. ఎవ్వరూ రానంత మాత్రాన నాకేం బెంగలేదు. ఒకళ్ళు ఆనందంగా వుంటే చూళ్ళేని ఈ మనుషులు, వాళ్ళ అసూయలు నాకు అసహ్యం" ఉద్రేకంగా అంటున్న కస్తూరిని ఆశ్చర్యంగా చూశాడు భానుమూర్తి.

కస్తూరి అనుకున్న ప్రకారం అన్నీ జరిగితీరవల్సిందేనన్న నిజం ఈ ఆరేళ్లలో భానుమూర్తికి బాగానే వంటబట్టింది. చిన్నప్పటినుండి ముద్దుగా పెరగడంతో అహం ఆమె అణువణువున వంటబట్టి సింది. అనుకున్నది ఏదో సాధించేస్తుంది. అందుకని ఇంకేం మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"బేబి పుట్టినరోజునాడే పేరు పెడదామండీ. నాకేమో లావణ్య అని పెట్టాలని ఉంది" అంది కూతుర్ని ముద్దులాడుతూ. భానుమూర్తికి నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు. అయినా ఆమె సంతోషాన్ని పాడు చెయ్యడం ఎందుకని "నీ యిష్టం" అన్నాడు నవ్వు తెచ్చుకుంటూ.

"దీనికి 'లావణ్య' అని పేరు పెడితే ఆ పేరులోని అందం, అర్థం మారిపోతాయి. మరి తల్లి మనసు అంటే ఇదే కాబోలు. తల్లి ప్రేమ అంతులేని సముద్రం వంటిదంటారు ఇందుకేనేమో!" అనుకున్నాడు మనసులో.

* * *

బేబీ పుట్టిన రోజు అమ్మా నాన్నల ఒడిలో కొత్త గౌనులో గొలుసుతో ముద్దుగా జరిగిపోయింది. ఆ రాత్రి దిష్టి తీస్తుంటే నవ్వుకొన్నాడు. నల్లగా, సన్నగా ఆకారం కూడా సరిగ్గాలేని ఆ కూతురిని చూస్తూ కస్తూరి పొందే ఆనందానికి నవ్వుకున్నాడు. పాపకు చిన్న చిన్న మాటలు వస్తున్నాయి. 'అమ్మ' అన్న పిలుపుకే కస్తూరి మనసు సముద్రంలా పొంగిపోతుంది. బేబికి ఊహ తెలుస్తున్న కొద్దీ చుట్టూ చూస్తే కనిపించేది అమ్మ, పనిపిల్ల ఇద్దరే. సాయంత్రమో, రాత్రో 'నాన్న' అనబడే వ్యక్తి కనబడేవాడు. తండ్రి ఎత్తుకొన్నపుడు ఆ స్పర్శలో ఏం గ్రహించిందో ఏమోగాని ఏనాడూ తండ్రిని చూడగానే మీదకు ఉరకలేదు. అతను కూడా

భార్య బాధపడుతుందేమో అని మాత్రమే ఎత్తుకుంటాడు- అదో డ్యూటీ అన్నట్లుగా. అలా అని తండ్రి ప్రేమకు పాపను దూరం చెయ్యలేదు. ఏం కావాలన్నా తెచ్చిపెడతాడు. ఆ చిన్ని పాప ప్రపంచంలో తోడు, నీడ, తల్లి, నేస్తం అన్నీ అమ్మే.అమ్మ.. అమ్మ అంటూ ఒక్క క్షణంకొంగు వదలని లావణ్యకి అమ్మే ప్రపంచం అయిపోయింది. పనిపిల్ల బయటకు తీసుకువెళ్తానన్నా అంతా చూసి వెక్కిరిస్తారనో, మరేదో ఊహించుకుని కస్తూరి తీసుకు వెళ్ళనిచ్చేది కాదు.

యిలా సాగిపోతున్న కాలంలో కస్తూరికి మరోసారి తల్లి కాబోయే సూచనలు కనబడ్డాయి. అదంతా కూతురి అదృష్టమేనని పొంగిపోయింది. కాని ఆ సంతోషం ఎంతో కాలం నిల్వలేదు. నాలుగవ నెలలో అబార్షన్ అయిపోయినపుడు భానుమూర్తి ఇటు లావణ్యతోను, అటు కస్తూరితోను నలిగిపోయాడు. అన్నపూర్ణ ముగ్గురి పిల్లల్ని కన్నా బారసాల నాడు పెళ్ళిపీటల మీద కూర్చోవలసి రావటం తప్ప ఏ బాధా పడవలసిరాలేదు. అందుకే కస్తూరితో చెప్పకుండానే ఆపరేషన్ చేయించేసుకున్నాడు. రెండవసారి యిలా అయిపోవడంతో కస్తూరి ఆశలు మరింతగా బేబీ చుట్టూ అల్లుకుపోయాయి. యింటికి వచ్చాక భర్త చేసిన పని తెలిసి నెత్తి, నోరు కొట్టుకుంది.

"నా ఆశలన్నీ నిరాశలుగా చేశావు. చిన్న ఒక్కదానికి తోడు లేకుండా చేసారు. అవునులెండి మీకేం? మీకు హాయిగా ముగ్గురు కొడుకులున్నారు. నాకు ఉన్న ఈ ఒక్క స్త్రీ అనారోగ్యం పిల్ల. అయినా అడగడానికి నేనెవర్ని? నాతో చెప్పి చెయ్యాల్సిన అవసరం మీకేమిటి?" అంటూ వారం రోజులు సాధించి వదిలిపెట్టింది. ఆ విధంగా 'మరి పిల్లలుండరు'అన్న ఊహ లావణ్యపై పిచ్చి ప్రేమగా మార్చింది. జలుబుచేస్తే డాక్టరు, దగ్గువస్తే డాక్టరు. ఏమితింటే ఏమౌతుందోనన్న భయంతో ఏమీ పెట్టేదికాదు కస్తూరి. ఆవిడ అతి ప్రేమ లావణ్యపాలిట అనారోగ్యమై కూర్చుంది. నిత్యపథ్యంతో బేబీ సదా పేషంట్‌లాగే ఉండేది.

తండ్రి తెచ్చిన స్వీట్ తింటానంటే.. "అమ్మో, పాములు పడ్తాయి. ఆ డాల్డా పడదు దగ్గువస్తుంది. వద్దమ్మా!" అని కూతుర్ని ఊరడించేది. తర్వాత "అది చూస్తుండగా తేవద్దు అంటే వినరు. తింటే విరేచనాలో ఏవో వస్తాయి, ఎవరు పడతారు!" అంటూ భానుమూర్తి మీదకు లేచేది.

చిక్కమొహం వేసుక్కూర్చున్న బేబీని జాలిగా చూసి "పడదు, పడదు, అంటూ దాన్ని నువ్వే పేషంటులా తయారు చేస్తున్నావ్. ఈ వయసులో పుష్టికరమైన ఆహారం యివ్వాలిగాని దాన్నలా మాడ్చి చంపేస్తావెందుకు?" అని విసుగ్గా ఏనాడన్నా అంటే ఆరోజు కళ్ళ నీళ్ళ పర్యంతం అయ్యేది కస్తూరి.

కొద్దికొద్దిగ ఊహ తెలుస్తున్న లావణ్య గ్రహించినదేమిటంటే "అమ్మ వద్దంటే మానెయ్యాల్సిందే!" అని. అమ్మ, నాన్న, పనిపిల్లే ప్రపంచం లావణ్యకు.అపుడపుడు చూసే సినిమాలు ఏదో వింతగా, భయంగా ఉండేవి. సంవత్సరం వయసులో ఆ బుద్ధి, జ్ఞానం ఎంతవరకు వికసించాయో, నాలుగేళ్ళు అయినా అక్కడే ఆగిపోయాయి.అయిదోఏడు వచ్చినదగ్గరనుండి, కూతుర్ని స్కూల్లో వేసే





సన్నాహం చెయ్యసాగింది కస్తూరి.

* * *

స్కూల్లో వేయటానికి తీసుకు వెళ్తా నన్నరోజు గుమ్మం దాటడానికి గుండె చెరువయ్యేలా ఏడిచింది బేబి. తల్లినుండి వేరు చేస్తున్న రాక్షసుడిలా కనిపించాడు తండ్రి. ఆ రోజు వాయిదా పడిపోయింది. మూడోసారి మంచి ముహూర్తం చూసి కృతకృత్యుడయ్యాడు మూర్తి.

పదిరోజులు పనిపిల్లకూడా బేబీ తో పాటు స్కూల్లో కూర్చుంది. ఇంతమంది పిల్లలు తన ఈడువాళ్ళే ఉన్నారనీ, వాళ్ళంతా ఎంతో ఆనందంగా, స్వేచ్ఛగా, ఉత్సాహంగా ఉన్నారనీ మొట్టమొదట చూసి ఆశ్చర్యపోయింది లావణ్య. ఆ పసి మెదడుకు అదేం అర్థంకాకపోగా, గందర గోళంగా అనిపించింది. ఆ పిల్లలంతా మహా సముద్రమై తనను కంబళించడానికి వస్తున్న కెరటాల్లా తలచి వణికిపోయింది. అమ్మను తప్ప పట్టుమని పదిమంది మను షలను ఒక్కసారే చూసిన అలవాటు లేదాయె. కాస్త పెద్దదయిన దగ్గర్నుండి సినిమాలకు తీసుకువెళ్ళేవారుకాదు. పని పిల్ల దగ్గరే ఇంట్లోనే ఉండేది. అందుకే ఆ స్కూలు వాతావరణం, అంత మంది పిల్లలు, గోల లావణ్య గుండెలవిసిపోయేలా చేసింది. ప్రాణం లేని బొమ్మలా కూర్చుంది. ఆరోజే అసలే బలహీనమైన ఆమె మెదడు ఒక్కసారి షాక్ తగిలినట్లయి ఆలోచించే శక్తినే కోల్పోయింది. శారీరకంగా బలహీనమైన లావణ్య ఇదంతా తట్టుకోలేకపోయింది. కాని యివేమీ అర్థం కాని తల్లిదండ్రులు బేబినిబళ్ళోవేసినందుకేఊపిరితీసుకున్నారు. ఒకరకమైన భయంతో మొద్దుబారిపోయిన లావణ్య మెదడు 'కీ' యిస్తే పనిచేసే యంత్రంలా అయిపోయింది. మాస్టారిని చూస్తేనే భయం. కూర్చో అంటే కూర్చో వడం, 'నిలబడు' అంటే నిలబడటం అంతే. "అ, ఆ" లు యిచ్చి దిద్దమంటే అదేపనిగా ఒక్కక్షణం ఆగకుండా దిద్దేది. కాని రాయి అంటే తెల్లమొహంవేసేది. ఏభయిమంది పిల్లల్లో ఈ పిల్లను పట్టిం చుకొనే వోపిక, తీరిక లేని మాష్టారు మామూలుగా వదిలేసారు.

కాని, కూతురు పెద్దచదువు చదివి 'డాక్టరు' కావాలని ఆశపడుతున్న కస్తూరి యింటికిరాగానే పట్టుకొనేది. చదువు విషయంలో కొచ్చేసరికి ఆ తల్లి కళ్లల్లో కనబడే క్రౌర్యానికి ఆచిన్న మనసు భయంతో వణికిపోయేది. ఒక మామూలు తల్లిగా పిల్లకు చదువు చెప్దా మని కూర్చున్న కస్తూరికి, కూతుర్ని చూస్తుంటే కసి, కోపం ముంచుకొచ్చేవి.

"దెష్ట వెధవ. అలా వెర్రి మొహం వేసుకు చూస్తావేం? యివి చూడకుండా రాయాలిగాని అలా దిద్దుకొంటూ పోతా వేం! ఖర్మ! అ నా కా రి తనంతో పాటు మొద్దుతనం కూడా యిచ్చాడా భగ వంతుడు. ఏం పాపం చేసానో ఏమో?" అని నెత్తి కొట్టుకొంటుంటే బిక్కమొహం వేసుకొని చూడ్డం తప్ప ఏమీ అనలేని స్థితి లావణ్యది.

"అలా భయపెడితే ఎలా కస్తూరీ! కాస్త నెమ్మదిగా చెప్పు. చదువు నిదానంగా అదే వస్తుంది లెద్దూ. నువ్వు దాన్నలా హైరానా పెట్టకు. రామ్మా నేను చెప్తాను!" అనే తండ్రే ఆమెకు ఆప్తుడయ్యాడు. మూర్తి నెమ్మదిగా, బుజ్జగిస్తూ కథలా చెప్తూ "రాయమ్మా!" అంటే ఎలాగోలా రెండక్షరాలు రాయగలిగేది. ఈ విధంగా

అక్షరాలు పూర్తయ్యేసరికి ఒకటవ తరగతి పూర్తి కావచ్చింది. కస్తూరికీ పద్ధతి విసుగు. ఒకసారి చెప్ప గానే అర్థం చేసేసుకొని, తిరిగి వల్లించ గలిగి ఉండాలని ఆమె కోరిక. కానీ, ఆ తీరని కోరికకు బేబీ ఆహుతి అయిపోతుం దన్న నిజం ఊహా మాత్రంగా కూడా అర్థం చేసుకోలేదు కస్తూరి. తనకు తెలియ కుండానే తను తనబిడ్డకు సింహస్వప్నంగా తయారయ్యింది.

* * *

లావణ్య మూడవ తరగతిలోకి వచ్చింది. ఆ ఏడాదే కస్తూరి తాతగారు పోయారు. అక్కడ యిల్లు అదీ అమ్మేసి, ఆ డబ్బు కస్తూరి పేర బేంకులో వేసాడు భాను మూర్తి. పదివేలు ఒక్కసారిగా వచ్చిపడే సరికి కస్తూరిలో అహం కూడా పెరిగింది. 'నాకేమిటి?' అన్న ధీమా ప్రతిమాటలోనూ వ్యక్తం చేస్తుండేది. భానుమూర్తికిది బాధగా ఉన్నా అలవాటు చేసుకొన్నాడు. అపుడే భానుమూర్తికి ట్రాన్స్‌ఫర్



అయ్యింది. కస్తూరి కూతురి చదువు పాడయి పోతుందని, దగ్గరేగదా అని అతన్నే తిరగమంది. అతనూ ఆలోచించి 'సరే' నన్నాడు. రెండురోజులకోసారి వస్తూ పోతూ, ట్రాన్స్ఫర్‌కోసం తీవ్రంగా



ప్రయత్నించసాగాడు. ఈ గొడవలేమీ పట్టని లావణ్య ఒక్కలాగనే ఉంది.




"మూడు రెళ్ల ఆరు... మూడు మూళ్లు తొమ్మిది..." మాస్టారి వెనుక అరుస్తున్న పిల్లలంతా ఒక్కసారే మీట నొక్కినట్లు ఆగిపోయారు.

హెడ్‌మాస్టర్ గారు కొత్త అమ్మాయిని వెంటబెట్టుకువచ్చారు మూడవతరగతిలోకి. "గుడ్ మార్నింగ్ సార్!" పిల్లలంతా ఒక్కసారే అనేసరికి జలతరంగిణిలా ధ్వనించింది.

ఆయన చిరునవ్వుతో చెయ్యి ఊపుతూ "చూడండి మాస్టారూ. ఈ అమ్మాయిని కాస్త జాగ్రత్తగా చూస్తుండండి, మనకు కావలసిన వాళ్ళమ్మాయి. వెళ్ళమ్మా" అంటూ ముందుకు పంపారు.

"అట్లాగే సార్" అంటూ "రామ్మా" అని దగ్గరకు తీసుకొన్నారా అమ్మాయిని హెడ్‌మాస్టరు వెళ్లిపోయారు.

"నీ పేరేమిటమ్మా!" అన్నారు క్లాసు టీచరు.

"మల్లిక" క్లాసంతా కలియ చూస్తూ ధర్జాగా అంది. తెల్లగా, బొద్దుగా, రెండు జళ్ళతో, బుట్టచేతుల గౌనుతో ముద్దుగా ఉంది. గుండ్రంగా తళతళ్ళాడే విశాలమైన కళ్ళను చకచక తిప్పేస్తూ అన్నీ చూసేస్తోంది. "వెళ్ళి కూర్చోమ్మా" అన్న మాస్టారి మాటకు, పిల్లలంతా ఆశగా చూసారు మల్లిక వైపు.

చుట్టూచూసిన మల్లిక అమాయకంగా, భయంగా ఒదిగి కూర్చున్న లావణ్య ప్రక్కకు వెళ్లికూర్చుంది. యింకా ఒదిగి పోతూ భయంగా చూసింది లావణ్య. మాస్టారు మళ్ళీ ఎక్కాలు చెప్పడంలో మునిగిపోయారు. మరబొమ్మలా నోరు కదుపుతున్న లావణ్యను చూస్తూ...

"నీ పేరేమిటి?" అనడిగింది మల్లిక నెమ్మదిగా. మాస్టారు ఎక్కడ వింటారో నని భయంగాచూస్తుండిపోయింది లావణ్య. మళ్లీ రెట్టించే సరికి...

"లావణ్య!" అంది బెదురుగా. ఫక్కు మంది మల్లిక.

"నీ పేరు లావణ్యా... మీ అమ్మకి ఏం తెలీదులా ఉంది!" అంది కళ్లు తిప్పుతూ వేళాకోళంగా. అదేమిటో అర్థంకాకపోయినా వెక్కిరిస్తోందని అర్థం అయిన లావణ్య కళ్లల్లో నీళ్లూరాయి. అదిచూసి మల్లిక మనసు గాయపడింది.

"సారీ" అంది మృధువుగా.

యిదంతా గమనిస్తున్న మాస్టారు, ఆ చిన్న పిల్లలో గల పెద్ద మనసుకి ఆశ్చర్యపోయారు. ఆ తెలివితేటలకు ముచ్చట వేసింది. ఒక తెలివైన విద్యార్థినిని పొందినందుకు ఆయన మనసు ఆనందంతో నిండిపోయింది.

* * *

"లావణ్యా! టిఫిన్ చేద్దాంరా. మా అమ్మ సున్నుండలు ఇచ్చింది!" అని మర్నాడు ఇంటర్వెల్‌లో మల్లిక తన చెయ్యిపట్టుకొని లాక్కువెళ్తూంటే మౌనంగా అనుసరించింది.

తీరా "తిను!" అంటూ ఒకటి చేతిలో

పెట్టేసరికి ...

"వద్దు, మా అమ్మ కొడుతుంది. అది తింటే నాకు పడదు!" అంటూ తను తెచ్చుకొన్న బిస్కట్లు తీసుకొంది.

పక పక నవ్వింది మల్లిక.

"నీకు పడదా? పడడంటే? ఏమవు తుంది? ఫ్రెండ్ దగ్గర తింటే మీ అమ్మ కొడుతుందా. మరి మా అమ్మ ఏమీ అనదేం? ఇలాగైతే మనం ఫ్రెండ్స్ ఎలా అవుతాం?" ఆశ్చర్యంగా అంది మల్లిక. అదేమీ తనకు తెలియనట్లు, అమ్మ చెప్ప మన్న మాట అప్పచెప్పేసి చూస్తూ కూర్చుంది లావణ్య. ఆ క్షణంలో ఆ పిల్లనుచూస్తే విపరీతమైన జాలి కలిగింది మల్లికకు.

"నేనంటే నీకిష్టమేనా? నాతో స్నేహం చేస్తావా? అయితే కొంచెం తిను. ఏమీ అవదులే. కావలిస్తే నేను వచ్చి మీ అమ్మకు చెప్తాను!"అందిలాలనగా మల్లిక.

"అమ్మో ... మా యింటికా! వద్దు! అమ్మ కోప్పడుతుంది! మాయింటికెవ్వరూ రావుగా!" జరగరానిదేదో జరిగిపోయి నట్లు భయపడిపోతూ అంది లావణ్య.

"అమ్మ ... అమ్మ ... అన్నిటికీ అమ్మే!" విసుగ్గా అనుకొంది మల్లిక. కానీ ఏదో అజ్ఞాతశక్తి ఆ అమ్మాయిని అట్లా ఊరుకోనివ్వలేదు.

ఎట్లాగయినా ఈ అమ్మాయిని ఆ అమ్మ బారినుండి రక్షించాలనే బలమైన కోర్కె కలిగింది. "సాయంత్రం మీ యింటికి వస్తాను నీతో. మీ అమ్మను చూస్తాను" పెంకెతనంగా అంది మల్లిక.

"ఎవరినన్నా తీసుకువెళ్తే అమ్మ కొడుతుంది" ఏడుపే తరువాయిగా అంది లావణ్య.ఆ పసిమనసులో అంతకు ముందు జరిగిన సంఘటనలు మాసిపోలేదు.

రెండోతరగతిలో ఉండగా తను వీధి చివర ఉన్న అమ్మాయిని ఓసారి ఇంటికి తీసుకు వెళ్లింది. మురికిగా ఉన్న ఆ పిల్లను చూస్తూనే మండిపడిపోయింది కస్తూరి.

"యిలాంటివాళ్ళ స్నేహం చేస్తావా? వీపు చీరేస్తాను. అలగావాళ్ళనందర్నీ యింటికి తీసుకొచ్చావంటే జాగ్రత్త!" అంటూ నాలుగు వేసింది. ఆవిడ అన్న మాటలు అర్థంకాలేదు గాని, యింకెవర్నీ యింటికి తీసుకురాకూడదు' అన్న విషయం మాత్రం అర్థం అయ్యింది.

అందుకే ఈ బెదురు.

"నన్ను తీసుకువెళ్తే ఏమీ అనరు!" ధైర్యంగా అంటున్న మల్లికను అయోమయంగా చూసింది లావణ్య.

ఆరోజు లావణ్య యింటిలోనేకాక, లావణ్య మనసులోకూడా ప్రవేశించింది మల్లిక.

తన యింటి తలుపులు మూసుకొని, తన చుట్టూ గిరిగీసుకొని, సమాజంనుండి తప్పుకొని ఒంటరిగా ఉంటున్న కస్తూరి యింటి తలుపులు మొదటిసారిగా మల్లిక కోసం తెరుచుకొన్నాయి.

కస్తూరిని చూస్తూనే ఆశ్చర్యంగా "మీరు చాలా బావున్నారు ఆంటీ!" అంది మల్లిక అమాయకంగా.

కస్తూరి మనసు చివుక్కుమంది లావణ్యను చూసి. అదేం పట్టించుకోలేదు లావణ్య. ఏమంటుందోనన్నట్లు తల్లివైపే భయభయంగా చూస్తోంది. ముద్దుగా, అందంగా, ఆరోగ్యంగా ఉన్న అమ్మాయి మాటలకు ముచ్చటగా చూస్తున్న కస్తూరి, లావణ్యను పట్టించుకోనేలేదు.

"ఆంటీ మా యిల్లు ఈ పక్కవీధి

లోనే! లావణ్యను నాతో స్నేహం చెయ్యనివ్వరా? నేను టిఫిన్ పెడితే మీరు కోప్పడుతారా?" అమాయకంగా అడుగుతున్న మల్లిక ముందు కస్తూరి అహం ఎగిరిపోయింది.

"లేదమ్మా! తప్పకుండా మా లావణ్యకు ఫ్రెండ్‌గా ఉండు. దానికేం తెలీదు. నువ్వే జాగ్రత్తగా చూస్తుండు క్లాసులో. మీ నాన్నగారు ఏంచేస్తున్నారు?" అంది కస్తూరి.

"మా నాన్నగారు ఫుడ్‌కార్పొరేషన్‌లో పనిచేస్తున్నారు!" అంటూ చక్కగా జవాబు చెప్తున్న ఆ అమ్మాయిని విస్మయంగా చూసింది కస్తూరి.

ఆరోజునుండి లావణ్య నోరు విప్పి ఏమన్నా చెప్పిందంటే, అది మల్లికతోనే. అప్పటినుండీ లావణ్య మనస్తత్వాన్ని పరిశీలిస్తూనే వుంది మల్లిక. డెప్యూటీ తాసీల్దారుగారమ్మాయి, ఒకే ముద్దుల కూతురు అయికూడా లావణ్య యిలా అయోమయంగా ఎందుకుంటుందో ఎంత ఆలోచిం



చినా అర్థంకాదు మల్లికకు. "ఏదో చెయ్యాలి, ఏమో చెప్పాలి. అందరిలా నవ్వుతూ స్వేచ్ఛగా కళకళ్లాడుతూ ఉండేలా ఈ అమ్మాయిని తయారు చెయ్యాలి!" అన్న ఆలోచన మల్లిక మనసులో కలిగింది. ఆ ఆలోచన కలిగిన క్షణంనుండి లావణ్యమీద ప్రయోగం చేస్తూనేఉంది. అటు తల్లికి, ఇటు మల్లికకు, మధ్య లావణ్య నలిగిపోతూనే ఉంది. ధైర్యంచేసి మల్లిక చెప్పినట్లు చెయ్యడం గాని, మనసులోమాట చెప్పటంగాని చెయ్యలేకపోయేది. పొరపాటున ఏనాడన్నా మల్లిక మాటమీద... "అది కాదమ్మా...యిలా చేస్తాను' అనో, 'అది కాదు ఈ గౌను వేసుకుంటాను' అనో అంటేచాలు కస్తూరి అనుమానంగా చూసేది.

"యింతున్నావు నీకు యిష్టాయిష్టాలేమిటి? చెప్పినట్టుచెయ్యి!" అంటూ గుడ్లురిమేసరికి మాటలన్నీ గొంతులోనే ఆగిపోయేవి లావణ్యకి. అలాఅని మల్లిక స్నేహం వదులుకోనూలేదు. ఏదీ చాతకాని స్థితిలో అలాగే చైతన్యంలేని మట్టిముద్దలా ఉండిపోయింది. కస్తూరి, మల్లిక యిద్దరూ బొమ్మను ఎవరికనుగుణంగా వారు మలచుకొందామనే ప్రయత్నిస్తుంటారు. కాని అది యిసుకబొమ్మేగాని మట్టిబొమ్మ కాదుమరి.

* * *

"లావణ్యా! ఈరోజు నా పుట్టినరోజు. నీవు మాయింటికి రావాలి, తప్పించుకోవడానికి వీల్లేదు. అమ్మ తప్పకుండా తీసుకు రమ్మంది తెలుసా?" అంది మల్లిక.

"అమ్మ దెబ్బలాడుతుందేమో!" సందేహంగా అంది లావణ్య.

"అబ్బ, నేవచ్చి చెప్తాలే!" కొట్టిపారేసింది మల్లిక. అన్నట్లుగానే స్కూలునుండి లావణ్యతోపాటే వచ్చి "ఆంటీ! ఈరోజు నా బర్త్‌డే. లావణ్యను మా యింటికి పంపాలి!" అంది మల్లిక.

"అలాగా! చాలా సంతోషం!" అంటూ లోపలికివెళ్ళి పది రూపాయలు తెచ్చి చేతిలో పెట్టింది. "వద్దండీ! లావణ్యను పంపండిచాలు!" తీసుకోకుండా చేతులు వెనక్కి దాచేస్తూ అంది మల్లిక.

"అదెందుకులేమ్మా! నువ్వే వచ్చేసావుగా, యిద్దరికీ టిఫిన్ పెడతాను తినండి. ఈరోజు వాళ్ళ నాన్నగారు వస్తారు. వచ్చేసరికి లేకపోతే దెబ్బలాడతారు!" అంది తప్పించుకొంటూ కస్తూరి.

"అదేమిటి ఆంటీ, నా బర్త్‌డే అయితే మీ యింట్లో టిఫిన్ చెయ్యమంటారు. నాతో వెళ్ళిందని చెప్పండి ఏమీ అనరు. మరి నేను మీ యింటికి వస్తుంటే మా నాన్నగారు ఏమీ అనరు. ఈరోజుగనుక లావణ్యను పంపకపోతే నేను మీయింటికే రాను!" అంతకన్నా పట్టుదలగా అంది మల్లిక.

ఆ మాటకే బేలగా చూస్తూ మల్లిక చెయ్యి గట్టిగా పట్టుకొంది లావణ్య. ఆ స్పర్శలో తేడా గమనించిన మల్లిక లావణ్య చెయ్యి నొక్కింది అభయమిస్తున్నట్లు.

మరి తప్పదని ముస్తాబుచేసి పంపింది కస్తూరి వందసార్లు జాగ్రత్తలు చెప్తూ. మరల మల్లిక తీసుకువచ్చి దిగబెడతానని మాటిచ్చాకగాని తృప్తిపడలేదు కస్తూరి. చేతులు పట్టుకొని యిద్దరూ అలా రోడ్డువారన వెళ్తుంటే చూస్తూ నిలుచుంది. నిండుగా ఆరోగ్యంగా ఉన్న మల్లిక

పక్కన అదే వయసున్న లావణ్య పూర్తి భిన్నంగా ఉంది. ఈ ఎనిమిదేళ్ళ లోనూ ఏఒక్కనాడూ అలా తల్లిని విడిచి ఒంటరిగా ఎవరింటికీ, ఎక్కడికీ వెళ్ళ లేదు స్కూలుకి తప్ప. ఈరోజు మల్లిక అలా చెయ్యిపట్టుకొని తీసుకుపోతుంటే ఏదోగా అనిపించింది కస్తూరికి. తననుండి వేరుచేస్తూ ఈ విశాల ప్రపంచంలోకి తీసుకు పోతున్నట్లు అనుభూతి కలిగింది. 'అలా బయట ప్రపంచంతో సంబంధ బాంధ వ్యాలు పెంచుకొంటే, ఎక్కడ ఏ మాటలు చెప్పి, ఏ నిజాలు చెప్పి కూతురి మనసు పాడుచేస్తారో అన్న భయంతో యిన్నాళ్లూ పంజరంలో పెట్టి పెంచుతున్న చిలుకలా ఉంది లావణ్య. ఆ పంజరం తెరిచేవాళ్ళు ఇప్పుడు వచ్చారన్న భావం, మల్లిక పై ఆగ్రహాన్ని తెప్పించింది. ఆ పిల్లకు జవాబు చెప్పలేని తన నిస్సహాయతమీద తనకే కోపం వచ్చింది. నిట్టూరుస్తూ వెను దిరిగింది కస్తూరి.

భయం, భయంగా మల్లిక చెయ్యిపట్టు కొని వస్తున్న లావణ్యను సాదరంగా ఆహ్వా నించింది మల్లిక తల్లి రేవతి.

మొట్టమొదటిరోజు స్కూలు నుండి వచ్చిన మల్లిక లావణ్య పేరు గల అమ్మాయి ఎట్లా ఉంటుందో చెప్పి చెప్పి విరగబడినవ్విన సంఘటన గుర్తుపచ్చింది. మనసులోనే నవ్వుకొంది. ఏ మాట అడి గినా, "నాకు తెలీదండీ!" అని బేలగా చెప్తుంటే విసుగుతోపాటు, జాలికలిగింది.

రేవతి చామనఛాయగా ఉన్నా, ప్రశాంత వదనంతో నిర్మలంగా ఉన్న కళ్ళతో ఆప్యాయతనిండిన చూపులద్వారా తన శరీరాన్ని స్పృశిస్తూఉంటే ఏదో అను భూతికి లోనయ్యింది లావణ్య.

మల్లిక చెల్లి, తమ్ముడు ఇల్లంతా సందడి చేస్తున్నారు.

మల్లిక తండ్రి చిన్నకూతుర్ని ముద్దు లాడుతూ, మధ్య మధ్య మీదపడే కొడు కుతో ఆడుకుంటూ లావణ్యను, మల్లికను మాటల్లోకి దింపుతున్నాడు. తండ్రి మాట లకు భయం బెదురులేకుండా "అదికాదు డాడీ" అంటూ సమాధానం చెప్తున్న మల్లి కను చూస్తూ, అయోమయంలో పడిపోయింది లావణ్య.

"అసలు ఇంత సందడిగా ఎలా ఉంటారు వీళ్లు!" అనుకొంది, నిశ్శబ్దంగా ఉండే తనయిల్లు గుర్తుకు తెచ్చుకుంటూ. నాన్నరాగానే తను పనిమనిషితో పాటు డాబామీదకు వెళ్లడమే తప్ప ఒక్కనాడూ వాళ్ళ మధ్యకూర్చుని కబుర్లు చెప్పలేదు. అసలు అలా ఉంటారని కూడా తెలియని లావణ్య బిత్తర చూపులతో వాళ్ళను చూస్తూ మౌనంగా ఉండిపోయింది. ఆ చిన్ని మనసు అలా ఎప్పటి కప్పుడు ముడుచుకుపోతూ ఉంటుంది గనుకనే ఆ వయసులో ఉండవలసిన తర్కంగాని, జిజ్ఞాసగాని ఏమీలేవు. ఏ భావంలేని గాజు గుళికల్లాంటి కళ్ళతో నిర్వికారంగా చూస్తూఉంటుంది. అంతే.

"అబ్బ! వట్టి మట్టి ముద్దలా ఉంది, యింకెవరూ దొరకలేదేమిటే నీకు స్నేహం చెయ్యడానికి!" లావణ్యను దిగబెట్టి వచ్చిన మల్లికను కసిరింది తల్లి.

"నాకు నచ్చిందమ్మా. ఎంతమంచిదో! నేనంటే చాలా యిష్టం అమ్మా!" మృదువుగా అంది మల్లిక భోజనానికి కూర్చుంటూ.

"అదేమిటి రేవతీ! పిల్లలకు ఎపుడూ అట్లా చెప్పకూడదు. నిజానికి మల్లిక మంచి ఫ్రెండ్‌నే సెలక్ట్ చేసుకొంది.

ఆటువంటి వింత మనస్తత్వం గల పిల్లతో స్నేహం యిటువంటి వాళ్ళ మెదడుకు పదును పెడుతుంది. మన మల్లిక ఏ పని చేసినా తెలివిగానే చేస్తుందిలే" కూతురు వైపు నవ్వుతూ చూసాడు తండ్రి.

"లావణ్యను వాళ్ళమ్మ ఏమీతిననివ్వదు నాన్నా!" ఆశ్చర్యంగా చెప్పింది మల్లిక. "వాళ్ళమ్మకి అదంటే ఎంతోముద్దు. దానికేమో వాళ్ళమ్మ అంటే భయం" కళ్ళు తిప్పుతూ చెప్పింది మల్లిక.

"ఒక్కర్తే సంతానం కదమ్మా. అందుకని అలాచూస్తుంటారు కొంతమంది. వాళ్ళ పిచ్చి ప్రేమగాని, దాంతో పిల్లలు ఎంత పాడయిపోతారో చూడరు. అర్థం చేసుకోరు."

"అబ్బబ్బ...యింక ఊరుకొందురూ. చాలు" అంటూ రేవతి విసుక్కొనేవరకూ తండ్రీ కూతుళ్ళిద్దరూ లావణ్య గురించి చెప్పుకొంటూనే ఉన్నారు.

* * *

"కస్తూరీ! మనప్రయత్నాలుఫలించాయి.



యిక్కడకు ట్రాన్స్‌ఫర్ అయిపోయింది" ఆరోజు వస్తూనే సంతోషంగా అన్నాడు భానుమూర్తి.

"అబ్బ పెద్దగొడవ వదిలింది బాబూ, పోన్లెండి" అంటూ సంతోషించింది కస్తూరి.

"ఓ నాలుగురోజులు శలవు పెడుతున్నాను. ఆర్డర్స్ వచ్చేస్తాయి. యిక్కడ జాయిన్ అవవచ్చు. శలవులో ఊరు వెళ్ళి వస్తాను" అన్నాడు యధాలాపంగా.

శలవు పెడతాను అన్న మాటకు వికసించిన కస్తూరి మొహం, ఊరువెళ్తాననే సరికి ముడుచుకు పోయింది.

"అంతే.! ఎంతయితే మాత్రం వాళ్ళ వాళ్ళకు సాటి తనెలా అవుతుంది? ఈయన మనసెపుడూ అక్కడే" ఉక్రోషంగా అనుకుంటూ వెనుతిరిగింది.

ఆమొహంలో మార్పు కనిపెట్టిన మూర్తి మామూలే అనుకొంటూ నవ్వు కొన్నాడు. అంతలో లావణ్య స్కూలు నుండి రావడంతో...

"ఏమ్మా, ఏంచెప్పారు? మీ ఫ్రెండ్ రాలేదా?" అంటూ కూతురితో మాటల్లోకి దిగాడు.

ఎపుడో ఒకసారి చనువుగా మాట్లాడే తండ్రికి అడిగిన వాటికే సమాధానం చెప్పడం అలవాటు. ఆ తరువాత ఏంమాట్లాడాలో తోచనట్టు అయిపోతుంటుంది. ఆ యిద్దరి మధ్య తండ్రీ కూతుళ్ళ కుండే చనువు తక్కువ. చిన్నప్పటి నుండి తమ ఆనందానికి ఆటంకం అని పని పిల్లతో మేడమీదకు పంపేయడమో, వేరే గదిలో కూర్చోబెట్టి ఆడించడమో అలవాటు చేసిన కస్తూరి తనకు తెలియకుండా తానే ఆ తండ్రీకూతుళ్ళ మధ్య కనిపించని దూరం పెంచేసింది.

ఎప్పటిలా అడిగిన వాటికి సమాధానం చెప్పి, లోపలికి వెళ్ళిపోయింది.

భానుమూర్తి ఒంటరి అయిపోగానే పెద్ద కొడుకు రాసిన ఉత్తరం తనలో రేపిన సంఘర్షణ తాలూకు ఆలోచనలు చుట్టుముట్టాయి.

"ఎంత ధైర్యంగా రాసాడు! తల్లి యిచ్చిన అలుసో, వయసు తెచ్చేమార్పో! కాలేజిలో జాయిన్ అయ్యాడుగా. అయితే మాత్రం యిపుడేంచేస్తాడు? వాడేదో అన్నాడని కస్తూరిని వదలుకొంటాడా? అయినా వాడు తనని విమర్శించేంత వాడా!" ఆవేశపడ్డాడు మూర్తి.

టిఫిన్ తెచ్చిన కస్తూరి సీరియస్‌గా ఉన్న అతని మొహం చూసి జంకింది. అయినా నవ్వు తెచ్చుకొంటూ మల్లిక పుట్టినరోజు సంగతి చెప్పింది.

"నలుగుర్లో తిరగనివ్వాలి కస్తూరీ! అపుడే పిల్లల మనసు వికసిస్తుంది. అయినా మల్లిక చాలా తెలివైంది. అటువంటిదాని స్నేహం దీనికెంతో అవసరం!" అన్నాడు కస్తూరి చెప్పింది విని.

దాంతో కస్తూరిలో ఉండే అభిజాత్యం సర్రున పడగ విప్పింది.

"ఆఁ అలాగే చెప్పండి. యిళ్ళంట తిరిగితే జ్ఞానం వచ్చేస్తుంది. అమ్మలక్కలడిగే వెధవసంగతులు తెలుస్తాయితప్ప యింకేం లేదు. 'మీ అమ్మ యిలాగట, మీ నాన్నకి అ లా గ ట' అంటూ లేనిపోనివన్ని దానిబుర్రలో పెడితే తెలుస్తుంది. స్కూలుకి వెళ్తుందిగా బుద్ధి అదే వికసిస్తుంది" ఈసడింపుగా అంది కస్తూరి.

"అబ్బ ఎప్పుడూ అలాగే ఆలోచిస్తావేం? ఈ గొడవలు ఎప్పటికైనా తెలియవా ఏం?




అదేదో పెద్ద తప్పయినట్లు మాట్లాడ తావేమిటి. అలాగనుకుంటే నువ్వూ, నీ కూతురు కట్టకట్టుకొని ఉండండి" ఆవేశం పెల్లుబికింది భానుమూర్తిలో.

సణుక్కొంటూ లోపలికి వెళ్లిపోయింది కస్తూరి అతని ఆవేశం చూసి. మరో రెండు రోజులవరకు మనశ్శాంతి ఉండదని పూర్వానుభవంతో అర్థం చేసుకున్న భానుమూర్తి నిట్టూరుస్తూ ఉండిపోయాడు. మర్నాడే రావులపాలెం బయలుదేరాడు.

* * *

కాలేజి నుండి వస్తూనే, తండ్రిని చూసి నిరసనగా తల తిప్పుకొని వెళ్లిపోయాడు కరుణ. మూడోవాడు మాత్రం దగ్గర కొచ్చి సంగతులు చెప్పాడు.

"పూర్ణా! నీ కొడుకులు చాలా పెద్ద వాళ్ళయిపోయినట్లుందే" ఆ రాత్రి మంచినీళ్లు పెడుతున్న పూర్ణను వేళాకోళం చేస్తే బిత్తర పోయిందామె.

"నా కొడుకులు అంటున్నారు కనుక చెప్తున్నాను. నిజమే! ఎల్లకాలం వాళ్లు చిన్నవాళ్లుగానే ఉండిపోరుకదా!" తేరు కొన్న పూర్ణ గట్టిగానే అంది.

దాంతో రెచ్చిపోయాడు భానుమూర్తి.

"అయితే యిందులో తమరి ప్రతాపం ఉందన్నమాట. యింకేం, లేకపోతే వీడు నీతులు చెప్తాడా నాకు. నా డబ్బు అక్కరలేదట. బాధ్యత లేకుండా చుట్టంచూపుగా వచ్చేమనిషి డబ్బు ఆశించ డట. యిన్నేళ్ళు యిలాగే పెరిగారా? నా డబ్బు అవసరం లేకుండానే చదివించేస్తు న్నావా? యిన్నాళ్ల మీ బాగోగులు చూడ లేదూ? చూడకుండానే కాలేజి చదువుల కొచ్చేశారా? కాలేజిలో ఎవరు సీటిప్పిం చారు? అన్నపూర్ణ కొడుకని యిచ్చేశారా? నేనెవరి దగ్గర ఉంటున్నానో వాళ్లకే నా జీతం ఖర్చు పెట్టుకోవాలట, వీడికి అవసరంలేదట. నా యిష్టం వచ్చినట్లు చేసుకొంటాను. వీడు నాకు చెప్పేవాడా? అవునులే పెద్దవాళ్ళయిపోయారు. నీ అహం చూసి వాళ్ళ కళ్ళకి నేనో వెధవలా కనిపిస్తున్నానేమో! యిన్నేళ్ళుగా తెలీదా? యిపుడెందుకొచ్చింది పౌరుషం?" ఉద్రేకంగా అరుస్తున్న భర్త కాళ్ళదగ్గర కూలబడిపోయింది పూర్ణ.

"అంతమాటనకండి. నాకు అహం, ధైర్యం, ఆత్మస్థయిర్యం ఎలావస్తాయి? అవన్నీ మీతోనే పోయాయి. వాళ్ళు పెద్ద వాళ్ళయ్యారు, చదువుకొంటున్నారు. కాదు, కాదు మీరు చదివిస్తున్నారు. వాళ్ళ ఆలోచనలు ఎలా పెరిగాయో, ఏం చేస్తున్నారో తెలుకోవలసిన మీరు దూరమైపో యారు. నాకు చాతకాదు. యింకెలా వాళ్లని అదుపులో పెట్టగలను. నాకు తెలీదు వాడలా అన్నట్లు. మీరంటే మాకెప్పటికీ గౌరవమే. మీరు కాకపోతే ఎవరున్నారు. ఏదో తెలిసీ తెలియక అనుంటాడు. మీరు బాధపడకండి. మీరుకాకపోతే ఎవరు చూస్తారు? ఎవరికి బాధ్యత ఉంది?" అంటూ అన్నపూర్ణ కళ్ళనీళ్ళ పర్యంత మయ్యేసరికి చల్లబడ్డాడు భానుమూర్తి.

"పూర్ణా! మీకు... మీకు నా బాధ అర్థంకాదు. మిమల్ని దూరంచేస్తున్నానని మీరనుకొంటారు. నా మనసెపుడూ మీ చుట్టూనే తిరుగుతుంటుంది. కస్తూరి కేమ న్నారు? ఒక్క ఆడపిల్ల, అదీ అర్భక పిల్ల. ఏదో ఒకరోజున మీరు ఆదుకోవల సినస్థితే వాళ్ళకువస్తే, అన్యాయం చెయ్యకు పూర్ణా. పిల్లలకు చెప్పు. వాళ్ళకో

'చెల్లి' ఉండని. నేనే చిన్నప్పటినుండి చెప్పలేకపోయాను. ఆ అవసరం రాదనుకొన్నాను. పొరపాటో, స్వార్థమో, ఏదో ఒకటి జరిగిపోయింది యిన్నేళ్ళయ్యాక శిక్షించాలనుకోవడం అన్యాయం. నువ్వు ఒకరకంగా నిన్ను నీవు శిక్షించుకొంటూ, నన్ను శిక్షిస్తూనే ఉన్నావు... యిపుడు పిల్లలుకూడా, ఊహు... నేను భరించలేను పూర్ణా..."

ఎన్నో రోజుల తరువాత తనలో దాగి ఉన్న ఆవేదనను వెళ్ళగక్కుతూంటే, మౌనంగా వినడంతప్ప ఏమీ అనలేకపోయింది అన్నపూర్ణ. అప్రయత్నంగా కన్నీళ్ళుబికాయి. ఇన్నేళ్ళ తరువాత మళ్ళీ అన్నపూర్ణ అతని గుండెలమీద వాలిపోయింది. ఆమె కన్నీళ్లు అతని వేదన అర్థంచేసుకొన్నట్లు, శాంతింపచేయడానికా అన్నట్లు అవిరామంగా వక్షస్థలంపై ప్రవహిస్తూనే ఉన్నాయి. ఆ రాత్రి చాలాసేపటివరకూ ఆ దంపతులిద్దరూ, ఒకరినొకరు మూగగా ఊర



డించుకొంటూనే ఉన్నారు.




మల్లిక కాలంతోపాటు ముందుకు వెళ్తూ, లావణ్య చెయ్యి వదలకుండా తనతోపాటు లాక్కువెళ్తూనేఉంది. ఎంత ముందుకు లాగినా, వెనకడుగు పడుతూనే ఉంది లావణ్యకు. అయినా మల్లిక విసుక్కోలేదు. వదలనూ లేదు. క్లాసులో ఫస్టుసవచ్చే మల్లిక, అత్తెసరు మార్కులతో ఎలాగోలా పాసయ్యే లావణ్య... వీళ్ళమధ్య స్నేహంచూస్తే మాష్టారిదగ్గరనుండి అందరికీ ఆశ్చర్యమే.

ఫస్టుఫారమ్‌లో జాయిన్ అవడానికి వెళ్ళినపుడుకూడా లావణ్య చేయివదల్లేదు మల్లిక. పదేళ్ల మల్లికముందు అదే వయసుగల లావణ్య ఏడేళ్ళదానిలా చిన్న చెల్లెలులా కనిపిస్తుంది చూసేవాళ్లకి. కొత్తస్కూలు, కొత్త పిల్లలు, కొత్త వాతావరణం, జాయిన్ చెయ్యడానికి వచ్చిన తలిదండ్రులతో, బిలబిల్లాడే పిల్లలతో అదో మహాప్రవాహంలా కనిపిస్తుంటే లావణ్యకు భయంతో మతిపోతున్నట్లు అనిపించింది. మల్లిక చేతిని ప్రాణాధారంలా గట్టిగా పట్టుకొంది. మల్లిక మనసు అలాగాక ఉత్సాహంగా వుంది. అపుడే పిల్లలతో మాట్లాడేసి స్నేహం కలిపేసుకొంటోంది. భాసుమూర్తి కేంపు వెళ్లడంతో క్లర్కు రాంబాబుకి అప్పచెప్పాడు లావణ్యను జాయిన్‌చేసే బాధ్యత. రాంబాబుఉన్నాడని, మల్లికకూడా వచ్చేసింది ఫస్టుమార్కులున్న ధైర్యంతో. లావణ్యకి మార్కులు లేకపోయినా, డెప్యూటీ తహశీల్దారుగారమ్మాయి అన్న దిపదు, 'బేక్ వర్డ్ కాస్టు' సర్టిఫికేటు ఉన్నాయి. సులువుగా ఫీజులు కట్టి యిద్దర్నీ జాయిన్ చేసేసాడు. మల్లిక మాటమీద యిద్దర్నీ ఒకే సెక్షన్‌లో వేయమని క్లర్కుకి చెప్పివచ్చాడు. క్లాసులో కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు రాంబాబు. అలా హైస్కూలు జీవితం ప్రారంభమయ్యింది ఆ ఇద్దరికీ.

* * *

స్కూలు... తప్పితే యిల్లు!

ఇంటికివెళ్ళగానే పుస్తకం పట్టుకోవలసిందే. కూతురు బాగా చదువుకోవాలనే తాపత్రయం, కస్తూరి విచక్షణాజ్ఞానాన్ని పోగొట్టింది. స్కూలు నుండి వచ్చిన దగ్గరి నుండి తను చదివిందంతా నూరిపోస్తున్నా కూతురికి అత్తెసరు మార్కులే ఎలా వస్తున్నాయో ఆమెకు అర్థం కాలేదు.

"అలా చూస్తావేం? మొద్దుమొహమా! కొంచెం బుర్రపెట్టి శ్రద్ధగా విను. చదువు. నా ఖర్మకొద్దీ పుట్టావు" అంటూ విసుక్కునే తల్లిని చూసి కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యేది లావణ్యకి. అది చూసిన కస్తూరి యింకా మండిపడేది. "ఊఁ అదొక్కటే తెలుసు బాగా. వెధవఏడుపూ నువ్వూనూ. చదువు. మల్లిక చూసావా ఎంత చక్కగా చలాకిగా ఉంటుందో! నీకేదీ తెలుసుకోవాలన్న ఆసక్తే ఉండదు. భగవంతుడు ఆరుచ్చిన దాన్ని ఒక్కటైనయినా సరయినదాన్ని యిచ్చాడు కాదు" అని గొణుక్కుంటూ, కళ్ళల్లో గిర్రున

తిరిగిన నీటిని కూతురికి కనుపించనీయకుండా వంటింట్లోకి వెళ్ళిపోతుంది కస్తూరి.

"వట్టి మట్టిముద్దలాంటి పిల్ల! అందునా ఆడపిల్ల. ఎలా బ్రతుకుతుందో ఏమో! భగవాన్! నేను తెలిసో తెలియకో ఎవరికన్నా అన్యాయం చేస్తే, అది నాతోనే పోనీ. నా బిడ్డకు అన్యాయం చెయ్యకు. ఆ శిక్షేదో నన్నే అనుభవించనీ. యిటువంటి బిడ్డనిచ్చావు. ఈ శిక్షచాలు!" కస్తూరి మనసులో ఆవేదన కన్నీటి రూపంలో స్రవించేది.

* * *

"లావణ్యా! అలా కూర్చొని ఏం చూస్తావ్? రా! ఆడుకుందాం" త్రో బాల్ ఆడుతున్న మల్లిక పిలిచింది.

చిరునవ్వే సమాధానంగా చెప్పి చేతిలో పుస్తకం వైపు దృష్టి మరల్చింది లావణ్య.

"అస్తమానం చదువే. అందుకే క్లాసు ఫస్టు వస్తుంది" వెటకారంగా అంది రాజేశ్వరి.

"రాజీ!" బంతి ఆపేసి తీక్షణంగా అంది మల్లిక. బిత్తరపోయి చూసింది రాజేశ్వరి.

"రాజీ! ఎవరికీ, ఎవర్నీ వెటకారం చేసే అధికారం లేదు. ఎవరిష్టం వారిది. దాన్నేమన్నా అంటే ఊరుకోను తెలుసా!" నిష్కర్షగా అంది క్లాసు లీడర్ మల్లిక. లీడర్ అని కాకపోయినా మల్లిక అంటే అదో విధమైన భయంతో కూడిన గౌరవం, ఒక్క రాజేశ్వరికే కాదు క్లాసులో అందర్నీ తలవంచేలా చేస్తుంది. అదే యిప్పుడు రాజీ నోరు మూతపడేలా చేసింది. కానీ అదేం తనకు సంబంధంలేనట్లుంత నిశ్చింతంగా ఊరుకొంది లావణ్య.



కనీసం చిన్న కృతజ్ఞత విరిసే చూపు అన్నా చూడకపోవడం, మల్లికకు ఆశ్చర్యం కలిగించింది. వయసు వస్తున్న కొలదీ, మల్లిక ఆలోచనలు పెరుగుతున్నకొలదీ లావణ్య మనస్తత్వం ... పరీక్షలాగే సవాల్ చేస్తోంది. ఏ మాటంటే ఎటువంటి జవాబు ఇవ్వాలో తెలిసిన మల్లిక తన ప్రశ్నకు, ప్రవర్తనకు లావణ్యలో కలుగవలసిన చలనం, భావసంచలనం తనే ఊహించి చూస్తుంది. ప్రతిసారి ఎదురుదెబ్బ తినడమే తప్ప లావణ్యలో ఏ మార్పు, చలనం కనబడదం, లేదు. ఏమన్నా అడిగితే ఏమంటుందోనని గమనిస్తుంది. తనకు పట్టనట్లు ఊరుకొన్న లావణ్యను జూస్తున్నకొద్దీ మల్లిక మనసులో, ఆ పిల్ల మనస్తత్వాన్ని స్టడీ చెయ్యాలనే పట్టుదల స్థిరపడసాగింది.

"నాన్నా! మనస్తత్వాన్ని తెలుసుకోవాలంటే ఏం చదవాలి?" కుతూహలంగా అడుగుతున్న కూతుర్ని చూసి ముచ్చటపడ్డాడు తండ్రి.

"డాక్టరీ చదవాలమ్మా...డాక్టరయిన తరువాత మనస్తత్వశాస్త్రంమీద పరిశోధన చెయ్యాలి. అపుడు సైకియాట్రిస్టువి అవుతావు. చదువుతావా మరి!"

"ఊఁ" ఉత్సాహంగా అంది. "ఏమిటీ సైకాలిస్టా? మరోసారి చెప్పండి నాన్నగారూ" ఆ కళ్ళల్లో భవిష్యత్తుమీద ఆశ నక్షత్రంలా మిణుకు, మిణుకు మంటుంటే సాలోచనగా అంటున్న కూతుర్ని చూసి ఆశ్చర్యపోయాడు తండ్రి.

"అదేనమ్మా! సైకియాట్రిస్టు అంటే సైకాలజీ మీద స్టడీచేసినవాడు అని అర్థం. బాగాచదివి మంచిమార్కులు తెచ్చుకొంటే చదవొచ్చు. నీలాంటివాళ్ళు తలచుకొంటే సాధించలేనిది ఏదీ ఉండదమ్మా"

"బాగుంది అది అడగడం, మీరు

చెప్పడం. అయినా అంత గర్వం పనికి రాదు బాబూ" నవ్వు నాపుకొంటూ అంది కాఫీ పట్టుకొస్తున్న తల్లి.
"గర్వం కాక నాకేం రేవతీ!? నాతల్లి... బంగారుతల్లినాపేరు నిలబెడుతుందిచూడు" కొంటెగా భార్య వైపు చూస్తూ అన్నాడు—ఆలోచనలో మునిగిపోయిన కూతుర్ని కనుసైగతో చూపిస్తూ.

* * *

"ఏమండీ! లావణ్యకు ఏంబాగోలేదండి. విపరీతంగా జలుబు, తలనెప్పి వచ్చేసాయి. అసలు లేవలేదు. స్కూలుక్కూడా వెళ్లలేదు" సాయంత్రం కేంపు నుండి రాగానే ఆత్రంగా చెప్పింది కస్తూరి. నవ్వొచ్చింది భానుమూర్తికి. నవ్వితే ఏమవుతుందో తెలుసు కనుక తననితాను సంబాళించుకొంటూ—"అరె, ఏం చేసావు మరి? టేబ్‌లెట్స్ ఏమన్నా వేసావా లేదా? అనాసిన్, ఆస్ప్రో ఏదన్నా!" అన్నాడు.
"అయ్యో నామతి మండిపోనూ. నాకా ఆలోచనే తట్టలేదండీ! ఉదయంనుండి చూస్తూ ఊరుకొన్నాను. అసలు దాని కేమైనా వస్తే ముందు నామతి పోతుంది" నెత్తి కొట్టుకొంటూ అంది కస్తూరి.
"అదే నీతోవచ్చిన చిక్కు. అతిప్రేమ కూడా ప్రాణహానే. లేకపోతే జలుబుచేసి, కాస్త వెచ్చగా ఉండేసరికి యిలా అయిపోతారా? చూడు ఎట్లా ఉన్నావో! అసలు మధ్యాహ్నం భోజనం చేసావా లేదా?" కోపంగా అన్నాడు భానుమూర్తి.
"అవునండీ! నా బాధ మీకర్థంకాదు. వేళాకోళంగానే ఉంటుంది. 'నాది' అని గర్వంగా చెప్పుకోదగ్గమనిషి ప్రపంచంలో అదొక్కర్తేనండీ. నాకున్న ఆస్తి, సర్వస్వం అదేనండీ.!" దుఃఖంతో గొంతు పూడిపోయి, కళ్లనుండి ముత్యాల్లా నీళ్లు చెంపల మీదుగా జారాయి కస్తూరికి.
"అయితే నేనేమయ్యాను? నేను నీకేం కానన్నమాట" విసుగ్గాఅన్నాడు మూర్తి.
"ఎందుక్కాదూ! మిమ్మల్ని నాతో కట్టివేసే బంధం అదే. మిమ్మల్ని, మీ ప్రేమను, మీపై అధికారాన్ని ఏదీ పూర్తిగా పొందలేనిదాన్ని, సగభాగమే పంచుకోవలసినదాన్ని. మీ మీద నాకేం అధికారం ఉందండీ? 'నావారు' అని గుండెలమీద చెయ్యివేసుకొని నిశ్చింతగ నిద్రపోగలనా?. మీ ప్రేమ అనే గడ్డి పోచను పట్టుకొని జీవితం అనే మహా సముద్రంలో ప్రయాణం చేస్తున్నదాన్ని. 'అది' కాక మీకు పిల్లలున్నారు, భార్య ఉంది. నాకెవరున్నారు? ఇంకెక్కడ పిల్లలు పుట్టేస్తారోనని చెప్పకుండా ఆపరేషన్ చేయించేసుకొన్నారు. నేనేంఅనగలిగాను? ఇంకెవరున్నారు...నాకు అది, దానికి నేను తప్ప. నన్నర్థం చేసుకోవడం చేతకాదు మీకు...మీకెట్లా తెలుస్తుంది నా బాధ"
ఎర్రబడిన కళ్లతో చెంపలమీదకన్నీటి చారికలతో రోషంగా అంటున్న కస్తూరిని చూస్తుంటే చెయ్యని తప్పుకి శిక్ష అనుభవిస్తున్న వాడిలా అనిపించింది మూర్తికి. ఆ నోరు మూసేస్తూ దగ్గరకు తీసుకొన్నాడు.
"కస్తూరీ! నన్నెందుకిలా మాటలతో చిత్రవధ చేస్తావు? నాకో భార్య, పిల్లలు, సంసారం ఉందనే విషయం మరచిపొమ్మని ఎన్నిసార్లు చెప్పాను? అలా ఎన్నడైనా ప్రవర్తించానా? ఇప్పటి పరిస్థితికి, దానికి సంబంధం ఏమిటి చెప్పు. నీకేఅధికారంలేదని నువ్వెందుకనుకోవాలి? కోర్టులు, న్యాయసూత్రాలు నీకా అధికారం

యివ్వకపోవచ్చు. కానీ నా మనసు నీ కిచ్చిన అధికారం కన్నా ఎక్కువా అవన్నీ? నేనన్న మాటలు నువ్వు సరిగ్గా అర్థం చేసుకోవేందుకని? లావణ్య మీద నాకేం అధికారం, బాధ్యత లేనట్లు మాట్లాడతావేం? అది నా బిడ్డకాదా? నీకెంత ప్రేమ ఉందో, నా కూతురు మీద నాకూ అంతే ప్రేమ ఉంది కస్తూరీ. అది గుర్తుంచుకో. ఏదీ... ఏడవకూడదుమరి. డాక్టరు దగ్గరకు తీసుకువెళ్తాను. గౌను మార్చు"

మృదువుగానే అన్నా ఆ గొంతులో కొట్లాడే ఆవేదన, అతని గుండెల్లోఒదిగి పోయివింటున్నకస్తూరిమనసునుసూటిగానే తాకింది. తేలికపడ్డ మనసుతో అతన్నుండి విడివడి, బేబి దగ్గరకు వెళ్ళింది. రిక్షాలో డాక్టరు వద్దకు తీసుకు వెళ్ళి వచ్చేసరికి నీరసం ముంచుకొచ్చింది మూర్తికి.

కేంపు నుండి రాగానే 'టీ' అన్నా యివ్వకుండా ఏదేదో అని, అలాగే హాస్పిటల్‌కి తరిమింది. మనసంతా చికాగ్గా అయిపోయింది. నిస్సత్తువగా మంచం మీద వాలిపోయాడు. అపుడు గుర్తు వచ్చింది కస్తూరికి.

"అయ్యో! మీకు టీ అన్నా యివ్వ లేదు. పెట్టనా?" నొచ్చుకుంటూ అంది.

"ఊహు! వద్దు. స్నానం చేసి ఏకంగా భోజనం చేస్తాను" కళ్ళు మూసు కొనే జవాబు చెప్పాడు.

కస్తూరి వెనుదిరిగి వెళ్ళిపోయిన చప్పుడు అతని గుండెల్లో నుండి వస్తున్న నిట్టూర్పుని ఎదుర్కొంది.

"ఏమండీ! లేవండీ! యిదిగో కాస్త టీ తాగండి. సాయంత్రం అలవాటు కదా. తాగకపోతే తలనొప్పి వస్తుంది. అరకప్పే తెచ్చాను. లేవండి మరి..."

మృదుమధురమైన ఆమె మాటలు గాజుల గలగల చప్పుడుతో కలిసి అను పల్లవిగా తోచి ఎదలో సలిపిలి చేస్తున్న గాయంపై అమృతపు జల్లు కురిపించింది. అదే ఆమెలో గొప్పతనం! దానికే అతను బందీ ఎపుడూ!

లావణ్యకు కాఫీ, రొట్టె యిచ్చి, మందు వేసి నిద్ర పుచ్చింది. భర్తకు పడ్డించి, తను పక్కనే కూర్చుని కొసరి కొసరి తినిపించింది. మధురమైన అను భూతి మిగిలేటట్లు చేసిందా రాత్రి. సాయంత్రంనుండిచికాగ్గా ఉన్న విషయమే మరచిపోయి ఆమె గుండెల్లో గువ్వలా ఒదిగిపోయాడు భానుమూర్తి.

* * *

"లావణ్యా! మా ఇంట్లో క్యారమ్స్ ఆడదాం రా! తరువాత మీ యింటికి వెళ్ళవుగాని. నేను దిగబెడతాను!" స్కూలు వస్తూ త్రోవలో అంది మల్లిక.

"నాకు రాదుగా" అంది అమాయ కంగా.

"రాదులే, నాకు మాత్రం పెద్ద వచ్చేమిటి? ఆడుతుంటే అదే వస్తుంది. రా! ఫరవాలేదులే, ఆంటీతో నేను వచ్చి చెప్తాను" బలవంతంగా చెయ్యి పట్టుకు లాక్కు వెళ్తుంటే భయంగా అనుసరిం చింది లావణ్య.

మల్లిక ఎంత ప్రయత్నించినా లావణ్య చేత సరిగ్గా ఆడించలేకపోయింది. తల్లి ఏమంటుందో ఏమోనన్న భయం, యిటు మల్లిక మాట కాదనలేని నిస్సహాయత ఆ అమ్మాయి మనసుని స్తబ్దుగా చేసాయి.

"లావణ్యా! నువ్వు సరిగ్గా ఆడటం లేదు. సరిగ్గా నేర్చుకోవాలనుకుంటే వస్తుంది. ఎందుకు రాదు! నీకసలు నేర్చు కోవాలని ఉంటేగా! నీ గొడవే తప్ప




నీకేం అక్కరలేదు" విసుగ్గా కాయిన్స్ కలిపేసి లేచిపోయింది మల్లిక. భయంగా చూసింది లావణ్య. ఆ చూపుకి విచలిత అయిన మల్లిక లావణ్య చేయి అందు కొంటూ ఆత్మీయంగా నొక్కింది. యిద్దరూ కలిసి బయలుదేరారు.

"ఎక్కడికి వెళ్ళావు? చెప్పకుండా ఎక్కడికి వెళ్ళొద్దని ఎన్నిసార్లు చెప్పాను. అంత భయం లేకపోవడమేమిటి? సాయంత్రం నుండి ఎంత కంగారు పడు తున్నాను ఏమైపోయావోనని!" ఇంట్లో అడుగు పెట్టగానే కళ్ళెర్రచేస్తూ కేకలే సింది కస్తూరి.

ఆమూర్తిని చూడగానే కన్నీళ్లు కమ్ము కొచ్చాయి లావణ్యకు.

"నేనే తీసుకు వెళ్ళానాంటీ, కాసేపు కారెమ్స్ ఆడదామని. అది రాననే అంది. నేనే బలవంతంగా తీసుకు వెళ్ళాను" సంజాయిషీ చెప్తున్నట్లు మల్లిక అంటున్న మాటలు అగ్నిలో ఆజ్యం పోసినట్లు భగ్గు మనిపించాయి.



తనకు చెప్పకుండా ధైర్యంగా లావణ్య వెళ్ళిపోయింది. అదీ మల్లికతో, అన్న ఊహ కస్తూరి అహాన్ని దెబ్బతీసింది. అర్థం చేసుకొనే స్థితిలో లేదు. తన మాట కన్నా మల్లిక మాట ఎక్కువయింది తన బేబికి అన్న ఊహే భరించరానిదిగా ఉంది.

"యింకెప్పుడు అలా తీసుకు వెళ్లకు మల్లికా! చదవడానికే దానికి ఓపిక లేదు. ఇక ఆటలేం ఆడుతుంది. అయినా నాతో చెప్పకుండా దాన్నెక్కడికీ తీసుకు వెళ్లకు!" కర్కశంగా ఉన్న ఆ మాటలకు మల్లిక లేతమనసు గాయపడి ఆత్మాభిమానాన్ని చిందించింది.

"సరే ఆంటీ! లావణ్యా వస్తాను" అంటూ గిరుక్కున వెనుదిరిగి పరుగెత్తింది మల్లిక.

తల్లి మాటలకు మల్లిక ఎంత బాధపడుతుందోనని శూన్యంగా మల్లిక వెళ్లిన దిక్కే చూడసాగింది లావణ్య,

"నడు, యింకేం చూస్తావ్. వెళ్లి మొహం కడుక్కురా! పెత్తనాలు లావయిపోతున్నాయి" ఒక్క కసురు కసిరి వంటింట్లోకి నడిచింది.

తను అంత తప్పు ఏం చేసిందో ఆలోచిద్దామన్నా ఆలోచించలేనంత స్తబ్ధత, భయం ఆ పసిదాన్ని అణగదొక్కాయి.

భోజనం చేస్తున్నంతసేపూ, పడుకునే వరకూ చెప్పకుండా వెళ్లిందని సతాయిస్తూనే వుంది కస్తూరి. కన్నీరంతా ఘనీభవించినట్టు ఒక్క బొట్టు రాలలేదు లావణ్య కళ్లనుండి.

మనసు ఏ మూల నుండో చిల్లులు పడుతున్న అనుభూతి. అలాగే నిద్రపోయింది. కస్తూరి స్వభావమే అంత. తన మాట ఏ చిన్న విషయంలోనన్నా ఎవరన్నా లెక్కచేయకపోతే సహించలేదు. వాళ్లని మాటలతో చిత్రహింస చేస్తూ తన పెద్దరికం నిలుపుకొంటూ ఆనందిస్తుంది. 'మరెపుడు తన మాటకి ఎదురు చెప్పకూడదు బాబోయ్' అనిపించేటట్లు చేస్తుంది. రాత్రి భానుమూర్తికి చెప్పేంత వరకూ నిద్రపట్టలేదు. అదే పెద్ద తప్పు చేసినట్లు చెప్తున్న కస్తూరిని ఆశ్చర్యంగా చూసాడు. కాని ఆమె స్వభావం తెలిసినవాడు కనుక, తనను తాను సంబాళించుకొంటూ...

"పోనిద్దూ, ఆ మాత్రం స్వేచ్ఛ లేకపోతే ఎట్లా! మల్లికతోనే కదా వెళ్ళింది. మరీ దాన్ని హడలగొట్టేస్తున్నావ్!" నవ్వుతూనే అన్నాడు మూర్తి.

అయినా స్వరున లేచింది.

"ఆ పిల్ల రమ్మంటే అలా వెళ్ళిపోవడమేనా? మధ్యాహ్నం నుండి ఎదురు చూస్తున్న అమ్మ ఎంత కంగారు పడుతుందో అన్న ఆలోచన దానికి ఉండొద్దూ! ఈ రోజు యిదవుతుంది, రేపు మరొకటి అవుతుంది. ఆడపిల్లను అదుపులో ఇప్పటినుండే పెట్టకపోతే లొంగుతుందా! మీకేం, పొద్దున్న వెళ్ళి రాత్రికి వస్తారు. హాయిగా తిని పడుకొంటారు. దాని మంచి చెడ్డలు చూసే ఓపిక, తీరిక మీకెక్కడిది?"

గాలి ఇటు మళ్ళేసరికి భయపడి, అటు తిరిగి పడుకొన్నాడు మారు మాట్లాడకుండా.

'ఏమిటి కస్తూరి తత్వం! ఇంత చిన్నపిల్లకి అంత హద్దులేమిటి. ఏమవుతుందోనన్న భయమా? తనలాగే తెగిస్తుందన్న భయమేమో! పిచ్చి కస్తూరి తన నీడను చూసి తనే భయపడుతోంది. జీవితాంతం ఇంతేనేమో!' అనుకొంటూ నిద్రలోకి




జారిపోయాడు.

చాలా రాత్రి వరకూ కస్తూరిలో భయంకరమైన ఆలోచనలు రేగుతూ నిద్ర పట్టకుండా చేసినయ్.

*　*　*

"కస్తూరీ! నేను అర్జంటుగా ఊరు వెళ్ళాలి. పూర్ణకి బాగులేదని కబురు వచ్చింది. బహుశ నాలుగయిదు రోజులు పట్టవచ్చు రావడానికి. జాగ్రత్తగా ఉండండి. ప్యూన్ వస్తాడు ఏం కావాలన్నా తెప్పించుకో" హడావిడిగా చెప్తూ బట్టలు సర్దుకొంటున్న మూర్తిని చూస్తూంటే ఎక్కడో ఉన్న పూర్ణ మదిలో మెదిలి ఈర్ష్యను రేపింది కస్తూరిలో.

"ఏమిటి బాగులేదు. మీరు తప్పక వెళ్ళి తీరాలా?" బట్టలు కెలుకుతూ అంది. ఆ మాటల్లో దాచినా దాగని అసూయ మూర్తిని చేస్తున్న పనిని ఆపి ఆశ్చర్యంగా చూసేలా చేసింది. ఆ చూపుల ధాటికి తట్టుకోలేక తల దించుకొంది.

"నా అవసరం రానంతవరకూ నేను ఉన్నాననే తలంపు రాదు వాళ్ళకు. ఇక నాకు స్వయంగా కబురు పంపారంటే.." అర్థోక్తిలో ఆగిపోయిన గొంతులో ఆవేదన అతని మనసుని పట్టిచ్చినట్లయింది. ముఖం ముడుచుకొనే అన్నీ అందించింది.

"త్వరగా వచ్చేస్తావుగా?" అంత వరకూ మనసుకి మసి పూసిన ఈర్ష్య, అసూయలను, భరించలేని అతని ఎడబాటు దూరం చేసి అసలు మనసుని వెలిగ్రక్కింది బేలగా.

"వచ్చేయక, అక్కడేం చేస్తాను. కలవుండొద్దూ. జాగ్రత్త ప్యూను వస్తాడులే!" అంటూ సూట్‌కేస్ పట్టుకొని మెట్లు దిగాడు భానుమూర్తి.

'ఈయన ఎపుడొస్తారో, ఆవిడకెలా వుందో, కొంపతీసి ఏమన్నా జరిగితే? ఆఁ ఏమవుతుంది? ఏదోవంకన రప్పించుకోవ డానికికాకపోతే, ముసలాయన ఉన్నాడు, కొడుకులున్నారు... వాళ్ళకేం. కానీ ఈయన రాకపోతే తన గతేమిటి? పిచ్చి ఆలోచనలు, కాకపోతే రాకుండా ఎలా ఉంటారు?ఉద్యోగం?అయినా నన్ను వదిలి పెట్టి వుండగలరా?' ఆ లోచనలా పి లోపలికొచ్చిందేగాని... ఏదో తెలియని భయం కస్తూరిని స్థిమిత పడనీయడం లేదు. తన నీడ తననే భయపెడుతుంటే అయోమయంగా కూర్చుంది. లావణ్యాను చూస్తుంటే ఏదో దిగులు...

'భగవంతుడా, ఇలాంటి పిల్లనిచ్చి నా అదృష్టాన్ని నేలరాసావు. ఆ అన్న పూర్ణ, పిల్లల వుసురు ఇలా తగిలిందా? ఏమో? అయినా తనేం పాపం చేసిందని! అది శాపమే అయితే, అది భానుమూర్తిదీ అవుతుంది. తనెప్పుడూ వాళ్ళకి అన్యాయం చెయ్యమనలేదు. చిన్నప్పుడు తల్లిలేని లోటు తెలుసుకొంది. ఆడపిల్లకు తల్లిఅండ ఎంత అవసరమో తనకు తెలుసు. ఏ అండ లేకపోబట్టేగదా తనిలా క్షణం క్షణం భయపడుతూ తలెత్తుకొని తిరగలేని స్థితికొచ్చింది. తన కూతురిని తను జాగ్రత్తగా పెంచి పెళ్ళి చెయ్యకపోతే, అదెలా తయారవుతుందో! తన లాంటిస్థితి దానికి కలగకూడదు. అసలు తను మాత్రం... ఎలా ఈ జీవితంలో అడుగుపెట్టింది? తెలిసీ తెలియనితనం ముద్దు, మొండితనం, చదువులేకపోవడంతో ముందు ఆలోచనలేకుండా తెగించింది.'

లావణ్యా పక్కన చోటుచేసుకు పడు

కొంటే గతం కళ్లముందు కదిలింది కస్తూరికి. భానుమూర్తితో పరిచయం తన తెగింపు అదంతా తనకే ఆశ్చర్యంకలిగేలా జరిగిపోయింది అప్పుడు.




"బాబూ! నాయుడుగారూ...నాయుడుగారూ!" అన్న కేక విని తలదువ్వుకొంటున్న కస్తూరి చంగు చంగున గెంతుతూ వచ్చింది 'ఎవరూ?' అంటూ.

"నేనమ్మా కరనంగోరి పాలేర్ని, రేపు ఇనస్పెటీరుగారు ఒత్తారంట, నాయుడుగోరికి సెప్పిరమ్మన్నారు!" అన్నాడు పాలేరు పోలయ్య. "ఊఁ అలాగే చెప్తాసులే. పొలంలోకి వెళ్ళారు. రాగానే చెప్తానుగానీ పోలయ్యా, గోరింటాకు తెచ్చిపెట్టవూ" అంది కస్తూరి.

"అట్టాగేనండీ!" అనేసి వాడు వెళ్ళిపోయాడు. వీధిలోకి చూస్తూ అట్లాగే నిలబడింది కస్తూరి. పచ్చని పసిమిఛాయతో, బారెడు జడతో, పదహారేళ్ల వయసుతెచ్చిన అందాలతో, పచ్చగా ఎదిగిన అరటి మొక్కలా ఉన్న కస్తూరిని ఎవరైనా మరోసారి వెనుదిరిగి చూడ్డంలో ఆశ్చర్యం లేదు. అసలే పల్లెటూరు. నాగరికత తెలియని పల్లెలో, పెద్దింటి ఆడపడుచు నాగరికంగా ఉండటం మామూలే! కస్తూరి ఆ ఊరి యువకుల గుండెల్లో మందారాలు పూయిస్తున్నా ఎవరికీ ఆ మందారాన్ని కన్నెత్తిచూసే ధైర్యంలేదు. అటువంటి కుటుంబం నాయుడుగారిది. నీళ్ళ కడవలు నెత్తిమీద పెట్టుకొని వయ్యారంగా వెళ్ళిపోతున్న యువతులను చూస్తుంటే కస్తూరికి ఇల్లు బంధిఖానాలా వుంటుంది.

"ఏంచేస్తునావమ్మా యిక్కడ? పాలు త్రాగటానికి ఇందాకటినుండి పిలుస్తున్నాను" అంటూ పైకివచ్చింది అమ్మమ్మ. "ఏంలేదమ్మమ్మా. నీళ్ళుతెస్తుంటే చూస్తున్నాను" అంటూ లోపలికి నడచింది కస్తూరి. "రామ్మా! మీతాతగారొస్తే తిడతారు." అంటూ వంటింటివైపు సాగిపోయింది.

"అన్నట్టు అమ్మమ్మా! రేపు రెవెన్యూ ఇనస్పెక్టర్ వస్తున్నాడట. భోజనానికి కబురుపెట్టారు కరణంగారు" అని గది లోనుండి కేకవేసింది– కస్తూరి అద్దంలో చూసుకొంటూ.

మూడు పూటలా తినడం, టౌను నుండి తెప్పించుకొన్న పత్రికలు చదవడం, ఎపుడన్నా అలా కరణంగారమ్మాయి దగ్గరకు వెళ్ళడం అంతే. ఏడవ తరగతి వరకు ఊళ్ళో ఉన్న స్కూల్లో చదివిన కస్తూరికి, ఆ చదువుకన్నా పత్రికలవలన కలుగుతున్న జ్ఞానం అధికమై, ఊహాలోకాల్లో జీవించసాగింది. వచ్చిన ఒకటి, రెండు సంబంధాలు ఎవరికీ నచ్చలేదు. తన అందానికి, ఆస్తికి ఏ సినిమా హీరో లాంటివాడో తప్ప ఎవరూ పనికిరారని ఆమె ఉద్దేశం. ఆలోచనలు ఆకాశానికి నిచ్చెనలు వేస్తుంటే భూమ్మీద కాలూనడంలేదు కస్తూరికి. ఆ సమయంలోనే భానుమూర్తి వచ్చాడు–రెవెన్యూ ఇనస్పెక్టరుగా. ఆ ఊరికి ఏ అధికారులు వచ్చినా నాయుడుగారింట్లో విస్తరి లేవవలసిందే.




ఇంతకుముందు ఎందర్నో చూసిన కస్తూరి హాల్లో కూర్చుని తాతగారితో మాట్లాడుతున్న భానుమూర్తిని చూసి అలా నిలబడిపోయింది. ఎర్రగా, అందంగా, హుందాగా ఉన్న అతను రెవెన్యూ ఇనస్పెక్టరంటే నమ్మలేకపోయింది. ఆరోజు అతని దృష్టిలో పడాలని భోజన సమయంలో చేసిన ప్రయత్నాలు ఫలించాయి. తనను చూడగానే, అతని కళ్ళల్లో మెదిలిన ఆశ్చర్యాన్ని గుప్తంగా గుండెల్లో దాచుకొంది.

"ఏమండీ ! అతను హరిజనుడటగా. అయ్యో సట్టింట్లో మీ పక్కనే వడ్డించేసాను. మీకు తెలీదా? మీరన్నా చెప్పలా?" అంటూ కంగారు పడిపోతున్న అమ్మమ్మ మాటలు, కస్తూరి గుండెల్లో తీయని కోరికలు రగిలిస్తున్న భానుమూర్తి రూపాన్ని మసక బార్చేయి. కాని, తాతగారు–

"పోసిద్దూ ! కులంతో ఏముంది ? అతను అధికారి అంతే. కులాలు నొసటి మీద రాసి ఉంటాయటే వెర్రిదానా. ఇపుడు అందరూ సమానమేనని చెప్పడానికే వాళ్ళకి పెద్ద పెద్ద ఉద్యోగాలిచ్చి గవర్నమెంటు వాళ్ళ అంతస్థు పెంచుతోంది" అనేసరికి తెప్పరిల్లింది.

"ఆఁ అంతస్థు పెంచేస్తే, కులం ఏమయిపోతుంది. అవ్వ! మీకు తెలిసే చెప్పలేదన్న మాట. బాగుంది" అంటూ బుగ్గలు నొక్కుకుంది.

పదిహేను రోజులు గడచిపోయాయి. కస్తూరి ఊహల్లోంచి క్రమంగా భానుమూర్తి కనుమరుగు అవుతున్నాడు. యథాప్రకారం తయారవుతున్న కస్తూరి, గుమ్మంలో కూర్చుని ఓ రోజు పక్కింటి అలివేలుతో మాట్లాడుతోంది. అపుడే సైకిలు దిగిన భానుమూర్తి కళ్ళలోని కోటి వెలుగులు ఆమెను చుట్టుముట్టాయి అడుగు కదలకుండా. సిగ్గుల మొగ్గలా ముడుచుకొని క్రీగంటచూపులతో అతనికి ఆహ్వానం పలికింది. అంతలో లోపలనుండి వచ్చిన నాయుడుగారు ఇద్దరినీ ఈ లోకానికి లాక్కు వచ్చారు. కస్తూరి గిర్రున తిరిగి లోనికి పారిపోయింది. వచ్చిన పని వివరించాడు ప్యూను. దగ్గర్లో ఉన్న రెండు మూడు పల్లెలకు వెళ్ళి రావాలి. అంటే యిక్కడ భోజనం చేసి వెళ్లాలన్న మాట. కస్తూరిని ఆరాధన నిండిన అతని చూపులు వెన్నాడుతున్నాయి. ఆ రోజు అతనిపై మరికొంత ఆకర్షణ పెరిగింది. ఈసారి అతను ఆమె మనసులో స్థిరపడిపోయాడు. మరోసారి అతన్ని చూడాలనే తపన పెరిగిపోయింది. ఇవేమీ తెలియని అమ్మమ్మ... తల్లిని పోగొట్టుకుని, తండ్రికి దూరమైన మనమరాలిలో పోయిన కూతుర్ని చూసుకుంటూ మురిసిపోవడం తప్ప, ఆ పిల్లలో కలిగే మార్పు గమనించలేకపోయింది. పని పూర్తవలేదంటూ మళ్ళీ వారం తిరక్కుండానే వచ్చాడు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ భానుమూర్తి. నాయుడుగారు పనిమీద పట్నం వెళ్లడం, భగవంతుడు తనకిచ్చిన అవకాశంగా భావించుకొన్నాడతను.

"కస్తూరీ! ఈ ఊరు నన్నిలా బంధిస్తుందనుకోలేదు. నిన్ను చూడాలనే తపన నన్ను పదే, పదే లాక్కువస్తోందిక్కడికి. ఏం చెయ్యను?" అమాయకంగా అర్థింగా ఉన్న ఆ గొంతులోని ఆరాధన కస్తూరి అహాన్ని పదిరెట్లు పెంచింది.

"నాకూ అంతే!!" అనేసి పారిపోయింది.

భానుమూర్తి మాటలు రసగుళికల్లా తోచి మోహంలో ముంచెత్తాయి. ఆ తరువాత తనను తాను ఎంత మందలించుకున్నా, అన్నపూర్ణ దీనమైన మొహం కళ్ళముందు కదిలినా, పసివాళ్ళయిన ముగ్గురి కొడుకుల మొహాలు మనసులో మెదిలినా, పాప భీతి ఉన్నా, పరువు పోతుందనుకొన్నా, సంఘం దృష్టిలో, తనవాళ్ళ దృష్టిలో చులకనయి పోతాననుకొన్నా ఎన్ని అనుకొన్నా కస్తూరి ఆకర్షణ నుండి తప్పించుకోలేని బలహీనుడయిపోయాడు. ఇవన్నీ ఒక ఎత్తు, కస్తూరి లేకుండా బ్రతకడం ఒక ఎత్తు అనిపించింది. అందుకే తెగించి తన పరిస్థితి అంతా ఉత్తరం రాశాడు.

వణకుతున్న చేతులతో ఉత్తరం తెరచిన కస్తూరి సాంతం చదివి కుప్పకూలి పోయింది. పదే పదే చదివి జీర్ణించుకోలేక గిలగిలలాడింది. ఆశల నిచ్చెనలు నేలవాలి పోగా, ఊహలు గాల్లో కలిసిపోగా, తెలియని అవమానం, కసి, రోషం పెనవేయగా ఆ రాత్రంతా వెక్కి వెక్కి ఏడ్చింది. మొదటిసారిగా మనసు పారేసుకోవడం అంటే ఏమిటో అనుభవ పూర్వకంగా తెలుసుకొంది. అతనికి పెళ్ళయిందనేది తల్చుకొంటేనే అవతల వ్యక్తి మీద ద్వేషం కలుగుతోంది. అది భానుమూర్తి తప్పుగా అనిపించలేదు. తన సొత్తును దొంగతనంగా, జబర్దస్తీగా కాజేసిన దొంగలా అనిపించసాగింది అతని భార్య. చిన్నప్పటి నుండి కోరింది మరుక్షణంలో పొందే కస్తూరికి ఈ ఆశాభంగం భరించరానిదిగా అనిపించసాగింది.

'ఎవరెలాపోతే నాకేం? అతను తనవాడు, తనకు కావాలి! అతనికి తను కావాలి! అంతే. అతను లేని భవిష్యత్తును ఊహించడానికే భయంగా ఉంది. ఏది ఏమైనా, భాను తన స్వంతం కావాలి!'

తెలిసీ తెలియని వయసు అజ్ఞానంగా ఆవేశపడింది. వయసు తొందరచేసింది. ఆ పట్టుదల, తొందర ముందు ఏవీ గుర్తు రాలేదు. కులం, అంతస్థు, భవిష్యత్తు ఏవీ అడ్డు రాలేదు. అతను తరువాత మోసం చేస్తాడేమోనన్న ఊహే రాలేదు. 'తన కోసం అన్నీ వదులుకొంటున్నాడు' అన్న ఊహ ఆమెను అందలం ఎక్కించింది. ఆ వయసులోని మామూలు ఆడపిల్ల ఎలా ఆలోచిస్తుందో అట్లాగే ఆలోచించింది కస్తూరి కూడా. అందుకే అతనిచ్చిన ఎడ్రస్‌కి వంకర టింకర రాతతో దొంగచాటుగ తొలి ప్రేమ లేఖను తన సమ్మతి తెలియపరుస్తూ రాసింది.

కస్తూరికిపుడు ఎక్కడ చూసిన భానుమూర్తే కనబడుతున్నాడు. అతనితో గడపబోయే జీవితం తీయగానే అనిపిస్తోంది. అతని పిలుపుకోసం ఆత్రంగా రోజులు లెక్కపెట్టుకొంటోంది.

* * *

భానుమూర్తికి తెలిసీ తెలియని వయసులోనే పెద్దలంతా కలిసి ఆచారం అంటూ అన్నపూర్ణను జీవిత భాగస్వామిగా చేస్తే, అదే జీవితం అనుకొన్నాడు.

చదువయి ఉద్యోగంలో చేరేసరికి పెద్దవాడు పుట్టాడు. ఆ తరువాత యిద్దరూ పుట్టేసరికి రెవెన్యూ ఇన్‌స్పెక్టరయ్యాడు. బ్రతుకంతా యాంత్రికంగా సాగిపోతోంది. అలాంటి స్థితిలో అతనిలో నిద్రాణంగా ఉన్న సౌందర్యోపాసన, కోర్కెలు అన్నీ కస్తూరిని చూస్తూనే మేల్కొన్నాయి. అతనికి కావాల్సిందింకేదో ఉందనిపించసాగింది. తెలిసీ తెలియని వయసులో

పెళ్లిచేసిన తండ్రిని తల్చుకొని తిట్టుకొన్నాడు. భయపడ్డాడు కానీ, కస్తూరిపై ఆకర్షణ బలంగా ఉండడంతో మొండితనం ప్రవేశించింది. తన ఆనందాన్ని కాదనే హక్కు ఎవరికీ లేదన్న ఆలోచన అతనికి నైతిక బలాన్నిచ్చింది. అందుకే తెగించాడు. అతని నిరీక్షణ ఫలించింది. అనుకోనివిధంగా అతనికి కస్తూరి చేయూత లభించింది. తీవ్రంగా ఆలోచించాడు. ఒక పథకం వేసుకొని ఆ పథకం ప్రకారం యిల్లు, సంసారం అన్నీ అమర్చాడు ముందు. పల్లెలో ఉన్న భార్య, పిల్లలు, తండ్రి, సంఘం, ఉద్యోగం అన్నీ ఓ పక్కకు నెట్టి, కస్తూరిపై గల ప్రేమను, ఆకర్షణను ఆలంబనగా చేసుకొని, ఆత్మస్థైర్యంతో, ధైర్యంగా కస్తూరిని తీసుకువచ్చి కొత్తయింట్లో పెట్టి, ఊపిరి పీల్చుకొన్నాడు. కస్తూరి లేచిపోయిన తరువాత కొంతకాలానికి తాతగారు తెలుసుకొని మనిషిని పంపడం, గుట్టుగా తిరిగి వచ్చేయమని చెప్పడం, భానుమూర్తి ఉద్యోగం తీయించేస్తానని బెదిరించడం అన్నీ కస్తూరి తిరుగుబాటుముందు వీగిపోయాయి. కొత్త సంసారంలో కొత్తగా పెళ్లయిన దంపతుల్లాగనే ఆనందించారిద్దరూ.తను చేసింది తప్పు అని, దానికి ఎవరన్నా అడిగితే సంజాయిషీ చెప్పుకోవాలని అనిపించినా 'నా ఆనందంతో ఎవరికేం పని' అనుకొని తనకు తానే మరో ప్రపంచాన్ని నిర్మించుకొంది కస్తూరి. బయటకు వస్తే ఎవరేం అడుగుతారో, అది ఎటునుండి పోయి ఎటు వస్తుందో' అన్న భయంతో పైకివచ్చేది కాదు. ఒక్క ఫ్యాన్ తప్ప, ఎవరికీ యింటికి వచ్చే అవకాశం కల్పించలేదు భానుమూర్తి కూడా. అలా అలవాటయిన సంసార్తనౌక సుఖంగానే సాగిపోతుండగా ఈ అవాంతరం వచ్చిపడింది. అతను ఎంతగా ప్రేమిస్తున్నా అతనికి వేరేవాళ్లున్నారన్న సంగతి గుర్తుపస్తే, అతని ప్రేమంతా నీటిబుడగలా అనిపిస్తుంది ఒక్కోసారి. అందుకే భయం భయంగానే గడిపిందా రాత్రంతా.

ఆ భయాందోళనలతో నాలుగు రోజులు గడిచినట్లుగా కూడా గుర్తులేదు, ఐదోరోజు భానుమూర్తిని చూసేవరకూ.

"ఎలా ఉంది?" సూట్‌కేసు అందుకొంటూ తేలికపడ్డ మనసుతో అడిగింది.

"ఫరవాలేదు కాస్త నయంగానేఉంది" ముక్తసరిగా అనేసి బాత్‌రూమ్ వైపు వెళ్లిపోతున్న అతన్ని మరో ప్రశ్న అడగడానికి సాహసించలేకపోయింది. లావణ్య స్కూలుకి వెళ్లింది. ఇద్దరిమధ్య వంతెన కూలిపోయినట్లుగా దూరంఅయిపోయారు. మౌనం ఎంత మూగగా మనుష్యుల్ని బంధించి దూరం చేస్తుందో నిరూపిస్తున్నట్లు కాపలా కాస్తోంది.

"అయ్యా!తాశీల్దారుగారు సాయంత్రం కలుసుకోమన్నారు. రేపు కలెక్టరుగారి మీటింగుందంట. చెప్పమన్నారు" అన్న రాములు మాటలకు కళ్ల మీదనుండి చెయ్యి తీసి 'అలాగే' నన్నట్లు తలూపాడు భానుమూర్తి.

రాములు మాట విని పరుగున వచ్చిన కస్తూరి, మూర్తి తిరిగి కళ్లు మూసుకోవడంతో వెనుదిరిగింది పొంగి వస్తున్న భావాలను అదుపులో పెడుతూ.

"భోజనానికి రండి!"నిశ్శబ్దంలోనుండి బేలగా, భయంగా వినిపించిన ఆ పిలుపు అతని మనసును సూటిగా తాకింది.

"పద వస్తున్నాను" అంటూ లేచాడు.

చాలా సేపటి నుండి కళ్ళు మూసుకుని ఉండడం వల్లనో, ఆలోచనా భారం వల్లనోగానీ కళ్ళు ఎర్రగా అగ్నిపూలల్లా ఉన్నాయి. తల వంచుకొని మౌనంగా వడ్డిస్తున్న కస్తూరిని చూస్తుంటే జాలి వేసింది. అన్నీ కొసరి కొసరి అడిగి వేయించుకొన్నాడు చిరునవ్వుతో. అతని చిరునవ్వుతో ఆమెలో ముడుచుకుపోతున్న ఆత్మాభిమానం పడగ విప్పింది.

"వచ్చిన దగ్గర నుండి ఎందుకలా ఉన్నారు? ఘాడలిచచ్చాను మాట్లాడలేక?" కాస్త విసురుగా అంది. ఈసారి ఆశ్చర్యపోవడం భానుమూర్తి వంతయింది. అయినా తమాయించుకొన్నాడు.

సాయంత్రం కాగానే తహశీల్దారు దగ్గరకు బయలుదేరాడు. చిరునవ్వుతో సాగనంపింది కస్తూరి. లావణ్య స్కూలు నుండి రాగానే చూసిన బట్టలు, సూట్‌కేస్ తండ్రి రాకను నిర్ధారించగానే, హఠాత్తుగా తల్లి నుండి వేరు చేయబడ్డ పసిపాపలా బిక్కచచ్చిపోయింది. 'ఇదీ' అని చెప్పలేని భావం జాగ్రదావస్థలోనున్న ఉత్సాహాన్ని చంపివేసింది. కళకళ్ళాడుతున్న తల్లి మొహంలో, ఆ ఆనందంవెనుక లీలగా క్రూరత్వం పదునుగ మెరుస్తూ భయపెడుతోంది. మళ్లీ తను 'ఒంటరిది' అన్న భావన నరనరాన్న ఆవహించి నిస్సత్తువ చేసింది.

"కాసేపు చదువుకొని హోమ్ వర్కు చేసుకొని రా, భోంచేసి పడుకొందువుగాని" ఆ పసి మనసులోని భావాలు, ఆలోచనా తరంగాలు పసికట్టలేని కస్తూరి యథాలాపంగా అంది.

ఈ నాలుగు రోజులూ అమ్మ గుండెల్లో ఆదమరచి నిద్రపోయిన లావణ్య ఒంటరిగా బిక్కు బిక్కుమంటూ చీకటిని తోడు చేసుకొని నిద్రపోవడానికి ప్రయత్నిస్తోంది.

పక్కగదిలో విశాలమైన డబుల్ కాట్ మీద భర్త గుండెల్లో తల దాచుకొని నిశ్చింతగా నిద్రపోతోంది కస్తూరిని జూస్తూ, మనసును మరిగిస్తున్న వేదనను మరచి నిద్రపోవాలనే ప్రయత్నంలో ఓడిపోయి అన్నపూర్ణ జ్ఞాపకాలకు లొంగిపోయాడు భానుమూర్తి.




నాలుగు దినాల క్రితం జరిగిన సంఘటన అపుడే జరుగుతున్న అనుభూతిలో పడిపోయాడు భానుమూర్తి.

సూట్‌కేస్ పట్టుకొని మెట్లు ఎక్కుతున్న మూర్తికి చిన్నకొడుకు ఎదురై, "అమ్మను పొద్దున్నే హాస్పటల్‌కి తీసుకు వెళ్లాడు తాతయ్య" అని చెప్పాడు సూట్‌కేస్ అందుకొంటూ.

'నేను వస్తాను' అన్న చిన్నకొడుకుని తీసుకొని రెండోవాడు శ్రీనును హాస్పిటల్ ఎడ్రస్ అడిగి బయలుదేరాడు. బస్ పట్టుకొని పట్నం చేరి, హాస్పిటల్‌కి వచ్చేసరికి రాత్రయింది. ప్రయివేటు హాస్పిటల్ కనుక వెంటనే లోపలికి వెళ్ళగలిగారు. తండ్రి లోపల ఎదురై మొహం తిప్పుకొన్నాడు. చివుక్కుమన్న మనసుని అదుపులో పెట్టుకొంటూ మంచం దగ్గరకు వెళ్ళాడు. రక్తం ఎక్కిస్తున్న చేతిని కదలకుండా పట్టుకొన్న పెద్దకొడుకు




కరుణ నిరసనగా తండ్రి వంక చూసి తల తిప్పుకోవడంతో పట్టరాని ఆవేశం వచ్చింది భానుమూర్తికి. "ఏమయింది?" ఆవేశాన్ని, ఆత్రుతను అణచుకొంటూ అడిగాడు పూర్ణ తలకున్న కట్టును చూసి.

"ఏమయితేనేం? ఉన్నామో, చచ్చామో పట్టని మీకెందుకు?" విసురుగా అన్నాడు కరుణ.

"కరుణా! స్టాపిట్. నేనేం పట్టించుకోకుండానే మీరింత వాళ్ళయ్యారా? చదువుకొంటున్నావు తండ్రితో ఎలా మాట్లాడాలో తెలీదూ? ఏమయ్యిందిరా మురళీ?" అంటూ చిన్నకొడుకుని అడిగాడు.

"అమ్మ నిన్న సాయంత్రం బాత్‌రూమ్‌లో పడిపోయింది. దెబ్బతగిలి రక్తం పోయింది. మన ఆచారిగారు చూసి యిక్కడక్కు తెచ్చారు" అన్నాడు.

రాత్రి పన్నెండు గంటలకు కాస్త



తెలివి వచ్చిన పూర్ణ, హై టెంపరేచర్ రావడంతో డెలీరియంలో పడిపోయింది.

"మెంటల్ డిప్రెషన్ బాగా ఉన్నట్లు ఉన్నది. ఫిజికల్‌గా కూడా బాగా వీక్‌గా ఉన్నారు. దానిమీద రక్తం పోవడంతో ఈ స్థితికొచ్చింది. ఫరవాలేదు!" అన్న డాక్టర్ మాటలకు చుర చుర చూస్తున్న కరుణ చూపులకు అప్రయత్నంగా తల వంచుకొన్నాడు. 'పూర్ణ' అస్పష్టమైన మాటలలో ఆమె మనసులో నిర్దాణంగా ఉన్న భర్త ప్రవర్తనపట్ల అసహ్యం,ఆమె నిస్సహాయత,ఎన్నో ఏళ్లుగా మనసులో రగులుకుంటున్న చిచ్చు బయటకు చిమ్ముతోంది. 'తనుంటా'నని చెప్పి తండ్రిని, చిన్న కొడుకును, లాడ్జింగ్‌కి పంపేసాడు భానుమూర్తి.

"నెలకు, రెండు నెలలకు వచ్చి డబ్బు మొహాన పారేస్తే బాధ్యత తీరిపోతుందా? కట్టుకొన్న భర్త పరాయివాడిలా చూడ్డాని కొస్తే ఏ భార్య గుండెలు బండలయిపోవు!"సాధిస్తున్నట్లు చిన్నగా అంటున్న కరుణను చాచి లెంపకాయ కొట్టాలనిపించింది.

"మీ అంతట మీరే దూరంగా తప్పుకొన్నారు. చిన్నప్పుడంతా ఎలా వుండేవారు? దానికి నేనా బాధ్యుణ్ణి. దూరంగా వుండి వుద్యోగం చేసుకొనేవాళ్ళు లేరా? మీ కోసం, మిమ్మల్ని సుఖపెట్టడంకోసం, ప్రయోజకుల్ని చెయ్యడంకోసం ఎంత బాధపడుతున్నానో మీకు తెలియదా! చెప్పినా అర్థం చేసుకోరు!" విసుగ్గా, బాధగా అన్నాడు. భానుమూర్తి.

"అవును నాన్నా! కేవలం డబ్బు ఒక్కటే మనుషులను కలుపుతుందా? ప్రేమ, అభిమానం మనసు నిండా వుంటేనే మనుషలు ఒకటవుతారు. అవి దూరమైననాడు అంతా దూరమే.'ఉద్యోగ రీత్యా' అని ఎంత తేలిగ్గా అనేసారు. నిజంగా అలాగే అయితే మేమెంతో గర్వంగా తలెత్తుకు తిరగగలిగేవాళ్ళం. మీరిచ్చే డబ్బు మాకెంతో తృప్తిని, ఆనందాన్ని ఇచ్చేది. కానీ...కానీ... మీరు కేవలం మాకు డబ్బు ఇవ్వడానికొచ్చే మనిషిలాగే మమ్మల్ని చూస్తున్నారు... మా బాధ మీకెలా అర్థం అవుతుంది? మాకివ్వవలసింది డబ్బు ఒక్కటేనా? ఇంకేం లేదా?" ఆవేశంగా అంటున్న కరుణ, పూర్ణ కళ్ళు తెరవటంతో చప్పున నోరు మూసుకొన్నాడు.

"పూర్ణా! ఎలావుంది?" ఆత్రుతగా, మృదువుగా అడుగుతున్న భర్తను చూసిన వెంటనే తళుక్కుమన్న ఆ కళ్లు మరుక్షణం నిరాశతో వాలిపోయాయి.

"నన్నెందుకు బ్రతికించారు?" హీన స్వరంతో అంటూ వస్తున్న ఏడుపు నాపుకొందుకి వ్యర్థప్రయత్నం చేస్తున్న పూర్ణ చేయి పట్టుకొన్నాడు.

"ఏం మాటది!" అంటున్న భర్త గొంతులో ధ్వనించిన ఆవేదన ఆమె దుఃఖాన్ని మరింత ఎక్కువ చేసింది. "మీరు లేకుండానే, మిమ్మల్ని చూడకుండానే చచ్చిపోతానేమోనని భయపడ్డాను. ఇపుడు నేనేమైనా పర్వాలేదు. పిల్లలు పెద్దవాళ్ళయిపోయారు" అతని చేయి గట్టిగా పట్టుకొంటు అంటుంటే మౌనమే సమాధానమైంది. అతే! ఆ తరువాత పూర్తిగా తెలివి తెచ్చుకొన్నదాన్లా తల తిప్పేసుకొంది.

నాలవరోజు ఇంకా అన్నపూర్ణ హాస్పిటల్‌లో ఉండగానే ప్రయాణమయ్యాడు. అక్కడ అతని అవసరం కనిపించలేదు

 

మరి. కరుణ నిర్దాక్షిణ్యమైన చూపులు, పూర్ణ మౌనం ముళ్లమీద నిలబడినట్లుగా చేసినయ్.

"నేను వెళుతున్నాను. శెలవు లేదుమరి. వచ్చేవారం వస్తాను" అని చెప్తున్న భర్త కళ్లలోకి వెతికి చూస్తున్నట్లుచూసి "ఊఁ" అనేసి తల తిప్పేసుకొంది పూర్ణ. ఆ చూపులకర్థం తనకు తెలుసు.

"సెలవులేదానిజంగా? లేకపోతే ఆవిడ గారు ఊరుకోదనా?" అన్న ప్రశ్న స్పష్టంగా కనిపించిందా చూపుల్లో. చేసిన తప్పుకి శిక్ష అనుభవిస్తున్న నేరస్తుడిలా తలవంచుకొని భారమైన మనస్సుతో వచ్చేసాడు.

"అన్నపూర్ణ ఎన్నడూలేనిది ఎందుకిలా ప్రవర్తించింది? ఇదేం కొత్తగా జరిగిన సంఘటనకాదే! పదిహేను సంవత్సరాలనుండి అలవాటయినదే. ఇన్నేళ్లుగా లేని నిర్లక్ష్యం ఇపుడెలా వచ్చింది? అయితే పూర్ణకిలా యింతకు ముందెపుడూ అనారోగ్య పరిస్థితి రాలేదు. ఈ నాడు యిలా జరిగేసరికి, మనసులో ఉన్న నిర్లక్ష్యం, కసి బయట పడ్డాయా? ఏనాడు ఎదురుగా నిలబడి ధైర్యంగా జవాబు చెప్పని కరుణ మొహంమీదే విమర్శించేంతగా ఎదిగిపోయాడా? ఇన్నాళ్లు మనసులో పేరుకుపోయిన ద్వేషం ఈ సంఘటనతో బయటకు వచ్చిందా? తనకూ, వాళ్ళకూ డబ్బు సంబంధం తప్ప మరేమీలేదా?డబ్బుపారేసి తను బాధ్యత వదులించుకొంటున్నాడా? కస్తూరిని ప్రేమించవచ్చు. ఉద్యోగరీత్యా ఈ ఊళ్లో ఉండవచ్చు. కానీ వాళ్ళెపుడూ తనకళ్ల ముందే ఉంటారే. తను కేవలం డబ్బుసంపాదించే యంత్రం మాత్రమేనా? హుఁ పూర్ణ...ఎన్నడూ ఒక్క మాటకు సమాధానం చెప్పని పూర్ణలో ఎదిగిన కొడుకులను చూసి యింతవరకు దాచుకొన్న నిర్లక్ష్యం పడగ విప్పిందా? హృదయాంతరాల్లో దాగిన పగ, కసి బుసలు కొడుతున్నాయా? అలా అయిన నాడు తనేం చేయాలి? యింకా వాళ్ల చదువులకు ఎంత బాధ్యత వహించాలి? ఎంత కాలం ముందుంది? మిగిలిన కాలమంతా ఇట్లాగే జరుగుతుందా? లావణ్యా ఒక్కగానొక్క ఆడపిల్ల. దాని భవిష్యత్తేమిటి? ఇద్దరి మధ్య సంబంధ బాంధవ్యాలు పెంచకపోవడం తన పొరపాటే.

* * *

అన్నపూర్ణ బాగా కోలుకునే లోపున రెండుసార్లు వెళ్లి వచ్చాడు భానుమూర్తి. కాని వాళ్ల ప్రవర్తన అట్లా ఉండటంతో గతంలోలా ఫ్రీగా ఉండలేకపోతున్నాడు. వాళ్ల చూపులు గుచ్చుకొని నిలదీసినట్లు, వాళ్ల మాటలు తనపై విసిరే వాగ్బాణాలుగా అనిపించసాగాయి. తన యింట్లోనే తన మనుష్యుల మధ్య అతిథిలాగా గడపవలసి రావడం అతని అహాన్ని దెబ్బతీసింది. ఆ భావం కనబడనీయకూడదన్న తాపత్రయంలో కస్తూరిని తనకు తెలియకుండానే చాలాబాధపెట్టాడు. ఈగొడవలో లావణ్య తల్లికి మరింత దగ్గరై తండ్రికి ఇంకొంచెం దూరమైంది కూడా.

* * *

కాలంతోపాటు భానుమూర్తి పరుగెత్తి, పరుగెత్తి అలసిపోయి వెనుదిరిగి చూసాడు ఓసారి. లావణ్య టెన్త్‌క్లాసు కొచ్చింది. బి.ఎ.ముగించిన కరుణ బి. యల్.లోనూ, రెండోవాడు శ్రీను ఇంజనీరింగ్‌లోనూ జాయన్ అయ్యారు. విశాఖపట్టణంలో హాస్టల్‌లో ఉండి చదివించాలంటే, గవర్నమెంటు ఎన్నిసదుపాయాలు చేసినా భారం

గానె తోచింది భానుమూర్తికి. మూడోవాడు కాలేజిమెట్టు ఎక్కాడు. మూర్తి తలలో అక్కడక్కడ వెండి పోగుల్లాంటి తెల్ల వెంట్రుకలు బయటపడి గడిచిపోతున్న వయసునిగుర్తు చేస్తున్నాయి. కస్తూరి మాత్రమే పెద్దమార్పేమీలేకుండా మిగిలి పోయింది.

*   *   *

"మల్లికా! స్కూలుకు టయమయ్యింది" లావణ్యగొంతు విని ఓణీ సవరించుకొంటూ హాల్లోకి వచ్చింది మల్లిక.

"హారొచ్చే, వచ్చేస్తున్నా!" అంటూ లోపలకు వెళ్ళి పుస్తకాలు, టిఫిన్ బాక్సు పట్టుకొని వచ్చింది. ఇద్దరూ కలసి నడప సాగారు.

"ఒరేయ్! ఈ పాప బాగుందికదరా. పాపా నీపేరేమిటి?" బృందంలోని ఒకడు ఆరాతీసాడు ముద్దుగా.



"పాప ఏమిట్రా, నీబొంద. అమ్మాయి అనాలి. అయినా, కాకి ముక్కుకి దొండ పండులా, ఆ అమ్మాయి పక్కన ఈ పిల్లేమిట్రా!" వాపోయిందో గొంతు.

"ఆ అమ్మాయికి దిష్టి తగలకుండా ప్రక్కన పెట్టారు కాబోలురా!" అన్నాడు మరొకడు.

టక్కున ఆగిపోయింది మల్లిక. లావణ్య కూడా ఆగిపోయింది.

"మీ పేరేమిటో తెలియదుగానీ నమస్తే! మనసున్న మనిషి అందాన్ని ఆస్వాదించాలి. అంతేగానీ మరో మనసుని బాధ పెట్టేయకూడదు. వికారం మనిషిని బట్టి కాదు మనసుని బట్టి ఉంటుంది. మీ కుసంస్కారం మీ మొహాల మీద ముద్రవేసి మీ అందాన్ని మూసేసింది. ఎదుటి మనిషిని మనిషిగా చూడడం నేర్చుకొంటే మీ సంస్కారం బయట పడుతుంది!" ధైర్యంగా ఎదురుగా నిలబడి ఉపన్యాస ధోరణిలో చెప్తున్న మల్లికను అవాక్కయి చూసారు ముగ్గురు యువకులు.

ముందు నిలబడిన లావణ్యను కలుసుకొని హుందాగా నడచిపోతున్న మల్లికను చూస్తూ ఏమనాలో తోచక చూస్తుండి పోయారు.

"మల్లికా! నిన్ను హెడ్‌మాస్టరు రమ్మన్నారు. స్కూల్‌డే గురించి మాట్లాడాలట!" గేటువద్దనే కబురు చెప్పిందో అమ్మాయి.

"లావణ్యా! వస్తావా లేకపోతే క్లాసులో కూర్చుంటావా?" అడిగింది మృదువుగా.

"ఎందుకులే క్లాసులో కూర్చుంటాను. ఆ బాక్సు, పుస్తకాలు యిటివ్వు" అంటూ అవి అందుకొని క్లాసువైపు నడచింది. క్లాసులోఅడుగు పెట్టేవరకూ అటే చూస్తూ నిలుచున్న మల్లిక, తరువాత హెడ్‌మాస్టర్ రూమ్‌వైపు అడుగులు వేసింది.

"దీని పిచ్చి. ఆ మల్లిక పక్కన చూద్దూ దిష్టిబొమ్మలా ఎలా ఉంటుందో! అది తెల్లగా, ఇది నల్లగా, అది పొడవుగా ఇది పొట్టిగా...అబ్బబ్బ ఏం కాంబినేషన్! అన్నిటిలోనూ ఫస్టయిన మల్లిక... మన కెవ్వరికీ తన దగ్గర చనువివ్వని మల్లిక ఆ లావణ్యను మాత్రం నెత్తి మీద పెట్టుకొంటుంది. మల్లిక గర్వమే దానికి ప్రత్యేకంగా ఉంటుంది లెద్దూ! ఓణీ వేసాక యింకా అందంగాఉంది కదూ!" మల్లికను, లావణ్యను చాలా రోజుల నుండి గమనిస్తున్న సుందరి నజమాతో అంది.

"అదేనే స్నేహమంటే! ఫస్టుఫారం నుండి చూస్తూనే ఉన్నాం గదా. ఎగతాళి చేస్తూనే ఉన్నాం కూడా. అయినా యిద్దరిలోనూ మార్పులేదు. లావణ్యలో అందం లేకపోవచ్చు. తెలివైంది కాకపోవచ్చు, కాని చాలా మంచిది. అందుకే మనమంతా దాన్ని వేరు చేసినట్లు చూసినా మల్లిక మాత్రం లావణ్యను విడిచిపెట్టలేదు" అంది నజిమా. అంతలో బెల్ అవడంతో ప్రేయర్ గ్రౌండ్‌కి చేరుకొన్నారంతా.

* * *

"ఆంటీ! లావణ్య ఏం చేస్తోంది?" అంటూ వచ్చిన మల్లికకు గదిలోకి చూపించింది కస్తూరి. చాపమీద కూర్చొని లెక్కలతో కుస్తీపడుతోంది లావణ్య.

"ఏం లెక్కలే! ఏదీ నేచెప్తానిలాతే!" అంటూ పుస్తకం లాక్కుంది.

"అన్నీ వచ్చేసాయి. ఇదొక్కటే రావటంలేదు!" నెమ్మదిగా అంది లావణ్య.

"అదీ అంతేనే, కాకపోతే 'ఎక్స్' విలువ ముందు కట్టాలి!" అంటూ ఒక్క

చిటికెలో చిత్తుపుస్తకంమీద చేసేసింది మల్లిక.

"నువ్వు మల్లిక క్లాసే, తనుచెయ్యగలి గింది నువ్వెందుకు చెయ్యలేవూ. క్లాసులో చెప్పినపుడు ఎక్కడ దిక్కులు చూస్తావ్? శ్రద్ధగా చదువుకొని పైకివద్దామన్న ధ్యాసలేదు. నీ మీద ఆశలు పెట్టుకొన్నాను. ఏం పిల్లవో!" అంతా చూస్తున్న కస్తూరి ఉక్రోషంగా అంది.

తల దించేసుకొంది లావణ్య. తనకేమీ పట్టనట్లు మరో లెక్క చెయ్యడంలో మునిగిపోయింది మల్లిక.

"ఈవిడ మాటలు పట్టించుకొంటే, ఈ ఇంటికి రావడం ఎపుడో మానేసి వుందును!" అనుకొంది మనసులోనే.

ఇద్దర్నీ అలా చూస్తుంటే మనసులో రేగే ఆవేదన కసిగా బయటకు తన్నుకు వస్తోంది కస్తూరికి. ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో గిరుక్కున వెనుదిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

'ప్చ్. దీనితోడిదే ఆ పిల్ల! ఎంత చక్కగా ఉంటుంది. చక్కదనం లేకపోతే పోయె,అవయవ పొంకంఅన్నా లేదు. పోనీ తెలివితేటలున్నా బాగుండును. దీని తోడి వాళ్లందరూ పెద్దవాళ్లయి ఓణీలు వేసుకొంటున్నారు. ఇదింకా లంగా జాకెట్లులోనే వుంది. పదిహేనేళ్లు వెళ్లబోతున్నాయ్. ఇంకా పెద్దమనిషికాలేదు. భగవాన్ ఈ అపకరం కూడా పెట్టకు. నీకు ప్రాయశ్చిత్తం చేయాలనుంటే నాకు చెయ్యి, లేకుంటే దాన్ని నీ దగరకు తీసుకుపో, అంతేగాని ఈ బాధ నేను భరించలేను'

..అన్నం మాడుతున్న వాసన కస్తూరిని వాస్తవానికి లాక్కువచ్చింది.

ఆ రాత్రి భానుమూర్తితో పంచుకొంటేగాని తగ్గలేదా ఆవేదన. కస్తూరి సందేహం విని మెదడు మొద్దుబారిపోయింది మూర్తికి. బాధ్యతలతోను, సమస్యలతోను, పైబడుతున్న వయసుతోను ఒకవిధమైన అశాంతితో రోజులు గడుపుతున్న మూర్తికి ఈ వార్త శరాఘాతమయింది. అయినా ధైర్యం తెచ్చుకొంటూ "చూద్దాం! లేడీ డాక్టరుకి చూపిద్దాం!" అన్నాడు. ఆ మాటకే కొండంత ధైర్యం తెచ్చుకొని నిశ్చింతగ నిద్రపోయింది కస్తూరి.

మరునాడే డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్ళారు. 'ఆపరేషన్' చెయ్యాలన్న మాట విని, లోకమే శూన్యమైపోయినట్లు జీవచ్ఛవంలా తిరిగివచ్చింది కస్తూరి. కళ్ల ముందు అమాయకంగా తిరుగుతున్న కూతుర్ని చూస్తుంటే గుండె తరుక్కుపోసాగింది. "ఎపుడు పరీక్షలయి ఎపుడు ఆపరేషన్ జయప్రదం అవుతుందో' నని రోజులు లెక్క పెడుతున్న కస్తూరికి కాలం నత్తనడక నడుస్తున్నట్లే అనిపిస్తోంది.

* * *

"లావణ్యా!మా నాన్నగార్కి ట్రాన్స్ఫర్ అయిపోయింది. రెండు రోజుల్లో వెళ్లి జాయిన్ అవుతారు!" అన్న మల్లిక మాటలకు,లావణ్య కళ్ళలో నీళ్ళు చిమ్మాయి.

"మల్లికా! నన్ను వదిలి వెళ్ళిపోతావా" వణుకుతున్న గొంతుతో దుఃఖాన్నదిమిపెట్టాలన్న ధ్యాసే లేనట్లు పలికింది.

"అవును లావణ్యా! ఎక్కడుంటాం. మరి, అయినా యిపుడే కాదులే. శలవులిచ్చాక వెళ్తాం. ఈలోగా నాన్నగారు యిల్లు చూసొచ్చు" చూపుకి అడ్డుపడుతున్న నీటి పొరకు ధైర్యాన్ని ఆనకట్ట వేసి, బొంగురు పోయిన గొంతుతో పేలవంగా అంది మల్లిక.




మిగిలిన స్ట్రోవంతా భవిష్యత్తుగా భారంగా అనిపించింది లావణ్యకు.

"మల్లికా! నాకు...కలవల్లో ఆపరేషన్ చేయిస్తారట. నువ్వు లేకుండా, ఒకవేళ నేను... నేను చచ్చిపోతే నన్ను గుర్తుంచుకొంటావు కదూ!" దుఃఖం ఉరకలు వేస్తూ ముంచెత్తింది.

మల్లిక కళ్ళ నుండి ముందుకురికాయి కన్నీళ్ళు.

"అదేమిటే, అలా ఏడుస్తున్నావు?" అన్న విజయ మాటలు స్కూలు వచ్చిందన్న వాస్తవానికి లాక్కువచ్చాయి.

"పరీక్షలయ్యేవరకు ఉంటాం కదే. నీ ఆపరేషన్ అయ్యేవరకు వుంటాను. నీకేం భయం లేదు" అంటూ ఊరడించింది మల్లిక.

"అమ్మా! మల్లికవాళ్ళకి ట్రాన్స్‌ఫర్ అయిపోయిందట" రుద్ధకంఠంతో అంటున్న కూతుర్ని చూసి ఆశ్చర్యపడింది కస్తూరి. ఆ వార్త ఆవిడ మనసులో నిద్రాణంగా ఉన్న ఈర్ష్యను గుచ్చేసింది. లావణ్య మనసులో మల్లికకు స్థానం ఉందన్న సంగతి గ్రహించిన క్షణం నుండి మల్లిక పట్ల ఈర్ష్య,అసంతృప్తి పెంచుకొంటూనే ఉంది కస్తూరి. అందుకనే ఈ వార్త ఆవిడకు సంతోషాన్ని కలిగించిందనే చెప్పాలి.

"ఉద్యోగాలు చేసుకొనేవాళ్ళు ట్రాన్స్‌ఫర్లమీద వెళ్లక ఒక్క దగ్గరే ఉంటారా? నాన్నగారికయితే మనం వెళ్లమూ, అట్లాగే ఇదీనూ" తేలిగ్గా అంటున్న తల్లిని ఏమనాలో తెలియక మౌనంగా వెళ్లిపోయింది లావణ్య.

ఎలా అయితేనేం పరీక్షలు బాగానే రాసాననిపించింది - లావణ్య. ఇంత వరకూ రోజులు లెక్క పెట్టుకొంటున్న కస్తూరి, లావణ్యను బలిపీఠానికి తీసుకు వెళ్లే సమయం ఆసన్నమౌతున్నదని వణికి పోయింది. అయినా తప్పదుమరి. లావణ్య ఆపరేషన్ జయప్రదంగానే అయిపోయింది. మల్లిక దగ్గరే ఉంది. ఓ పది రోజులు హాస్పిటల్‌లో ఉండి యింటికి వచ్చారు తల్లీకూతుళ్లు. మల్లికవాళ్లు వెళ్ళే టైము దగ్గర కాసాగింది.

"లావణ్యా! ఉత్తరాలు రాస్తాను. జవాబులు రాస్తుండు అశ్రద్ధ చెయ్యకుండా. నిన్నెప్పుడూ మరచిపోను లావణ్యా. నా మనసులో నుండి చెరిగిపోవు ఎన్నటికీ. నువ్వుకూడా మరచి పోకుండా ఉత్తరాలు రాస్తుండాలి!" తడిగా మెరుస్తున్న కళ్లల్లో ఆప్యాయత పారిజాతంలా పరిమళిస్తుండగా చిరునవ్వుతో విచ్చుకొన్న పెదవులమధ్య వణుకుతున్న దుఃఖం గొంతు పలికే మాటలకు చెలియలకట్టే అయ్యింది.

లావణ్య బావురుమంది. అది రైల్వే స్టేషన్ అన్న మాటే మరిచిపోయింది.

"ఏమిటమ్మా అది. తప్పు. ఉత్తరాలు రాస్తుందిలే. కళ్లుతుడుచుకో" అంటూ తండ్రి అనునయిస్తుంటే బలహీనంగా నవ్వింది లావణ్య.

ముందుకు కదిలింది రైలు. లావణ్య గుండెలనిండా దుఃఖం నింపుకొంటూ నిలబడలేనట్లు తూలింది.

"నీర్సంగా ఉన్నావు.వద్దన్నానందుకే. నడు టాక్సీలో పోదాం!" అంటూ హడావిడిపడ్డాడు భాసుమూర్తి.

లావణ్య మనసుని,మనిషిని ఒంటరి చేసి వెళ్లిపోయింది మల్లిక. రోజులు నిస్సారంగా గడుస్తున్నాయి లావణ్యకు. మల్లిక

దగరనుండి ఉత్తరం వస్తే ఆ రోజంతా పండగే లావణ్యకి.




"హాస్పిటల్‌లో ఎవరో ఉన్నారట గదా!" చాలా రోజుల తరువాత వచ్చిన భాసుమూర్తికి భోజనం పెడుతూ అడిగింది పూర్ణ కుతూహలంగా.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. తండ్రి వీధిగదిలో నిద్రపోతున్నాడు. కొడుకులు ముగ్గురూ విశాఖపట్టణంలోనే ఉన్నారు. కాస్త వయసు పైబడ్డ పూర్ణ నిర్లిప్తంగా, హుందాగా ఉంది. అయినా భర్తపట్లజాలిని మాటల్లో వ్యక్తంచెయ్యకుండా ఉండలేదు. తొలిరోజులలో ఆమె మాటలకు పౌరుష పడేవాడు కాని యిపుడు ఆమె మాటల వెనుకగల జాలి అతని మనసుని సేద దీరుస్తోంది. కస్తూరితో సర్దుకుపోతూ మరచిపోయిన తనవ్యక్తిత్వం పూర్ణ ఎదురుగా తలెత్తుకొని నిలబడినట్లు అనిపిస్తుందతనికి. అందుకే మనస్ఫూర్తిగా చెప్పాడు లావణ్యసంగతి. విని విచారించింది పూర్ణ. ఆ తరువాత పిల్లలు, వాళ్ళచదువులు. తండ్రి ఆరోగ్యం మీదుగా సంభాషణసాగి, సాగి రాత్రిని తగ్గించింది.

* * *

"బేబీ... బేబీ... ఏదీ నీ నంబరుపట్టా చూద్దాం. రిజల్ట్స్‌వచ్చాయి" ఉత్సాహంగా తండ్రి వేసిన కేక లావణ్య గుండె నొక్కసారి ఆగిపోయేట్టు చేసింది. వణుకుతున్న కాళ్ళతో, అదిరే గుండెలతో నంబర్లు తెచ్చింది.

"ఏదీ! మల్లిక నంబరు ఉందా?" అంటూ కాగితం అందుకొని చూడసాగాడు. కస్తూరి, చేస్తున్న పనిఆపేసి వచ్చినిల్చుంది ఎదురుగా ఉద్విగ్నత నిండిన మనసుతో.

ఏం వార్తవినాలో అనే ఆందోళనతో అది వినగానే తల్లి చూసేచూపును భరించడానికి సిద్ధపడుతున్నట్లు మనసు ఉగ్గబట్టుకొంది లావణ్య.

"కంగ్రాట్స్ బేబీ. పాసయ్యావు!" అంటూ చేయిచాస్తే, ఆ చేతిని భయ భయంగా అందుకొంది. కస్తూరి గర్వంగా దగ్గరకు తీసుకొంది లావణ్యను.

"అబ్బ! మల్లిక ఫస్టుక్లాసులో పాసయ్యింది!" సంతోషంగా అంటున్న తండ్రి మాటలకు లావణ్య మనసు ఆనందంతో నిండిపోయింది. కస్తూరిలో మాత్రం అనందం ఊదేసినట్లు ఆరిపోయింది.

"ఆ అపిల్లకురాకపోతే దీనికొస్తుందా? నాకంత అదృష్టమెక్కడిది? ఏనాడో పెట్టి పుట్టాను ఇలాంటి కూతురికోసం. దీని క్లాసే చదువుతోందా! ఆ అమ్మాయి దీనికి ప్రయివేటుచెప్పుంది మరి. ఫస్టుక్లాసురాదూ!" మనసులో ఉక్రోషం ఒక్క పుదుటున బయటపడింది.

"అదేమిటి కస్తూరీ! అలా అంటావ్? ఇది పాసయిందని సంతోషిస్తావా? ఆ అమ్మాయికి క్లాసు వచ్చిందని ఏడుస్తావా? బాగుంది, ఎవరదృష్టం వాళ్ళది" అని విసుక్కున్నాడు భాసుమూర్తి.

"మీకు తెలీదండీ నాబాధ. ఇది క్లాసు తెచ్చుకొని పైకి రాకపోతే ఎలా బతుకు




తుండండీ!? దాన్ని డాక్టరు చెయ్యాలని ఎన్ని కలలు కన్నాను!" ఏడుపే తరువాయిగా అంది కస్తూరి.

ఆ మాటలు వినగానే గప్‌చుప్‌గా జారుకొంది లావణ్య. తల్లి తన మనసులోని ఆశలు, కోరికలు బయటపెడుతుంటే ఓపిగ్గా తండ్రి చెప్తున్న జవాబులు వినిపిస్తున్నాయి లావణ్యకి. తల్లి మాటలు విసుగ్గా అనిపించసాగాయి.

'అసలావిడకు అన్ని కోరికలు, ఆశలు ఎలా వచ్చాయో?' ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

'ఏంచెప్తే అది చెయ్యాలనే' శిక్షణ ఆ పిల్లను అంతకన్నా ఆలోచించనీయలేదు. ఆ రాత్రి మల్లిక తలపులతో నిశ్చింతగా నిద్రపోయింది లావణ్య ఒక్కర్తే.

"ఏమండీ, ఏం చేద్దాం? ఏ కాలేజీలో చేర్పిద్దాం? సైన్సులో సీటు చూడండి!" అంటూ కస్తూరి లావణ్య భవిష్యత్తుకు పునాది వేస్తుంటే మౌనంగా తనూ ఒక్కొక్క రాయే అందిస్తూ గడిపేసాడు భానుమూర్తి.



"దాన్నొకసారి అడిగిచూద్దాం, మనం బలవంతం చెయ్యడం ఎందుకు?" అన్న భాను మాటలకు కస్సుమంది కస్తూరి.

"దానికేంతెలుసు? ఏంతినాలో, ఏం తిన కూడదో కూడా తెలియనిదానికి, ఏం చద వాలో ఎలా తెలుస్తుంది. దానికన్ని ఆశలు, కోర్కెలు వుంటే నేనెందుకిలా బాధపడ తాను. మీకిష్టం లేకపోతే చెప్పండి!" వెక్కిరింతగా అంటున్న కస్తూరి మాట లకు మూగబోయాడు భానుమూర్తి.

ఏమయితేనేం, లావణ్య ఇష్టాయిష్టాలతో పనిలేకుండా కస్తూరి ప్రోద్బలంతో సైన్సు గ్రూపుతో ఇంటర్‌లో జాయిన్ అయింది లావణ్య భానుమూర్తి ఇన్‌ఫ్లుయెన్స్‌తో. కాలేజిలో చేరేముందు బాగుంటుందని ఓణీలు వేయించింది. సాపుగా చెక్క బొమ్మలా వుండే లావణ్య ఓణీలు వేసే సరికి మరింత సన్నగ, పొట్టిగ కనిపి స్తోంది. మల్లిక పక్కన లేనిలోటు గుండెల్ని వణికిస్తుంటే నిర్వికారంగా కాలేజీలో అడుగు పెట్టింది.

అక్కడ అన్నీ కొత్త మొహాలే! అందరిలో ఉత్సాహం, ఆనందం పరవళ్లు తొక్కుతోంది. వయసుల పొంగుల హంగుల ప్రవాహంలో భవిష్యత్తును కమ్ముకుపోవాలనే కలలతో కేరింతలు కొడుతున్నవారే అందరూ. మొదటి రోజు స్కూలుకు వెళ్ళినప్పటిలా ఆ ప్రవా హంలో కొట్టుకుపోతున్నదానిలా గడ గడలాడుతూ నిలబడిపోయింది లావణ్య.

* * *

మల్లిక దగ్గరనుండి ఉత్తరం వచ్చిన రోజు లావణ్యకు పండగే. ఆ రోజు మాత్రం ఏం చలనం లేని ఆమె కళ్ళల్లో కొద్దిగ మెరిసేతడి ఆ ఆనందాన్ని ప్రస్ఫు టింప చేస్తోంది.

"లావణ్యా! మైడియర్ బేబీ,

నువ్వు కాలేజిలో జాయిన్ అయ్యావను కొంటాను. నేను మొన్ననే జాయిన్ అయ్యాను. ఇదొక రంగుల ప్రపంచం. నదిలోంచి సముద్రంలోకి జారిపోయినట్లు వుంది కదూ! బేబీ ఈ ప్రపంచం చాలా విశాలమైనది. అందులో మనం ఒక అణువులా అన్పిస్తుంది. ఎంతమందో, ఎన్ని రకాల మనషులో, ఎన్ని రకాల మనస్తత్వాలో, వారిని పరిశీలనా దృష్టితో చూడ్డం అలవరచుకొంటే ఏ పుస్తకాలు చెప్ప లేని జీవిత పాఠాలు నేర్చుకోవచ్చు. నీవు కాస్త పక్కవాళ్ళు ఎవరు ఏం చేస్తు న్నారు అన్న విషయం ఆలోచించాలి. మనకు మనం గిరిగీసుకు ఉందామన్నా ఉండనివ్వదీ సంఘం. అందుకని ఒకరు మనల్ని చదివే ప్రయత్నం చేయకముందే మనమే అవతలవ్యక్తిని అంచనా వెయ్య డానికి ప్రయత్నించాలి. నువ్వు కాస్త 'ఆంటీ' పరిధిలో నుండి బయటకు వచ్చి ప్రపంచాన్ని చూడు. పదిమందిలో ఉన్నా నీ ఒంటరితనం, నీలో జీర్ణించుకుపోయిన బలహీనత నిన్ను కవచంలా అడ్డుకొని మందిలో కలవనివ్వకుండా చేస్తున్నాయ్. పుస్తకాలు చదువు. మనుష్యులతో కలవ డానికిష్టం లేనివాళ్ళు పుస్తకాలతో ప్రపంచం సృష్టించుకొంటారు. భగవంతుడు ఈ వనంలో ఒక పూవుగా మనల్ని సృష్టిం చాడు. ఆ పూవు వాడి రాలిపోయేలోగా పరిమళం వెదజల్లాలి. లావణ్యా! నీవు పరి మళం లేని గడ్డిపూవువి కాకూడదు. పరి మళం వెదజల్లే పారిజాతానివి కావాలి. అలా తయారుచేస్తాను నిన్ను. కొన్ని పుస్తకాల పేర్లు వ్రాస్తున్నాను. అవి లైబ్రరీ నుండి తెచ్చుకుని చదువు.

 

కొంతమంది మహాత్ముల జీవిత చరిత్రలు తిరగేస్తుంటే మనమెంత అనామకంగా ఉంటున్నామో, ఎంత చేతకాని జీవితాన్ని నిర్లక్ష్యంగా గడిపేస్తున్నామో అనిపిస్తుంది. లావణ్యా! నీవు సైన్స్ గ్రూప్ తీసుకొన్నావనుకొంటాను.ఆంటీ రెండు మూడు సార్లు అనడం విన్నాను. ఆమె అనుకొన్నారంటే దానికి ఎదురుండదన్న నమ్మకంతో అలా అనుకొంటున్నాను. మరి ఉండనా. ఈ ఉత్తరం నీలో కాస్త చలనం కలిగిస్తుంది అన్న ఆశతో వ్రాస్తూ యింతటితో విరమిస్తున్నాను. ఆంటీకి,అంకుల్ కి నమస్కారములు చెప్పు.

ప్రేమతో
మల్లిక"

"ప్రియమైన లావణ్యకు,

నేను వ్రాసిన ఉత్తరాలు నీలో ఏ మాత్రం చలనం కలిగిస్తున్నట్లు లేదు నీ జవాబులు చూస్తుంటే. 'ఇక్కడ క్షేమం. అక్కడ క్షేమం అంటూ వ్రాస్తావేమిటి? 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' అన్నట్లు ఉంది నీ ధోరణి. ఈసారన్నా కాలేజి విశేషాలతో వ్రాయి. పెద్ద జవాబు వ్రాస్తావని ఆశిస్తున్నాను. నేను వ్రాసిన బుక్స్ చదువుతున్నావా?

నీ మల్లిక "

మల్లిక దగ్గర నుండి వచ్చిన ఉత్తరాలు చదువుతున్న లావణ్య మనసు కల్లోలిత కాసారమే అయ్యింది. మెదడు పొరల కింద దాగిన ఆలోచనలు కొండచిలువలా కదిలాయి.

"మల్లికా! నీవు విజ్ఞాన ఖనివి. నీ స్నేహమే నా జీవితానికో పెద్ద వరం. నువ్వు పుస్తకాలని, మనుష్యులను చదవమంటావ్! పుస్తకాలు చదివిన తరువాత ఒక్కటీ గుర్తుండటం లేదు. మనుష్యుల్ని ఎలా చదవాలో తెలియడంలేదు. క్లాసు పాఠాలను అర్థం చేసుకోడానికే శ్రమ పడవలసి వస్తోంది. మల్లికా! నువ్వు పెద్ద డాక్టరువై ఈ నిర్లిప్త హృదయంలో ఏముందో పరిశోధించు. నీ చేతుల్లో చచ్చిపోయినా ఫర్వాలేదు. నేనేమిటో నాకు తెలియచెప్పు మల్లికా..."

"మల్లిక దగ్గరనుండా ఉత్తరం... ఏదీ ఇలాతే" అంటూ చేతిలోని ఉత్తరాలు తీసుకొంటున్న తల్లిని చూసి మెదడులో కదులుతున్న ఆలోచనలు తలలు వాల్చేసాయి. ఒక్కొక్క పొరే మూసుకుపోయింది. అంతా పొగమంచు కప్పినట్లైంది... ఆ వెనుక అంతా శూన్యమే. 'తల్లి... ఎదురుగా తను, ఆమె చేతిలో ఉత్తరం...' ఇదే వాస్తవం. భయంగా ఆమె మొహంలోకి చూస్తున్న లావణ్య, తల్లి కనుబొమలు ముడిపడడం చూసి బిగుసుకుపోయింది.

"ఆ పిల్ల నీకు బుద్ధులు చెప్పేదేమిటి? నిన్నేదో తాళ్ళతో బంధించేసినట్లు 'ఆంటీ పరిధినుండి బయటకురా!' అని రాస్తుందేమిటి? ఇక్కడ నూరిపోసినవన్నీ చాలవనా, అక్కడనుండి కూడా మొదలు పెట్టింది ఉపదేశాలు, ఉపన్యాసాలు. అసలు ఆ పిల్లకెందుకో నా మీద అంత కక్ష. ఎపుడూ నిన్ను నానుండి దూరం చెయ్యడానికే చూస్తుంది. ఈసారి ఇలాంటి ఉత్తరాలు రాస్తే ఊరుకోనని రాయి. అసలు మీకిదరికీ ఉత్తరాలు దేనికి? ఇంతోటి స్నేహితురాలు దొరక్కపోదు. లేనిపోని ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు. పోయి చదువుకో" అంటూ ఉత్తరాలు పట్టుకొని లోపలికి వెళ్ళిపోతున్న

తల్లిని చూసి నిశ్వసించింది లావణ్య.

*   *   *

ఆ రాత్రి భర్తకు ఆ ఉత్తరాలు చూపించి ఉక్రోషపడింది కస్తూరి. కాని, మూర్తినుండి ఆశించిన జవాబు రాలేదు. పైగా...

"నిజమే! పిల్లలకు చదివే అలవాటుని పెంచడం ఉత్తమ లక్షణం. చిన్నదయినా ఎంత చక్కగా చెప్పింది మల్లిక. జ్ఞానాన్ని పెంపొందించుకోవాలంటే పుస్తకాలకన్నా కావలసినవేముంటాయ్"

అని మర్నాడే మల్లిక సూచించినవాటిలో రెండు మూడు పుస్తకాలు కొనితెచ్చాడు.

"బేబీ! ఈ బుక్స్ చదువు. చదివి అర్థంకాని మాటలన్నీ ఒక దగ్గర రాయి. ఆ తరువాత నీకు వచ్చినట్లు నీకేం అర్థం అయ్యిందో పది వాక్యాలు వ్రాయి" అంటూ లావణ్య చేతిలో పెట్టాడు. ఆ పుస్తకాల వైపు చేదు తింటున్నట్లు మొహం



పెట్టి చూసింది లావణ్య. తండ్రి చెప్పినట్లు చదవడమైతే చదివిందిగాని ఒక్క ముక్క అర్థం కాలేదు.

తల్లి అన్న మాటలతో ఉత్తరం రాసింది మల్లికకు. దానికి జవాబు నిర్దాక్షిణ్యమైన మాటలతో రాసింది మల్లిక.

"లావణ్యా! నీవు నిజంగా పసిదానివే. నిన్ను పెంచే బాధ్యత నేను తీసుకొన్నాను. అది నా హక్కు. నిన్ను మనిషిగా చేసి సంఘంలో నిలబడగల వ్యక్తిత్వం నీలో పెంపొందింపచేస్తాను. ఆ హక్కును, మీ అమ్మకాదు కదా, ఎవరేమన్నా వదులుకోను. ఎంతసేపు కళ్ళు మూసుకొంటే! ఈ సంవత్సరము, మరో సంవత్సరము. తరువాత నేను అక్కడికే వచ్చేస్తానుగా! అంటీ పిచ్చిగాని ఆమె నుండి నిన్ను ఎవ్వరూ వేరు చెయ్యరు, చెయ్యలేరు. చేసే అవసరం కూడా ఎవరికీ లేదని మీ అమ్మకు చెప్పు. నీవు జవాబులు రాయకపోయినా, నేను రాస్తూనే ఉంటాను. చదువుతావుగా!"

ఆ ఉత్తరం లావణ్య గుండెల మీది పెద్ద బరువును తొలగించింది.

* * *

కొంతమంది అనుకొన్నవి సాధించడానికే పుట్టినట్లు అన్నీ సాధించుకుపోతూ ఉంటారు. మరికొంతమంది ఏ ఆశయాలు లేకపోయినా మరొకరి ఆశలకు, ఆశయాలకు పునాదులై తలవంచి అణగారిపోతారు. అదృష్టం ఒక్కొక్కర్ని ఒక్కొక్క రూపంలో వరిస్తుంది. కస్తూరి జీవితంలో పెద్ద వరం భానుమూర్తి తోడు. అతనితో ముడిపడిన మరో జీవితానికి తాను శాపం కావచ్చు. చీకటి వెలుగుల మిశ్రమమైన అతని జీవితంలో లావణ్య త్రిసంధ్యలాంటిది. ఫస్ట్‌క్లాసులో పాసయిన లావణ్యను ఎమ్.బి.బి.యస్. లో చేర్పించాలని ఎంట్రెన్స్‌కి తయారు చేయిస్తోంది కస్తూరి. ఫస్ట్‌క్లాసుకి సీటురాదు అన్న చింత లేకుండా కులం అడ్డుపడింది.

"సీటు వచ్చినా, అది చదవగలదా? మహా సముద్రంలాంటి ఆ మెడిసిన్ చదవడం అంటే మాటలా? దానికి ఇంట్రస్ట్ ఉందో లేదో ముందు కనుక్కో" అన్న భానుమూర్తి మాటకు కస్తూరి పట్టుదల అడ్డుపడింది. పైగా 'లావణ్యా! మెడిసిన్ ఎంట్రెన్స్ పరీక్ష వ్రాయడానికి వస్తున్నాను!' అంటూ మల్లిక రాసిన ఉత్తరం లావణ్యలో కొత్త ఉత్సాహం నింపింది.

"లావణ్యా! నువ్వేం మారలేదు సుమా?" వచ్చిన రోజు సాయంత్రం మల్లికను తనువెల్ల కనులు చేసుకుని చూస్తున్న లావణ్య ఆ మాటలు వినిపించుకోనే లేదు.

కొంచెం పొడుగు ఎదిగి, యౌవనపు పొంగుతో లావణ్యం ప్రోది చేసుకున్నట్లు ఉంది మల్లిక. వయసుతో పాటు ఎదుగుతున్న మేధ, మనసు, కళ్ళలో కాంతిని ఇనుమడింపచేస్తూ, నవోత్సాహంతో జీవనదిలా వురకలు వేస్తున్న మల్లిక మహాసౌందర్య రాశిలా కనుపించింది లావణ్య కళ్ళకి.

"నీకిష్టమేనా మెడిసిన్ చదవడం!" మల్లిక నెమ్మదిగా అడుగుతూంటే లావణ్య కళ్ళలో నీళ్లూరాయి.

"నాన్నగారు అడిగితే ఇంట్రస్టు లేదని చెప్పాను. కానీ... అమ్మ... 'జాయిన్ అయిపోతే ఇంట్రస్టు దానంతటదేవస్తుంది' అంది. మార్కులు రాకపోయినా కాస్టు అది... సీటొచ్చేలా చేస్తుందినాకు. నేను... డాక్టర్ని... అవుతాను"

పేలవంగా వెర్రిదానిలా అంటున్న లావణ్యను తదేకంగా చూస్తూ నిట్టూర్చింది మల్లిక.




లావణ్య, మల్లిక ఇద్దరూ టెస్ట్ వ్రాసారు. మల్లిక మార్కులతో సీటు తెచ్చుకొంటే, లావణ్య కులం అడ్డు పెట్టుకొని సీటుతెచ్చుకొంది. ఏదయితేనేం ఇద్దరికీ సీట్లు వచ్చాయి. ఫీజులు కట్టేసి కాలేజీలో చేరిపోయారు.

నెలన్నా తిరక్కుండానే తహశీల్‌దార్‌గా ప్రమోషన్ మీద భాను మూర్తికి శ్రీకాకుళం ట్రాన్స్ఫర్ అయింది. "లావణ్య ఎలా?" అన్నది పెద్దసమస్య అయిపోయింది. కస్తూరికి ఏదో పెద్ద చిక్కు వచ్చిపడినట్లయింది. ఎవర్నో ఒకర్ని వదులుకోవాలి. లావణ్యను హాస్టల్లో వుంచి, భర్తతో వెళ్ళడానికే నిశ్చయించుకొంది ఆఖరుకు. అతని మానాన్న అతన్ని వదిలి కూతుర్ని అంటి పెట్టుకొని వుండడానికి మనస్సు ఏమాత్రం ఒప్పలేదు. స్త్రీకి భర్తకంటే ప్రియతమమైన వస్తువు మరొకటి లేదు. పైగా ఒంటరి వాణ్ని చేస్తే తనకు దూరమైపోతాడన్న భయం.

చెప్పవలసినజాగ్రత్తలుచెప్పి, హాస్టల్‌లో జాయిన్‌చేసి మల్లికకు అప్పచెప్పి భారమైన మనసులతో బండెక్కారు ఇద్దరూ. కస్తూరి గతంలో ఎప్పుడూ కూతుర్ని విడిచి వుండలేదు. అదో భారం అయిందిప్పుడు.

స్టేషన్‌కు వచ్చిన లావణ్య చూపులు శూన్యంలో చిక్కుబడినట్లు నిలుచుండిపోయాయి.

మహారణ్యంలో ఒంటరిగా చిక్కుబడిన లేడిపిల్లలా మనసంతా మొద్దుబారిపోయింది.

మల్లిక ధైర్యం చెప్తూ ఓదార్పుగా, అనునయంగా అంటున్న మాటలు తలకెక్కడంలేదు.

"అమ్మ... దూరంగా వెళ్ళిపోతుంది, తనను ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోతోంది" ఈ భావం నర నరాన ప్రాకిపోయింది. ఇక కస్తూరి ఏడుపుకు అంతులేదు.

"వారం, వారం వస్తుంటాను. జాగ్రత్త. మల్లికా! దాని ఆరోగ్యం సరయింది కాదు. కాస్త జాగ్రత్తగా చూడమ్మా! నువ్వున్నావన్న ధైర్యంతోనే దాన్ని విడిచిపెడుతున్నాను" పాత విముఖతను విడిచిపెట్టి మల్లికకు అప్పచెప్తుంటే, మల్లిక గుండె పట్టినట్లయింది.

"మీకేం ఫర్వాలేదాంటీ! నేనుంటానుగా, జాగ్రత్తగ చూస్తాను!" అంది.

"మల్లికా! అమ్మ...అమ్మ..." అంటూ పరిసరాలను మరచి మల్లికను హత్తుకుపోయింది లావణ్య.

ఆ విధంగా విశాఖపట్నం మెడికల్ కాలేజిలోతిరిగి లావణ్య,మల్లిక స్నేహానికి కొత్త మలుపులు తిరిగాయి.

హాస్టల్ కొచ్చి కాస్త సర్దుకొని కూర్చున్నారో లేదో సీనియర్స్ వచ్చారు. వాళ్ళెందుకు వచ్చారో, అంతకు ముందు చూచాయగా విన్నదాన్ని బట్టి అర్థమయి




మౌనంగా నిలబడింది మల్లిక.

"అమ్మాయిలూ! మీరిద్దరూ జనరల్ హాల్లోకి కరెక్టుగా అయిదు నిమిషాల్లో రావాలి!" అని ఆర్డరువేసి వెళ్ళిపోతున్న వాళ్ళని పట్టనట్టుగా చూసింది లావణ్య.

అలా చూస్తున్న లావణ్యను చూడగానే మల్లిక మనసులో ఓ ఆలోచన మెరిసింది.

'లావణ్య ఇపుడేం చేస్తుందో చూడాలి. అపుడన్నా ఈ కళ్ళల్లో ఎలాంటి భావాలు కదలాడుతాయో చూడాలి. ఈ మట్టి ముద్దలో ఏమన్నా చైతన్యం కలుగు తుందేమో చూడాలి' అనుకుంటూ కొత్త వుత్సాహంతో లావణ్యను తీసు కొని బయలుదేరింది మల్లిక.

అప్పటికే అక్కడకు చేరుకున్న కొత్త అమ్మాయిల మొహాల్లో భయం స్పష్టంగా కనుపిస్తోంది. సీనియర్ అమ్మాయిలు మాత్రం కులాసాగా వున్నారు.

"ఊఁ పాపలూ! మీరు కాబోయే డాక్టర్లు!... డాక్టరంటే సినిమాల్లోలా భుజంమీద కోటు, చేతి మీద స్టెతస్కోపు పట్టుకొని పోజు కొట్టటం కాదు. ఖలేజా కావాలి! మీరు ఏనాటమీ ప్రాక్టికల్స్‌కి వెళ్తారు... అక్కడ ఏముంటాయ్?... చెప్పండి" అని ప్రశ్నించిందో సీనియర్.

నిశ్శబ్దంగా ఉన్న గదిలో భయం ప్రవేశించింది.

"చెప్పండి!" గర్జించినట్లంది మరొక సీనియర్.

"మీకు తెలీదు కదూ... మీరు చెప్పండే!" అంటూ తన మిత్రబృందం వెపు తిరిగి అందా అమ్మాయి మహారాణి పోజులో!

"శవాలు!" ముక్త కంఠంతో అరిచా రంతా!

కొత్తవాళ్ళ మొహాల్లోని రక్తం గుండెల్లోకి పారిపోయి తలుపు మూసు కొంది.

"వెరీ గుడ్! శవాలుంటాయి. అవి ఏం చేస్తాయో తెలుసా పాపలూ... మనం కోస్తుంటే... లేచి కూర్చుంటాయ్! కూర్చుని కోపం వస్తే గొంతు పిసుకు తాయి....రాత్రిళ్ళు రూమ్‌లోకొచ్చి మీద కెక్కి కూర్చుంటాయి... అవన్నీ తట్టు కోవాలంటే మేము పెట్టే పరీక్షలో పాస్ కావాలి. అవును కదే రోజా!!" అందు బాటులో ఉన్న అమ్మాయి వీపు చరిచి అంది స్పీచ్ యిస్తున్న అమ్మాయి.

"అంతే మరి!మనం కూడా ఆ పరీక్షలు పాసయితేనే కదా సీనియర్స్ అయ్యాము" వస్తున్న నవ్వు నాపుకొంటూ అంది రోజా!

ఐస్ గదిలో పెట్టి తాళం వేసినట్లు బిగదీసుకుపోయారు కొత్తమ్మాయిలంతా.

"సరే! అసలు రంగంలోకి వద్దాం! ముందు పేర్లు, వూర్లు,ఇన్‌కమ్ వివరాలతో సహా చెప్పండి!...వాణీ...వినవే!"అంటూ టేబిల్ దిగింది ఆ అమ్మాయి. ఒక్కొ క్కళ్ళు వణుకుతున్న గొంతులతో వివ రించారు.

"నీ పేరు?"

"లావణ్య!"

"లావణ్య! రాగిణీ ఈ జోక్ చూడు. ఈ సుందరి పేరు లావణ్యట!"కిసుక్కున నవ్వి ఇంత సేపు స్పీచ్ ఇచ్చిన అమ్మాయిని పిల్చి చెప్పింది వాణి!

"ఈజ్ ఇట్! చాలా కరెక్ట్‌గా పెట్టారు పేరు. మీ అమ్మా, నాన్నల పేరేమిటి చిట్టి తల్లీ!" వెక్కిరింతగా అంది రాగిణి!

మల్లిక తదేకంగా లావణ్యనే చూస్తోంది. చీమ కుట్టినట్టయినా లేనట్లు నిర్వికారంగా జవాబు చెప్తున్న లావణ్యను చూసి విస్తుపోయింది.

అందరి వంతు అయిపోయిన తరువాత చీటీల మీద ఏదో రాసి అందర్నీ తలో చీటీ తీసుకొమ్మన్నారు. ఎవరికి వచ్చిందాన్లో ఏముంటే అది వాళ్ళు చెయ్యాలి. మల్లికకు హాస్టలు చుట్టూ తిరిగి రావాలని వుంది. లావణ్యా దగ్గర్లోవున్న నీటికుండీలో మునిగి అందరూ చూస్తుండగా బట్టలు మార్చు కోవాలని వుంది. అది చూడగానే భయంతో వణికిపోయింది లావణ్య. ఎన్నడూ చన్నీటిలో చెయ్యికూడా పెట్టని లావణ్య అది చదివి బిగుసుకుపోయింది.

"ఊఁ త్వరగా కానివ్వాలి!" హడావిడి పెట్టేసారు సీనియర్లు. లావణ్యకు ఒక్కసారిగా ఏడుపు ముంచుకు వచ్చేసింది. వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చుండి పోయింది. మల్లిక జాలిగా చూసి తనపని చేసుకోవడానికి వెళ్ళిపోయింది. మల్లిక కూడా వెళ్ళిపోవడంతో ఊపిరాడక కొట్టుకొంటున్నట్లు ఉక్కిరి బిక్కిరి అయింది.

లావణ్యను ఇద్దరమ్మాయిలు చెయ్యి పట్టి లేవదీసి కుండీ దగ్గరకుతీసుకువెళ్ళారు. యమకింకరుల్లా చెరో పక్క నిలబడి వున్న ఆ యిద్దరమ్మాయిల్ని చూసేసరికి స్పర్శజ్ఞానం కోల్పోయినట్లు మొద్దుబారి పోయింది. ఎదురుగా ఎండలో మెరుస్తున్న నీళ్ళు తనను కబళించడానికి వచ్చే ఉప్పెనలా తోచి గట్టిగా కళ్ళు మూసుకొంది. అంతే...ఎలా అందులో దిగిందో, ఎలా బయటకువచ్చి బట్టలు మార్చుకొందో ఏమో తెలీలేదు.

ఆ సాయంత్రం పెద్ద పెట్టున జ్వరం వచ్చేసింది. మల్లిక దిగాలు పడిపోయి కూర్చుండి పోయింది. అంతలో సీనియర్ అమ్మాయిలు వచ్చి హాస్టల్ డాక్టరుని పిలిపించి చూపించారు. ఆయన ఇంజక్షన్ చేసి, టేబ్లెట్లు ఇచ్చి, మల్లికకు ధైర్యం చెప్పి వెళ్ళారు.

ఆ రాత్రంతా మేలుకునే వుంది మల్లిక. మర్నాడు వుదయం కళ్ళు తెరచిన లావణ్యకు నీట్ గా తయారయిన సీనియర్స్ ఇద్దరు టెంపరేచరు చూస్తూ, స్టెత్ తో పరీక్ష చేస్తూంటే ఏమిటోగా అనిపించి చుట్టూ చూసింది. మల్లిక పక్కనే వుంది. "కాబోయే డాక్టరమ్మ ముందుగానే పేషంట్ అయితే ఎలా ?" అంది ఇంజక్షన్‌కు సిద్ధంచేస్తున్న వాణి.

అప్రయత్నంగా తనూ నవ్వింది.

"గుడ్! అలా వుండాలి. మీ ఫ్రెండ్ హడలిపోయింది పాపం!" అంది ఇంజక్షన్ చేస్తూ వాణి.

లావణ్య అలా నవ్వడం చూసిన మల్లికకు ఆశ్చర్యంతో పాటు సంతోషం కలిగింది. మనసులో మెరుపు మెరిసింది.

లావణ్య లేచి తిరగడానికి మూడు రోజులు పట్టింది. ఈ మూడు రోజులు ఎవరో ఒకరు కొత్తవాళ్లు, పాతవాళ్లు, వార్డెన్, అందరూ చూడ్డానికి వచ్చి "ఎలా వుంది" అని పలకరించడమే ! అందరికీ చిరునవ్వుతో జవాబు చెపుతూ... ధైర్యాన్ని పుంజుకొంది లావణ్య. ఇపుడు వాళ్లంతా ఆత్మీయులుగా కనుపించసాగారు. తల్లి ఒక్కసారికూడా గుర్తురాలేదు.ఇకమల్లిక సంగతి చెప్పనే అక్కరలేదు.

క్లాసులకు హాజరవసాగాక మొదటి రెండుమూడురోజులు నోట్సులు, బుక్స్, టైమ్‌టేబుల్ అన్నీ సరిచూసుకోవడంతో సరిపోయింది. ఇన్నాళ్లు తను చదువు కొన్నది వేరు, ఇపుడు చదువుతున్నది వేరు అనిపించుతోంది. కాలేజీలో చదివినా తను తనుగానే మిగిలిపోయింది. కానీ..ఇక్కడ... ఇక్కడ ... అలా అనిపించడం లేదు.





తనూ వాళ్ళలో ఒక దిగా అనిపిస్తోంది. తనేమిటో, తన శరీరమేమిటో, అలంక రణ ఏమిటో, ఒకొక్కటి నెమ్మదిగా తెలు సుకోగలుగుతోంది. అబ్బాయిలు, అమ్మాయిలు, హడావుడిగా తిరుగుతున్న సర్కిలు, క్లాసులు, ప్రొఫెసర్స్, జోకులు, వాళ్ళకి పెట్టిన పేర్లు...అన్నీ అదో వింత ప్రపంచంలా అనిపిస్తోంది.

హస్టల్ కిపచ్చాక కలకలమంటూతిరిగే అమ్మాయిలు, బేచ్ లుగా కబుర్లు, సరసాలు సినిమాల దగ్గరనుండి, రాజకీయాలవరకూ చర్చలు, సీరియస్ గా చదువుకునేవాళ్ళు, అల్లరిచేసేవాళ్ళు, రకరకాలుగా అలంకరిం చుకొనేవాళ్ళు, ఏ అలంకరణలేకుండా అతి సామాన్యంగా వున్నవాళ్ళు, ఆ రకరకాల మనుష్యుల మధ్య నిలబడి, తనను తాను చూసుకొంటుంటే ఏదో వెలితిగా అనిపి స్తోంది.వాళ్ళందరిమధ్య కలిసిపోతే నిస్తేజ మైన తన మెదడుకు పదును పెడుతున్న ట్లుంది. అందరూకలిసి డైనింగ్ హాల్లో ఒకేసారి భోజనం చెయ్యడంలోని ఆనం దంలో ఏది తింటోందోకూడా తెలీకుండా సుష్టుగా భోంచేస్తోంది.

"అరే! గుమ్మడికాయ, ఆనపకాయ కూరలు, దప్పడం, ఏది తిన్నా ఏమీ అవడంలేదే" అనుకొంటూ ఆశ్చర్య పోయి మల్లికతో అనేసింది ఓసారి.

"అబ్బ యిప్పటికి, -అసలు మనిషిగా మారుతున్నావన్నమాట. ఇవన్నీ మనం మామూలుగా తింటున్నవే! మేమంతా మను షులంకామూ, తినడంలే; అదేం విషమా ఏమిటి? మన శరీర పోషణకు కావలసిన విటమిన్లు అన్నిరకాల కూరలలో, పళ్ళల్లో వుంటాయి. అన్నీ తిన్ననాడే మనశరీరం- -ఆరోగ్యంగా మెదడు మేధావంతంగా వుంటుంది. ఇప్పటికన్నా గుర్తించావు లావణ్యా. మీ నాన్నగార్కి ట్రాన్స్ఫర్ అవడం, ఈ సీటు రావడం నిజంగా నీ భవిష్యత్తుకో పెద్ద మలుపు. లేకపోతే ఎప్పటికీ 'బేబీ'గానే వుండిపోయేదానివి. చూడు... అందర్నీ చూడు... ఎలా వుంటున్నారో, ఏం చేస్తున్నారో చూడు. అపుడే జీవితం అంటే ఏమిటో... ఇంకా బాగా తెలుస్తుంది. రోజూ ఓ గంట జన రల్ హాల్లో గడిపితే జీవితం ఎంత విస్తా రమైందో తెలుస్తుంది లావణ్యా! ఇలాంటి మార్పునే నేను నీలో కోరుకున్నాను. నువ్వు ఇంకా మారాలి లావణ్యా" ఆవే శంగా అంటున్న మల్లికను, విస్తుపోతూ చూసింది లావణ్య.

మల్లిక వ్రాసే వుత్తరాలు, చిన్న ప్పుడు చెప్పే కబుర్లు, అన్నీ కళ్ళ ముందు కదిలి చలింప చేశాయి. ఆమె ప్రయత్నం ఇప్పటికి అర్థమైనదానిలా మనసు ఆర్ద్రత పొంది క్రమంగా కళ్ళల్లో వెలుగు ప్రసరించింది.

అది గమనించిన మల్లిక మనసు ఆనందడోలికల్లో వూగింది.

"మల్లికా!" అంటూ ఆపైన మాట్లాడలేనట్టు చెయ్యి పట్టుకొని నిలబడి పోయింది.

* * *

ఆ రోజే ఎనాటమీ ప్రాక్టికల్స్.

ఉదయం నుండి ఈ ప్రాక్టికల్స్ గురించే అందరికీ గుండె దడగా వుంది. రేగింగ్ రోజున వాళ్ళు చెప్పిన మాటలు గుర్తుకొచ్చి గుండెలు చిక్కబట్టుకొని క్లాసులో అడుగుపెట్టారు కొత్తవాళ్ళు. వారందరినీ గ్రూపులుగా డివైడ్ చేశారు. మల్లిక ఒక గ్రూపులోనూ, లావణ్య మరో గ్రూపులోనూ అయిపోయారు.

వేలగా చూసింది మల్లికవైపు.

అంతా థియేటర్‌కు వెళ్ళారు. అక్కడ అంతా సిద్ధం చేసివుంది. లోపలికి వెళ్ళ గానే ఘాటుగాతగిలిన ఫార్మలిన్ వాసనకి తల తిరిగి నట్లయింది ఒకొక్కళ్ళకి. చుట్టూ కలియచూసిన లావణ్య తూలి పడ బోయింది. పక్క అమ్మాయి గట్టిగా పట్టుకొంది.

గదిలో శవాలు...కాల్చిన బొగ్గులా నల్లగా మాగిపోయివున్న శవాలు... ఒకొక్క బల్ల మీద ఒకొక్కటి వరుసగా పది, పన్నెండు బల్లలు... ఒక్కసారిగా నరకంలో పడేస్తే వూపిరాడనట్లు అయి పోయారు అందరూ. అందరి మొహాల్లో భయం, జుగుప్స. జలదరిస్తున్న ఒళ్ళు రోమాంచితమై చిత్రంగా స్పందిస్తోంది. వీళ్ళిలా తెల్లమొహాలు వేసి చూస్తుండగానే లెక్చరర్ గ్రూప్సు చొప్పున పిలిచి ఎలా



డిసెక్ట్ చెయ్యాలో చెప్పడం మొదలు పెట్టాడు. వణుకుతున్న గుండెల్ని అదుపులో పెట్టి లావణ్య నిర్నిమేషంగా చూస్తోందా శవాన్ని. అలా దగ్గరగా నిలబడే సరికి ఏవేవో అనుభూతులు, వుత్తుంగతరంగాల్లా ఆలోచనలు. మొద్దుబారిన మెదడులో సంచలనం... 'నిన్నటి వరకు మనిషి... నేడు శవం... బొద్దెంకను, వాన పామును, ఎలుకను,



కప్పను కోసినట్లే మనిషి అవయవాల్నీ కోసేస్తున్నారు. ఏముంది భేదం? కప్పలో నెర్వస్ సిస్టమ్‌లాగే మనిషిలోనూ తేడాలెన్నో ఉన్నా ప్రాణం పోయాక అన్నీ సమానమే. దీనికోసం ఎందుకలా ప్రాకులాడుతారు ఈ మనుష్యులు? అమ్మ, నాన్న, తను, మల్లిక అందరూ ఏదో ఒకనాడు ఈ అవతారం ఎత్తవలసిందే. చావు ఎంత భయంకరమైనది? ఇన్నేళ్ళ జీవితంలో ఒకసారో, రెండుసార్లో స్కూలుకు వెళ్తుండగా రోడ్డుమీద దూరంనుండిచూసింది శవాల్ని. చావంటేనే తనకు తెలీదు. ఈ మాత్రానికి అమ్మ ఎందుకంత మమకారం తనమీద.. ఇన్నాళ్ళు నాకేం తెలియకుండా పెంచి నన్నెంత ధైర్య విహీనురాల్ని చేశావమ్మా...'

"మిస్ లావణ్యా! మీరు సరిగా అబ్జర్వ్ చెయ్యటం లేదు. శ్రద్ధగ చూస్తేగాని లాభం లేదు. ఇదిగో ఇవన్నీ ఆర్టరీస్... ఇవన్నీ వెయిన్స్... ఇదో కాపిల్లరీస్...ఈ బొమ్మలో చూసి, ఈబ్లడ్ వెసల్స్ ట్రేస్‌చెయ్యండి...మీ గ్రూప్!" అంటూ కొన్ని పేర్లు అండర్‌లైన్‌చేసి పుస్తకం ఇచ్చారు లెక్చరర్. అప్పటికే ఆ వాతావరణానికి అలవాటయిన కొంత మంది అబ్బాయిలు, అమ్మాయిలు ఎవరి గ్రూప్‌కిచ్చిన పని వారు ఉత్సాహంగా చెయ్యటానికి ముందుకు వచ్చారు. లావణ్య బేచ్‌లో నలుగురబ్బాయిలు, ముగ్గురమ్మాయిలు. భయం భయంగా చూస్తున్న అమ్మాయిల్ని ప్రోత్సహిస్తున్నట్లుగా నవ్వుతూ "చూస్తూ నిలబడితేకాదండీ... మొదలుపెట్టండి చేసాంగా కప్పలు, ఎలుకలు ... అలా అనుకోవడమే" ఒకబ్బాయి ధైర్యంగా అని ఫోర్సెప్స్‌లాంటి పరికరం చేతిలోకి తీసుకొన్నాడు.

లావణ్యకళ్ళముందుతెరవేసినట్లయింది మరేం కనిపించలేదు. వినిపించలేదు... ధైర్యంగా చెయ్యివేసింది. దూరంనుండి మల్లిక ఇటేచూస్తోంది. తలాడించింది... ఫరవాలేదన్నట్లు. లావణ్యకూడా తలాడించింది. చర్మం నెమ్మదిగ కట్‌చేసి తెరవగానే ఎర్రని ధమనులు, నీలిరంగు సిరలు. ఇంతకాలంగా చార్టుల్లో చూసిన బొమ్మలు గుర్తొచ్చాయి. అవి బొమ్మలు, ఇది నిజం. నిజంగా చూస్తోంది తను... ఆ వూహే ఉత్సాహాన్నిచ్చింది. మొత్తం మీద లెక్చరర్ ఇచ్చిన పాయింట్స్ ప్రకారం పార్ట్సన్నీ ట్రేస్ చేశారు.

లెక్చరర్ "వెరీ గుడ్"అన్నాక తేలిగ్గా ఊపిరి పీల్చుకొన్నారు. సంతోషం పొగ మంచులా కప్పేసి ఉక్కిరిబిక్కిరిచేసింది.

క్లాసుముగించుకొనిహాస్టల్‌కివచ్చేసరికి విజిటర్స్ రూమ్‌లో కస్తూరి,భానుమూర్తి. చేతిమీద కోటువేసుకొనివస్తున్న కూతుర్ని కొత్తగా చూస్తూండిపోయింది కస్తూరి... ఆ కళ్ళలో గర్వపు ఛాయలు మెరుస్తున్నాయ్.

"ఎప్పుడొచ్చారమ్మా!" మామూలుగా ఏ ఉద్విగ్నత లేకుండా పలుకరిస్తున్న కూతురి మాటలు... ఆర్తిగ చూస్తున్న చూపుల్ని వెనక్కి లాక్కువచ్చాయి.

"గంటవుతోంది!" కస్తూరి మాట్లాడక పోవడం చూసి తనే చెప్పాడు.

"నాకు టయిమవుతోందమ్మా! భోంచేసి మళ్ళీక్లాసులకువెళ్లాలి.రండిరూంలోకూర్చుందురుగాని!"అంటూ రూమ్‌వైపునడుస్తుంటే మంత్రముగ్ధుల్లా అనుసరించారు ఇద్దరూనూ. లావణ్యా భోంచేసాక పుస్తకాలు తీసుకొని బయలుదేరుతుంటే...

"నేనుఅలాబజార్లోకివెళ్లొస్తాను.ఏమ్మా

 

నీకేమన్నా కావాలా?" కూతుర్నే అడుగుతూ లేచాడు. కూతురి ప్రతిచర్యను నిశితంగా గమనిస్తూ ఆశ్చర్యంలో కొట్టుకుపోతున్న కస్తూరి పరధ్యానంగా "ఊ" కొట్టింది.

"నాకేం అక్కరలేదు నాన్నా!" అన్న సమాధానం విని లావణ్యతో పాటే బయటకు నడిచాడు.

"వస్తానమ్మా! కాసేపు పడుకొని రెస్టు తీసుకో. అంటూ తలుపు దగ్గరవేసి మిగతా అమ్మాయిలతో కలసి వెళ్ళిపోతున్న లావణ్యను చూస్తూ...

"బేబి ఎంతమారిపోయింది ఓ నెల రోజులు దూరమయ్యేసరికి... శాశ్వతంగా దూరమైపోయి నట్లే... అంతనిర్లక్ష్యంగా ఉదాసీనంగా... లావణ్యా... బేబి... నన్ను... నన్ను నిర్లక్ష్యంచేస్తేనేను భరించ లేనే... భరించలేను" తలగడమీద వాలి పోతూ అనుకొంది. కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీటిని ఆపదలుచుకోలేనట్లు అలాగే ఒరిగిపోయింది కస్తూరి.

* * *

"ఏమండీ బేబీ చాలా మారిపోయింది కదూ!" బస్సులోకూర్చుని బేలగా అంటున్న కస్తూరిని నిశితంగాచూసాడు భానుమూర్తి.

"అంటే..." అర్థంకానట్లు అడిగాడు.

"మీకేంతెలీదు పాపం! దానిలో అంత స్పష్టంగా మార్పు కనబడుతుంటే... పాపం ఏం తెలీనట్లు అంటున్నారు. ఈ కొద్దిరోజులకే పెద్దదయిపోయిందా? అంత స్వతంత్రం వచ్చేసిందా? అసలిదంతా ఆ మల్లికపనే. ఆ పిల్లకు మొదటినుండి అదే ధ్యాస.. దాన్ని నానుండి దూరం చెయ్యాలనే వుత్తరాలు అలా వ్రాసేది. అసలు దాన్ని హాస్టల్లో వుంచటం తప్పయింది!" బస్సు అని మరచిపోయి ఆవేశంగా అంటున్న కస్తూరిని ఇబ్బందిగా చూశాడు మూర్తి.

"ఇంటికి వెళ్ళాక మాట్లాడుకొందాంలే! అయినా ఎప్పుడూ చిన్నపిల్లలాగే వుండి పొమ్మంటే ఎలా? హాస్టల్లో వుంచడమే మంచిదయింది. కాస్త లోకజ్ఞానం వస్తోంది. లేకపోతే ఎంతసేపూ నువ్వూ, నేను, ఇల్లు. ఇదేనేమిటి ప్రపంచం? అయినా అది ప్పుడు డాక్టరు కాబోతోంది. అది ఒక మనిషిగా మారుతోంది, మారాలికూడా! దానికింత రాద్ధాంతం ఎందుకు?" నెమ్మది గానే అయినా కాస్త సీరియస్‌గానే అన్నాడు భానుమూర్తి.

"అయితే యిన్నాళ్ళు నేను దాన్ని మనిషిలా పెంచలేదంటారా? మీరెప్పుడూ నన్నర్థం చేసుకోరు. అది దూరమైపోతే నేను ఒంటరిదాన్నయిపోతాను. నా కెవ్వరూ లేరు!" అంటూ కొంగు అడ్డం పెట్టుకొంటే, అంతవరకూ ఆనకట్ట పడ్డ వరదలా ఆగిన కన్నీరు వుధృతం ఎక్కువయి ఆనకట్టను ఛేదించుకొని బయటకురి కింది. కొంతమంది ప్రయాణీకులు వెనక్కి తిరిగి చూడడం మొదలు పెట్టారు. అది చూసిన భానుమూర్తి మొహం చిన్నది చేసుకుని సీరియస్‌గా బైటకు చూడసాగాడు.

ఇంటికి వెళ్ళేవరకూ కళ్ళు తుడుచు కుంటూనే వుంది కస్తూరి. రాగానే ప్యూన్ చెప్పిన కబురు విని బట్టలన్నా మార్చుకోకుండా కలెక్టరుని కలుసుకోవ దానికి వెళ్ళిపోయాడు భానుమూర్తి.

భర్త ఓదారుస్తాడు, మనసులోని దుగ్ధంతా తీర్చుకోవచ్చని అనుకొన్న కస్తూరికి, అతను వెళ్ళిపోవడం నిర్ల క్ష్యంగా భావించుకొని... లోకంలో

తనొక్కతే ఏకాకిననుకొంటూ, లావణ్యం ప్రవర్తన తలంచుకొంటూ, పిచ్చిపట్టిన దాన్లా ఏడుస్తూ పడుకొంది.




కాలం సాగిపోతూనే వుంది. ఆ ప్రవాహంలో తమ ప్రమేయం లేకుండానే కొట్టుకుపోతున్నారు చాలామంది. మిట్ట పల్లాలాంటి ఆశలు, నిరాశలు, కోరికలు, కష్టాలు,కన్నీళ్ళు, ఆనందాలు, విషాదాలు అన్నీ దాటుకుంటూ సాగిపోతున్నారు మనుషులు. లావణ్య, మల్లిక మూడవ సంవత్సరంలోకి వచ్చారు. భానుమూర్తికి మరలా విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ అయింది. కస్తూరి తన ప్రార్థనలు ఫలించినట్లు పొంగిపోయింది.

"నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అయిపోయింది బేబి!ఇంక నిన్ను దూరంగా వుంచి నీ వుత్తరం కోసం, నీకోసం కళ్లు కాయలు కాచేలా ఎదురు చూసే యాతన తప్పింది. బేబీ! నువ్వు ఎంత పెద్దదానివైనా నాకు బేబివే. నా ప్రాణానికి ఈ వార్త ఎంత స్థిరత్వాన్నిచ్చిందో అమ్మకు దూరమై మారిపోయిన నీకు అర్థంకాదు" అంటూ నిష్ఠూరం ధ్వనించేలా కస్తూరి వ్రాసిన వుత్తరం లావణ్య గుండెల్లో బండలా పడింది.

"మల్లికా! నాన్నగార్కి ట్రాన్స్‌ఫర్ అయిందట. ఇంక నన్ను హాస్టల్లో వుండనివ్వరు. మళ్ళీ అమ్మ...ఇల్లు. తలంచుకొంటేనే భయంగా వుంది" అంది లావణ్య,

"భయం ఎందుకు? నీకేం నీవు ధైర్యంగానే నిలబడగలవులే. అయినా మీ అమ్మ అన్నట్లు నువ్వు మారిపోయావుగా" నవ్వుతూ అంది మల్లిక.

లావణ్యలో మార్పు మనసులోనే కాదు మనిషిలోనూ కనుపిస్తోంది. కొంచెం పొడుగు ఎదిగి, కొంచెం ఒళ్లు చేసి ఓ ఆకారం ఏర్పడినట్లయింది. ఈ మూడేళ్ళ చదువూ, స్నేహితులూ, వాతావరణం లావణ్యలో పెద్ద మార్పే తెచ్చాయి. చూపుల్లో ఓ స్థిరత్వం, నడకలో గాంభీర్యం, మాటల్లో సంస్కారం, కట్టూ బొట్టూ అన్నీ కలిసి ఓ రూపం ఏర్పడింది. ఇపుడు కొత్తవాళ్లు ఎవరన్నా ఆమె పేరు 'లావణ్య' అని విన్నప్పుడు నవ్వుకోడం లేదు.

నెల రోజుల్లో భానుమూర్తి విశాఖలో ఇల్లు చూసుకొని సెటిల్ అవడం, లావణ్య హాస్టల్ నుండి ఇంటికి రావడం జరిగిపోయింది. ఆరోజు మొదటిసారిగా హాస్టలుకు వచ్చిన రోజున ఎలా అనిపించిందో ఈ రోజు ఇంటికి వెళ్తుంటే అలాగే అనిపించింది.

"ఛ ఛ..ఎందుకు కన్నీళ్ళు? క్లాసులో రోజూ కలుస్తాం.ఆ పైన నువ్వొక్కదానివీ, నేను మీ ఇంటికి రాకుండా ఉంటామా! లావణ్యా! ఇంటికి వెళ్ళినా నిన్ను నీవు మరచిపోవనే అనుకొంటున్నాను" తనూ కళ్ళు తుడుచుకొంటూ అంది మల్లిక. అయినా పంజరంలోనుండి తప్పించుకొన్న చిలుక మూడేళ్ళపాటు స్వేచ్ఛగా ఎగిరాక మళ్ళీ వేటగాడి వలలో చిక్కుకొన్నట్లుగా ఫీలయి గిలగిలలాడి




పోయింది లావణ్య.

తల్లి మాటలు గుర్తుకు వస్తున్నాయి. "నువ్వు మారిపోయావు. నా మాటే లక్ష్యం లేకుండాపోయింది నీకు."

"ఇలా ఎప్పుడన్నా విసుక్కున్నావా? నీకు నేను పరాయిదాన్నయిపోయానా...?" అంటూ నిష్ఠూరంగా మాట్లాడే తల్లి అంటే ఓ రకమైన విసుగు కలుగుతోంది. కాని, అది పైకి అనలేక, రాబోయే పరిణామం ఊహించలేక నలిగిపోతోంది లావణ్య. అయితే మొదటి నుండి సర్దుకుపోవడానికి అలవాటయిన లావణ్యకు ఇప్పుడు మళ్ళీ సర్దుకుపోవడం ఏమంత కష్టమనిపించటంలేదు.

* * *

"అమ్మా, అమ్మగారూ!" అన్న పిలుపుకి అపుడే మేను వాల్చిన కస్తూరి లేచి తలుపు తీసింది. ఎదురుగా ఆఫీసు ప్యూన్.

"అయ్యగారు లేరే, కాంపుకి వెళ్లారు" అంది 'నీకు తెలీదా!' అన్నట్లు చూస్తూ.

"అవునమ్మా తెలుసు. కానీ ఇదిగో ఎవరో బాబు వచ్చి ఈ చీటీ అర్జంటుగా ఇంటికాడ ఇచ్చిరమ్మన్నారండి!" అంటూ చీటీ ఇచ్చాడు.

"నాన్నగార్కి,

ఇపుడే ఇంటిదగ్గరనుండి కబురు వచ్చింది. తాతగారు తెల్లవారుఝామున పోయారట. ఆఫీసులో మీరు లేరు. ఈ కబురు మీకు అందజేయడమైనది.

"శ్రీను"

అస్తవ్యస్తంగా ఉన్న ఆ ఉత్తరం చదివి ఒక్క క్షణం నిశ్చేష్టితయైపోయింది. ఏం చెయ్యాలో తోచలేదు. కాస్సేపటికి స్థిమితపడి, భర్త రాకకోసం ఎదురు చూస్తూ కూర్చుంది. అలా కూర్చొని ఆలోచిస్తుంటే అన్నపూర్ణ మీద కోపం ముంచుకురాసాగింది.

"ఇక్కడ చదువుతున్నాడుగా ఆ రెండో వాడు ఆ అబ్బాయి చెప్పేఉంటాడు కబుర్ను. ఏం, ఆ కుర్రాడికి కబురు పెట్టడమేమిటి? ఆ కబురు ఏదో ఈయనకే పెట్టొచ్చుగా, అంత నిర్లక్ష్యం ఏమిటో! ఏదో చెప్పాలి కనుక చెప్పినట్లుంది. పెత్తనం ఆవిడదే కదూ. అందులోనూ పెద్దకొడుకు ప్లీడరయిపోయాడయ్యే!" ఉక్రోషంగా అనుకొంది.

ఆ రాత్రి పొద్దుపోయి వచ్చిన భాను మూర్తికి ముందు భోజనం పెట్టి మరీ చెప్పింది కబురు. వినడమే తడవుగా, బట్టలు వేసుకొని తహశీల్దారు గారి దగ్గరకు వెళ్ళాడు జీపుకోసం. అది లేకుండా ఈ రాత్రి ఆ ఊరు చేరే మార్గమేలేదు. డ్రైవర్ని బ్రతిమాలి బయలుదేరదీసేసరికి అర్ధరాత్రి అయ్యింది. తనను రమ్మంటాడేమోనని ఎదురు చూస్తున్న కస్తూరివైపు నిశితంగా చూసి అంతలోనే ఏదో ఆలోచన వచ్చినవాడిలా తల విదిలించి ఒంటరిగానే బయలుదేరాడు. భారమైన అతని మనసులో తండ్రి రూపం మెదిలింది. ఆయన వాత్సల్యం, తనకోసం పడ్డ శ్రమ ... అంతా జ్ఞప్తికి వచ్చి గుండెను బరువెక్కిస్తున్నాయ్. చిన్నాన్నలు, పెదనాన్నలు, అత్తలు, వాళ్ళ పిల్లలు అంతా పొలం పనులు చేసుకొంటుంటే, తల్లిలేని తనను, ఎవరేమన్నా వినకుండా చదివించారు. పైకి తెచ్చారు. తన జీవిత గమ్యాన్ని మార్చివేశారు. ఎన్ని సంబంధాలు వచ్చినా చదువుకున్న పిల్లకోసం వెతికి, అన్నపూర్ణను చేసి, జీవితంలో స్థిరపరచారు. తమ చుట్టాల్లో ఎవరికీ లేని హోదాని, స్థితిని తనకు కల్పించారు.

కాని తనేం చేశాడు? కస్తూరి వ్యామోహంలో పడి ఆయన మనసు గాయప రిచాడు. జన్మలో తన మొహం చూడ కుండా చేసుకొన్నాడు. తనకి శిక్ష పడ వలసిందే. ఆయన అన్నపూర్ణకే విలువ నిచ్చి గౌరవించారు. తన పిల్లలకోసం ఎంతో చేశారు. ఈ వయసులో ఆయన తన కుటుంబపు బరువు, బాధ్యతలు మోస్తే, తానేమో ఏమీ పట్టనట్లు తన స్వార్థం తను చూసుకొన్నాడు. "నాన్నా, ఆవరిసారన్నా నన్ను చూడాలని మీకు అనిపించలేదా? నేనెంత దురదృష్టవంతు డిని నాన్నా..." అనుకుంటూనే అతనిలో దుఃఖం ఉప్పెనలా పొంగింది. గట్టిగా ఏడ్చే స్తున్న అతన్ని డ్రైవరు ఓదార్చాడు. అంతలో టాక్సీ చేరుకొన్నారు. అప్పటికే ఇంటినిండా ఉన్న చుట్టాలు చెవులు కొరుక్కోవడం మొదలు పెట్టారు జీపు ఆగగానే. కస్తూరిని తీసుకురాలేదన్న వాస్తవం అన్నపూర్ణకి, పిల్లలకి హాయినిస్తే, చుట్టాలకి, ఊళ్ళో వాళ్ళకి నిరాశను కలుగ చేసింది.

కార్యక్రమం జరిపించబోతున్న భాను మూర్తిని పక్కకు పిలిచి "మామయ్య గారు. కడుణతో కొరివి పెట్టించమని చెప్పారు!" అన్న మాట చెప్పలేక చెప్పింది అన్నపూర్ణ. భానుమూర్తి హతాశుడయి పోయాడు. నవనాడులూ కృంగిపోయాయి.

"ఇన్ని సంవత్సరాల తరువాతనయినా నన్ను ఈ విధంగా శిక్షించారన్నమాట, సరేః కానియ్. ఈ అవమానం చాలు పూర్ణా, చాలు..." అంటూ సజలనయనాలతో గదిలోకి వెళ్ళి తలుపు మూసుకొన్న భర్తను నిస్సహాయంగా చూస్తూ ఉండి పోయింది అన్నపూర్ణ.

కాసీ చనిపోతూ మామగారన్న మాటనూ, ఆయన కిచ్చిన మాటనూ ఎలా తోసిపుచ్చగలదు?

మూడోరోజు అక్కడి నుంచి బయలు దేరిపోయాడు భానుమూర్తి.

పది లంఖణాలు చేసినట్లు, ఒక్కసారే వయసు పైబడి కృంగిపోయినట్లు, ఎర్ర బడ్డ కళ్ళతో పిచ్చివాడిలా ఇంట్లో అడుగు పెట్టిన భానుమూర్తిని చూసి బావురు మంది కస్తూరి.

* * *

పరీక్షలు దగ్గరపడుతున్నాయి. శ్రద్ధగా చదువుతోంది లావణ్య. ఎంత శ్రద్ధగా రాత్రింబవళ్ళు చదివినా కొంతవరకే జ్ఞాపకం ఉండడం అనేది మాత్రం లావణ్యకి బాధగానే ఉంది.

"లావణ్యా ఏం చేస్తున్నావ్? చదు వేనా?" అంటూ లోపలికి వచ్చింది మల్లిక.

"నీకేమమ్మా.. పరీక్షలకు ఓ గంట ముందు పుస్తకం తిరగేస్తే చాలు. నా లాంటిదానికి వీటితో కుస్తీ పట్టకపోతే ఎలా?" అంటూనే పుస్తకం మూసేసింది లావణ్య.

"అబ్బ! మూగపిల్లకు మాటలు వచ్చాయే. సరేగాని ఆంటీ ఏరీ, కన బడలేదు!"

"నాన్నగారితో సినిమాకు వెళ్ళింది. ఏమిటి సంగతులు. నిన్న కేస్ ప్రజెంట్ చేశావా? డయాగ్నొసిస్ కరెక్ట్ అయ్యిందా? ఏమన్నారు?" అడిగింది లావణ్య.

ఆ మాట అడగ్గానే, ఆ సంఘటన తలపుకొచ్చి సిగ్గుతెర జారింది.

"ఊ" అంటూ తమాషాగా తలవంచు కొంది. అది కొత్తగా అనిపించింది




లావణ్యకు.

"అదేమిటి అలా ఉన్నావు, సిగ్గే! ఏమిటి సంగతి?" కుతూహలంగా అడిగింది లావణ్య.

అంత సన్నిహితంగా ఉండే లావణ్యకు చెప్పకుండా ఎలా ఉండగలదు మల్లిక. మధుకర్ గురించి చెప్పేసింది.

ఒక్క క్షణం ఈర్ష్యగా అనిపించినా అంతలోనే ఆశ్చర్యపోయింది లావణ్య. కాస్సేపు కబుర్లు చెప్పి వెళ్ళిపోయింది మల్లిక. లావణ్య మనసంతా ఏదోలా అయిపోయింది.

యవ్వనం అనేది మానవులకు తియ్యని వరం. ఆ వరంతో అనుభూతులు పొంది, వాటిని పదిలంగా గుండెల్లో దాచుకొని చరమ దశలో ఆ తలపులతో ఉత్సాహాన్ని పొందాలనుకొంటారు మనుషులు. ఎటువంటివాళ్ళకైనా ఏదో ఒక అనుభవమో, అనుభూతో మిగులుతుంది లావణ్య లాంటి దురదృష్టవంతులకు తప్ప.

ఆమె క్లాస్‌మేట్స్ చనువుగానే ఉంటారు. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా జరగదు. గనుక సన్నిహితంగా, సరదాగానే ఉంటారు. కానీ ఎవరి చూపుల్లోనూ తనపట్ల ఆరాధన మాత్రం కనబడదు. క్లాసుమేట్‌తో ఏదో అవసరం కొద్దీ మాట్లాడినట్లు మాత్రమే మాట్లాడతారు. తనతో మాట్లాడ్డానికి ఏ మాత్రం ఉత్సాహం చూపని వాళ్ళని గురించి తనేం ఊహలు పెంచుకోగలదు? హరిప్రసాద్ మాత్రం తనతో క్లోజ్‌గా ఉంటాడు. కాని అతన్ని చూస్తేనే తనకు ఎలర్జీ. అతని వికారం కప్పిపుచ్చుకొందుకే తనతో పరిచయం కోసం తహతహలాడినట్లు అనిపిస్తుంది. తనకు పెద్ద అందం లేకపోవచ్చు. కానీ... తనకూ ఓ మనసుంది. దానికి ఇష్టాఇష్టాలున్నాయి... "నీకో మనసూ, దానికో ఇష్టమూనా?" అని ఎవరో ఎగతాళిగా నవ్వినట్లనిపించింది. ఉలిక్కిపడింది లావణ్య.

"మీ అమ్మ ఇష్టంలేకుండా, నువ్వు పెళ్ళి చేసుకోగలవా?" ఛాలెంజ్ చేస్తున్నట్లుగా ఉన్నాయా మాటలు.

"అమ్మకి ఎందుకిష్టం ఉండదు, నాకు నచ్చినవాడు, నన్ను మెచ్చితే అమ్మ... ప్రేమకోసం అన్నీ వదులుకున్న అమ్మ కాదంటుందా?" అని మనసు సరిపెట్టుకుంది.

ఒక్క క్షణం శేఖర్ కళ్ళముందు కదిలాడు.

"శేఖర్...ఎంత తెలివైనవాడు. ఎంత చక్కగా ఉంటాడు. ముఖ్యంగా స్పోర్ట్స్ మన్. కాని అతని దృష్టిలో తనొక్కనాడు పడలేదు. అతన్ని గురించి తనేం ఊహించుకోగలదు. తన మీద ఏ ఉద్దేశ్యం లేనివాడిని తన ఊహల్లోకి రానివ్వడం ఎందుకు? కానీ మనసు తన మాట వినదే! అతన్ని తలచుకొంటేనే చాలు ఏదోగా అయిపోతుంది. ఒక్కసారి అతనికి తన మనసువిప్పి చెప్పగలిగితే? అతని మాటలు వింటూ, అతని చిలిపి చూపులు గిలిగింతలు పెడుతుంటే, ఎవరి మటుకు వాళ్ళే అతను 'తనవాడే' అన్నట్లు ఫీలవుతారు. ధైర్యం ఉన్నవాళ్ళు హాయిగా షికార్లు కూడా కొడతారు. కాని ఇంతవరకూ అతని మనసులో ఎవరికి స్థానం ఉందో తెలీదు. తన పిచ్చిగాని అందరుండగా తనలాంటి దాన్ని ప్రేమిస్తాడా?" నిరాశ ఉవ్వెత్తున లేస్తున్న కోర్కెల నణచివేస్తుంటే మనిషిలోని 'బలహీనత' మాత్రం ఆశగా

"ఏమో అటువంటివాళ్ళు ప్రత్యేకంగా ఉంటారుగదా! ఆలోచనల్లో కూడా అలాగే ఉండి అతనికి తనెందుకు నచ్చకూడదు" అనుకొంటూ ఊరడించింది.

పుస్తకం పట్టుకుని అలాగే, ఆలోచనలతో సతమతమైపోతున్న లావణ్య టైము గమనించలేదు. తల్లీ, తండ్రీ తిరిగి వచ్చారు. వస్తూనే ముసుగు పెట్టుకొని పడుకొంది కస్తూరి.

"చూడమ్మా! అమ్మకి బాగా తలనొప్పిగా ఉందట. కాస్త టేబ్‌లెట్ ఏదన్నా ఇచ్చి కాఫీయివ్వు" అన్న తండ్రి మాటలకు హడావిడిగా దగ్గరకు వెళ్ళి ఒంటిమీద చెయ్యివేసి చూసింది. కొంచెం వెచ్చగా అనిపించింది. లావణ్యకు భయం వేసింది ఆ మాత్రానికే.

లావణ్యకు ఊహ తెలిసిన దగ్గరనుండి కస్తూరి ఎప్పుడూ అట్లా ముసుగు పెట్టి పడుకోలేదు. కాఫీ కాచి టేబ్‌లెట్ వేసి కాఫీ త్రాగించింది. అర్ధరాత్రయ్యేసరికి జ్వరం తీవ్రత ఎక్కువై గొడవ మొదలు పెట్టింది. తండ్రీకూతుళ్ళిద్దరూ కాపలా కూర్చున్నారు తెల్లవార్లూ. మర్నాడు డాక్టరు వచ్చి మలేరియా అని తేల్చేసరికి కస్తూరి బెంగపడిపోయి ఆ ఇద్దర్నీ కంగారు పెట్టేసింది. ఆహంగామా చూసి..

"అబ్బ...అమ్మకు ఇన్నాళ్ళూ ఏమీ రాకపోవడం ఎంత అదృష్టం. ఎంత అల్లరి చేస్తోంది, ఏం మనిషి?" విసుగ్గా అనుకొంది రెండో రోజుకే నీరసం వచ్చేసిన



లావణ్య. తనకి కాలేజీలేదు, చదువూలేదు, తండ్రికి ఆఫీసూలేదు. ఇద్దరికీ సరిగ్గా తిండి, నిద్ర కూడా లేవు.

ఆసాయంత్రం ప్యూన్ వచ్చి మర్నాడు కలెక్టరు మీటింగు ఉందని చెప్పడం విన్న కస్తూరి రాత్రంతా సాధి స్తూనే ఉంది.

"అబ్బబ్బ కస్తూరీ! లోకంలో నీకొక్క దానికే జ్వరం వచ్చినట్లూ, యిదేదో తగ్గని జబ్బు అయినట్లూ ఎందుకింత హంగామా? బేబి ఉందిగా! నీకేం కావల సినా చూస్తుంది. నేను అర్జంటుగా వెళ్ళాలి!" అంటూ బట్టలు వేసుకొని విసుగ్గా వెళ్ళిపోతున్న భర్తను చూసి...

"అంతే నా బ్రతుకే అంత! నేనెవర్నని నాకోసం పనులు మానేసి ఉండిపోతారు. అగ్నిసాక్షిగా చేసుకొన్న పెళ్ళాన్ని గను కనా!" అంటూ ఏడుస్తూంటే "ఎందు కమ్మా! అలా నిన్ను నువ్వు కించపరచు కొంటావ్? యిపుడేమయిందని? నేనున్నా నుగా. నాన్నగారుఎన్నాళ్ళు ఆఫీసుమానేసి ఉండిపోతారు!" విసుగ్గా అనేసింది లావణ్య.

"అనవే అను. పెద్దదానివయ్యావుగా అను! నీకేం తెలుసుంది నా బాధ. నేనె వ్వరికీ అక్కరలేదు" ఏడుపుని ఉధృతం చేసింది కస్తూరి.

"నోరు మూసుకుని ఉండకుండా ఎందుకా మాట అన్నానా!" అని లావణ్య కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యేలా సాధించి సాధించి గానీ వదిలిపెట్టలేదు కస్తూరి.

దీనికితోడు పరీక్షలు దగ్గరవుతున్నాయి. ఆ బెంగ ఒకటి స్థిమితంగా ఉండనివ్వడం లేదు. తల్లికి కాదు తనకే జ్వరం వచ్చి నంత నీరసపడిపోయింది లావణ్య.

పదో రోజునగానీ కాలేజీలో అడుగు పెట్టలేకపోయింది.

ఎలాగోలా పరీక్షలు సందడిగా వచ్చి వెళ్ళిపోయాయి. కలవల్లో మధుకర్‌కి దగ్గరవడం కోసం ఒక్కొక్క అడుగే వేస్తూవెళుతున్న మల్లికను విస్ఫారిత నేత్రా లతో చూస్తూనే ఉంది లావణ్య. హరి ప్రసాద్ లావణ్యను అడిగి తిరస్కరింప బడటం కూడా జరిగిపోయింది. శేఖర్ హృదయాన్ని పదిలపరచుకొన్న 'విదుల'ను గూర్చి తెలియటంతో లావణ్య మొదటి సారిగా మనస్ఫూర్తిగా ఏడ్చింది. తన తెలివితక్కువతనానికి తగిన బహుమతే వచ్చిందనుకొని నిర్లిప్తంగా ఊరుకొంది.

మల్లిక ఫస్టుక్లాసులో పాసయ్యింది. లావణ్య ఎలాగోలా పాసయ్యాననిపించు కొంది. మధుకర్‌కి కాలేజి ఫస్ట్ వచ్చిం దన్న ఆనందం అంతా మల్లిక కళ్లల్లోనే కాపురముంది.




కరుణ లాయర్‌గా స్థిరపడ్డాక ఓ సంబంధం వచ్చింది. అతను మగపిల్లాడు కనుకా, జీవితంలో స్థిరపడి పైకి వచ్చే అవకాశాలున్నవాడు కనుకా తండ్రి చేసిన తప్పు అతని బతుకు బాటలో అడ్డు రాలేదు. తల్లి కోరిక మీద భానుమూర్తికి తండ్రి హోదానిచ్చి గౌరవించాడు. పెళ్ళిలోచుట్టాలు,తెలిసినవాళ్ళు అనుకొన్న

మాటలు ఈ చెవితో విని, ఆ చెవితో వదిలి వేసేటంత బండబారి పోయాయి అతని గుండెలు. యాంత్రికంగా అన్నీ నిర్వ రిస్తూండి పోయాడు. అన్నపూర్ణకిపుడు భర్తను గురించి ఆలోచించేంత తీరికలేదు. చుట్టాలతో పాటే అతనికి మర్యాదలు చేసింది. అంతే!

"పెళ్లికి ఆవిడను తీసుకు వస్తారేమో! అదేం కుదరదు" అని శుభలేఖలు పట్టుకు వచ్చినపుడే తండ్రితో చెప్పేశాడు కొడుకు. దానితోనే మూర్తిలో ఓ మూల ఉన్న ఆలోచన, ఉబలాటం తీరిపోయింది.

ఈ శుభ కార్యానికి కనీసం ఓ ఆగంతకురాలిగానన్నా రావాలని ఉత్సాహ పడింది కస్తూరి. కానీ కొడుకు ఈ మాటన్నాక ఏ మొహం పెట్టుకుని తీసుకు వస్తాడు? తను తొందరపడి కస్తూరిని ఆహ్వానించకపోవడమే మంచిదయింది. ఆమె మనసులో పిలుస్తారన్న ఆశ, తన మనసులో పిలవాలన్న కోరిక పరిస్థితుల వల్ల ఆరిపోయాయి.

* * *

తండ్రి వెళ్ళాక తల్లి పడుతున్న బాధ చూసి లావణ్య మనసు తల్లిపట్ల జాలితో నిండిపోయింది. అంతవరకూ చూచాయగా తెలిసినా, ఆ విషయాల గురించి లోతుగా ఎపుడూ ఆలోచించలేదు. దీనితో సంఘంలో తల్లి స్థానం ఏమిటో తెలిసివచ్చినట్లయింది. చిన్నతనంలో ఆమె పడిన తొందరపాటు వల్ల యిపుడు ఎదుర్కొంటున్న సమస్యలతో పాటు తన జీవితం కూడా ఓ సమస్యలా కనుపించ సాగింది.

మూర్తి తిరిగి వచ్చేంత వరకూ, తల్లీ కూతుళ్ళు బిక్కు బిక్కుమంటూనే ఉన్నారు. ఇంతకు ముందు అతనెన్నిసార్లు వెళ్లినా, ఏమీ అనిపించేది కాదు. కాని యిపుడు అతను కొడుక్కి పెళ్లి చేయాలని వెళ్ళాడు. మరి కూతురు? లావణ్యకు పెళ్ళవుతుందా? ఆ శుభకార్యం కూడా చెయ్యగలడా? మంచి సంబంధం కుదురు తుందో లేదో? అన్నీ అనుమానాలే కస్తూరికి.

అయితే భానుమూర్తి పెళ్లి విశేషా లతో పాటు, లావణ్య కోసం ఓ సంబంధం కూడా తీసుకొచ్చాడు. కాని, వివరాలు విన్న కస్తూరి యిష్టపడలేదు.

"కస్తూరీ! మన తాహతు, మన అర్హత చూసుకొని మరీ మనం మాట్లాడాలి!" చిరాగ్గా అన్నాడు కస్తూరి వాదన విన్న మూర్తి.

"ఏమిటండీ అర్హత? ఏం మనకు అంతస్తు లేదా? అర్హత...అంటే ఏమిటి, అది డాక్టరు. అదే దానికి పెద్ద అర్హత ఇంకేం చెప్పకండి. ఆ మారుమూల ఊళ్ళో పొలాలు చూసుకొనే వాళ్ళ మధ్య పడిఉండే ఖర్మ పట్టలేదు దానికి. అయినా మీ జాతిలో అంతకన్నా పైకి వచ్చే వాళ్లు ఎక్కడుంటారు?"

ఈసడింపుగా అంటున్న కస్తూరి అహం భానుమూర్తిలో ఎక్కడ దెబ్బ కొట్టాలో అక్కడే కొట్టింది.

"కస్తూరీ ... నువ్వేం మాట్లాడు తున్నావో నీకు తెలుస్తోందా? నీ కూతురు. నా జాతి వల్లనే డాక్టరు అవబోతోంది. యిన్నాళ్ళకు నీదో జాతి, నాదో జాతి అని గుర్తుకు వచ్చిందా?" ఏహ్యంగా అంటున్న భర్తను చూసి గతుక్కుమని తన తప్పు తెలుసుకొంది కస్తూరి. కాని 'తను చేసింది తప్పు' అని ఒప్పుకొనే బుద్ధి చిన్నప్పటినుండి లేదు కస్తూరిలో...

అందుకే జవాబు చెప్పలేదు.

*    *    *

విషాదం ఎదురుకాగానే తోకముడిచి పారిపోయే ఆనందాన్ని పగ్గంవేసి పట్టాలంటే ఎంత మానసికారోగ్యం కావాలో మల్లిక అనుభవపూర్వకంగాతెలుసుకొంది. మధుకర్‌ని ఫైనల్‌ఇయర్‌లోనే ఉంచేసిన వార్త తెలిసి కాలేజీలో చెలరేగిన అసంతృప్తి విచక్షణను పోగొట్టింది విద్యార్థుల్లో.

"ఎందుకు పోయింది? ఎలాపోయింది? ఎపుడూ కాలేజి ఫస్ట్ వచ్చేవాడికి, గోల్డ్ మెడల్ వస్తుందనుకొన్నవాడికి ఇలా పరీక్ష పోవడం ఏమిటి?" అన్న ప్రశ్న అందరిలోనూ అసహనంగా చెలరేగింది.

మల్లిక సరేసరి! మనసే మూగబోయింది.

"ఈ సంవత్సరంతో అయిపోతుంది, హౌస్ సర్జన్సీ కాగానే యిద్దరం ఒకటి కావాలని" కలలు కంటున్న ఆ ఇద్దరి కలలు కల్లలయిపోయాయి. మల్లికతో పాటు బాధను పంచుకుని వణికిపోయింది లావణ్య.

"ఒక మేధావిని హత్యచేశారు. స్వార్థపరులు. ఇలాంటి హంతకుల్ని ఏ న్యాయస్థానం శిక్షిస్తుంది!" పాసయ్యానన్న సంతోషం మరచి పెడసగా అనుకొంది.

మధుకర్‌ని మళ్ళీ మామూలు మనిషిని చేసే బాధ్యత తీసుకొని కన్నీళ్ళతో కోరికలకు పగ్గం వేసింది మల్లిక.

*    *    *

రెండోవాడి పెళ్ళికని వెళ్ళిన భానుమూర్తి తిరిగి రాలేదు. లావణ్య రిజల్ట్సు తెలిసిన రోజున వూరినుండి కబురు వచ్చింది — భానుమూర్తికి బాగోలేదనీ, జ్వరమనీ... లావణ్య ఉత్సాహం నీరుకారిపోయింది ఈ కబురు విన్నాక.

ఏంచేయాలో తోచని కస్తూరి కాలుగాలిన పిల్లిలా తిరుగుతోంది.

"అక్కడకు వెళ్ళాకే జ్వరం రావాలా ఈ మనిషికి?యిపుడెలా?తను వెళ్ళగలదా? వాళ్ళు రానిస్తారా? ఈ స్థితిలో ఆయన్ని చూడకుండా, దగ్గరలేకుండా ఎలా ?" తనలో తనే గట్టిగా అనుకొంటున్న తల్లి అసహాయ స్థితికి కన్నీళ్ళు వచ్చాయి లావణ్యకి.

"బేబీ! మీ నాన్న క్షేమంగా వస్తారంటావా? ఏమోనే! వాళ్ళేంచేస్తున్నారో, ఏం చూస్తున్నారో!అదో పల్లెటూరు, పోనీ ఏ టాక్సీలోనన్నా ఇక్కడికి తీసుకు వచ్చేయకూడదూ!" ఆ మనిషి తనకే స్వంతమయినట్లు, ఇంకెవరికీ ఏమీ కానట్లు బేలగా అంటున్న తల్లిని జాలిగా చూసింది.

"ఒకవేళ ఆయనకేమన్నా అయితే... బేబీ మనం ఎలా బతుకుతామే!" గొంతునిండా దుఃఖం పూడుకుపోయి అంటున్న తల్లిని చూసి...

"ఛ... ఏం మాటలమ్మా అవి, ఒట్టి జ్వరానికే అల్లా అయిపోతావేమిటి? నాలుగయిదు రోజుల్లో వచ్చేస్తారు చూడు. ఆయనకూ బెంగగానే వుంటుంది మనమెలా వున్నామోనని!" చేతనయినంతగా మొదటిసారిగా తల్లిదగ్గర స్వేచ్ఛగా, ధైర్యంగా మాట్లాడింది.

లావణ్య కల్పించిన ఆశలు ఆశలుగానే వుండిపోయాయి. కస్తూరి భయపడుతూ వూహించినదే నిజమయింది.

"మిమ్మల్ని తీసుకురమ్మన్నారు!" అంటూ చెప్పిన పాలేరు వెనుక మతిపోయినట్లు బయలుదేరారు తల్లీ కూతుళ్లు.

కస్తూరి మనసంతా కల్లోలితంగా




వుంది. ఈ పాతిక సంవత్సరాలలో ఏనాడు ఆ వూర్లో అడుగు పెట్టలేదు. ఆ మనుషులను చూడలేదు. ఇప్పుడీవిధంగా ఆ ఇంట్లో అడుగు పెట్టవలసి వస్తోంది. బస్సు ప్రయాణం తరువాత సన్నని మట్టి రోడ్డు మీదుగా, పచ్చని చేల మధ్యనుండి రిక్షా వెళుంటే కొత్తగా అభివృద్ధి చెందుతున్న వూరని ఇట్టే తెలిసిపోతోంది! వూరి మొదట్లో యువజన సమాజం బోర్డు, రెండుమూడు టీ దుకాణాలు, కిళ్ళీ బడ్డీలు వున్నాయి. రిక్షాలో కూర్చునే అటూ, ఇటూ చూస్తోంది లావణ్య! కస్తూరికి మాత్రం ఇవేం కనుపించటంలేదు. ఆమె మనసూ, ప్రాణం, భానుమూర్తి మీదే. "ఎలావుందో! ఏం చూడవలసి వస్తుందో". లావణ్య మాత్రం "అక్కడ ఎటువంటి అనుభవం ఎదురవబోతోంది!" అని ఆలోచిస్తోంది.

ఎత్తయిన కాంపౌండ్ వాల్‌తో పెద్ద గేటున్న ఇంటిముందాగింది రిక్షా!. వాస్తవంలోనికి వచ్చిన ఇద్దరి గుండెలు స్పందన హెచ్చి వుక్కిరి బిక్కిరి అయ్యారు.

గేటుదాటి లోపల అడుగు పెట్టగానే పదడుగుల దూరంవున్న ఇల్లు ఆమడ దూరంలో వున్నట్లనిపించింది. నెమ్మదిగా అడుగులో అడుగువేసుకొంటూ నడుస్తున్న ఇద్దరికీ ఇంటి ముందుగాని, ఇంట్లోగాని మనుషుల సందడే కనబడలేదు. మెట్లెక్కిన తరువాత నిశ్శబ్దంగా, ఖాళీగా వున్న పెద్దహాల్లోకి వెళ్లాలో వెళ్ళకూడదో తేల్చుకోలేనట్లు గుమ్మం దగ్గరే ఆగిపోయింది కస్తూరి, ఆ వెనుక లావణ్య!

ఈ లోపున వాళ్లతో వచ్చిన పాలేరు వెనుకనుండి వెళ్ళి చెప్పినట్లున్నాడు. సన్నని మట్టెల చప్పుడు లయబద్ధంగా కస్తూరి గుండెలమీద నాట్యం చేస్తున్నట్లనిపించింది. నిస్త్రాణంగా గుమ్మం పట్టుకొంది ఆసరాగా. ఎప్పుడూ ఇటువంటి ఆందోళన, ఒంటరి ప్రయాణం, భయం తెలీదు కస్తూరికి.

కర్టెన్ తొలగించి ఎదురుగా నిలబడి చూస్తున్న ఆమెను చూసి లావణ్య ముందు తేరుకొని రెండు చేతులు జోడించింది.

భావరాహిత్యమైన కస్తూరి చూపులలో చిక్కుకొన్న పూర్ణ చూపులు ఆమెలో ఏదో వెతుకుతున్నాయి. ఈమే...పాతిక సంవత్సరాలపాటు. తన జీవితంలోని ఆనందాలు, సరదాలు అన్నీ పీల్చేసింది. తనను ఏమీలేని దాన్నిగా, జీవచ్ఛవంలా చేసిన సాటి స్త్రీ – ఈనాడు ఇంతవరకూ ఎవరి సర్వస్వాన్ని దోచుకొని మహారాణిలా విర్రవీగిందో ఆమె– ఆ 'సర్వస్వాన్ని' చూసేందుకు 'దేహీ' అని తన ముందు నిలచింది. మనసు పొరల్లో ఎక్కడో దాక్కున్న ఈర్ష్య పైకి వస్తోంది.

"అమ్మా!" గదిలోకి రాబోయి మతిపోయినట్లు నిలుచున్న తల్లినీ, ఎదురుగా వున్న వ్యక్తులనూ చూసి గిరుక్కున వెనుదిరిగి గట్టిగా పిలిచాడు కరుణ.

ఎక్కడోవున్న మనసుని పట్టితెచ్చింది ఆ పిలుపు!

"ఆఁ అహ...రండి... అదిగో ఆ గదిలో వున్నారు!" అంటూ ఎడమ చేతి వైపునున్న గది చూపించి ఎవరో తరుముతున్నట్లుగ వెనుదిరిగి తెరవెనుక మాయమయ్యింది అన్నపూర్ణ.

ఇందాకటి నుండి నిలుచుని కాళ్ళు పీకుతున్న లావణ్య కళ్ళ ముందు జరుగుతున్న ఈ దృశ్యం హృదయపు లోతుల్లో నిదురపోతున్న అభిమానాన్ని తట్టిలేపింది.

యాంత్రికంగా ఆ గది వైపు అడుగు

చేస్తున్న తల్లి అడుగులో అడుగు కలిపింది పసగె తిన అభిమానాన్ని సిదుర పుచ్చి ఆ గదిలో అడుగు పెట్టగా నే వేయి ఏనుగుల బలం వచ్చిందాన్లా, యింత వరకూ మాయలో మునిగిన మనిషి వాస్తవానికి వచ్చినట్లుగా ఒక్కుదుటున సర్వంమరచి...

"ఏమండీ!" అంటూ భర్త కాళ్ళ దగ్గర కూలబడిపోయింది కస్తూరి ఏడుస్తూ.

హాస్య దృక్కులతో చూస్తూ కళ్ళ నీళ్లు నింపుకొన్నాడు భానుమూర్తి.

అపుడు తెలిసింది ఆ ఇద్దరికీ, అతనికి పక్షవాతం వచ్చిందని! కస్తూరి భయంతో వణికిపోతే లావణ్య చిగురుటాకులా కంపించిపోయింది.

"రామ్మా!" క్షీణస్వరంతో వచ్చిన పిలుపుకి "నాన్నగారూ!" అంటూ దోసిట్లో మొహం దాచుకొంది.

"ఏమండీ? ఏమిటండీ ఇది? యిలా ఎందుకయ్యింది? నేనేం పాపం చేశాను? నాకెందుకు రాలేదీ జబ్బు? నన్ను ఒంటరి దాన్ని చేసి మీరు...ఇక్కడ...ఇక్కడ వుండిపోతే నేనేమయిపోతాను?" కస్తూరి ఆవేశంలో ఏం మాట్లాడుతోందో తెలీని స్థితిలో అనేస్తుంటే లావణ్య బిగపట్టుకొని వింటోంది.

"కస్తూరీ! నేను మాత్రం ఇంత త్వరగా యిలా అయిపోతాననుకొన్నానా? బేబీ...కస్తూరీ ... మీకు అన్యాయం చేయను...బేబీ...అమ్మా...మీ అమ్మకి ఇంక నీవే...అన్నీ నీవే చూడాలి!" అన్న మాటలు గొంతులో పూడుకుపోయి దుఃఖం అడురాగా తల్లి, కూతురు ఏడుపు మినహా ఏమీ అనలేని స్థితిలో వుండి

పోయారు. అంతలో పూర్ణ మందు తీసుక వచ్చింది.

ఆయనను లేపనెత్తి గుండెలకు చేర్చుకొని మందు తాగిస్తూవుంటే తన చేతులు విరిగిపోయినట్లే బాధపడింది కస్తూరి. అతన్ని ఎత్తడంలో సహాయం చేద్దామన్న ఆలోచన రానందుకు సిగ్గుపడింది.

లావణ్య పరిస్థితి అయోమయంగా వుంది. తల్లి ఈ లోకంలో లేదు.

"ఏం చెయ్యడం? ఇటువంటి మనిషిని వదిలిపెట్టి ఎలా వెళ్ళడం? వెళ్ళకపోతే ఇక్కడ వుండనిస్తారా? పురుగుల కన్నా హీనంగా చూస్తున్న వాళ్ళ మధ్య ఎలా వుండగలరు? భగవాన్ ప్రేమించి పెళ్ళి చేసుకొన్నందుకిదే శిక్షయితే ఏ ఆడ దానికీ ఆ సాహసం వద్దు. మనిషిని మనిషిగా చూడలేని ఈ సమాజంలో ఆడ దాన్ని ఆడదిగానే వుండిపోనీ. అంతేగానీ యిలాంటి స్థితికి దిగజార్చకు" లావణ్య ఆలోచనలో వుండగానే కరుణ భార్య కాఫీలు తెచ్చి ఇచ్చింది.

"అమ్మా! రిక్షా తెప్పించాలేమో, టయిమవుతోంది!" అన్న కరుణ మాటలకు తలెత్తి చూసింది లావణ్య. ఆ మొహంలో ఒక్క క్షణం మెదిలిన అసహ్యం సూటిగా అతని గుండెని తాకింది. అయినా నిర్లక్ష్యంగా తలెగరేసి వెళ్ళిపోయాడు.

"కస్తూరీ! నిన్ను ఇక్కడ వుండమని చెప్పి చిత్రవధ చెయ్యలేను. మన సంసార జీవితంలో నిన్ను బాధపెట్టిందేమన్నా వుంటే యిదే. ఇదన్నా నిస్సహాయుడిని కనుక. పూర్ణ వూరుకొన్నా వాళ్ళు..వాళ్ళు నన్ను క్షమించలేరు. ఆడదానికున్న ఆర్ద్రత, జాలి, అనురాగం మగవాడి కుండవ్! నా గురించి పూర్ణకున్న తాపత్రయం, ఆవేదన వాళ్ళకుండవ్.

 

నన్ను క్షమించి వెళ్ళిపో కస్తూరీ. నీ గుండెల్లో శాశ్వతంగా చోటు సంపాదించుకొన్నానన్న తృప్తి నాకు మిగలనీ. బేబీకి ఏ విధమైన అన్యాయం చెయ్యలేదు. యిదిగో ఈ కాగితాలు తీసుకో! దీంతో నీ ఋణం తీరిపోయిందనుకోను. నా బిడ్డగా నేనివ్వవలసింది దానికిస్తున్నాను. మళ్ళీ నిన్ను చూడగలనో లేదో" మూర్తి గొంతు పట్టుకుపోయింది.

"ఏమండీ! నన్ను ఎవరెంత అవమానించినా,ఎన్ని బాధలు పెట్టినా మిమ్మల్ని విడిచి వెళ్ళలేనండీ. నన్నుండనివ్వండి. ఆవిడ కాళ్ళుపట్టుకొని ప్రాధేయపడతాను. మీ కాళ్ళ దగ్గర పడి వుంటానండీ" కస్తూరి దుఃఖం కట్టలు తెంచుకొంది.

లోపల కరుణకు అన్న పూర్ణకి ఘర్షణ జరుగుతోంది. స్పష్టాస్పష్టంగా మాటలు వినబడుతున్నాయ్.

"నాకు తెలీదమ్మా...వీల్లేదు. అందరిలో ఎంత చిన్నతనంగా వుంటుందో! నువ్వు ఇలాంటిదానివి కాబట్టే నీతోపాటు ఆవిడ ఆయన్ని పంచుకొని ఇన్నేళ్ళు నిలబడగలిగింది. నిన్ను సర్వనాశనంచేసినందుకు ఆమె మీద నీకు కోపంలేదూ. ఏమయినా సరే ఈ ఇంట్లో వుండటానికి వీల్లేదు. ఆడదానివి నీకు తెలీదు. బయట నేను ఎంతమందికి ఎన్ని సమాధానాలు చెప్పుకోవాలో" తాతగారి పంతం, పట్టుదల వారసత్వంగా పుణికి పుచ్చుకొన్న కరుణ గొంతు ఖంగుమంటోంది. లావణ్య మనసు వుడికిపోతోంది.

"చూడండీ! ఇప్పుడు కావలసింది పరువు ప్రతిష్ఠల సమస్యకాదు. ఆయన మనసుకి శాంతి. కన్నకొడుకుగా మీరు ఆయనకి చెయ్యవలసింది ఆయన ఆత్మకి శాంతి. అమ్మను ఇక్కడ వుండనీయండి. మీకు లోకంతో, పరువు ప్రతిష్ఠలతో సంబంధం వుండొచ్చు. కానీ ఆవిడ అన్నీ తెంచుకొని, అందర్నీ వదులుకొని ఆయనే లోకమనుకొంటున్న పిచ్చిది" కన్నీళ్ళతో చేతులు జోడిస్తున్న లావణ్యను చూసి నిస్సహాయంగా కరుణవైపు చూసింది పూర్ణ.

"అవును. పరువు ప్రతిష్ఠ, మంచి మర్యాద మీకెలా తెలుస్తాయ్. అవేవీ మీకక్కర లేదుగా. కానీ...కానీ ఈ యింటికి అవన్నీ వున్నాయ్. ఆయన యిప్పుడు ఈ యింటి మనిషి" నిక్కచ్చిగా అన్నాడు కరుణ.

"ఆ యింట్లో వుండగా ఆయనకిలా అయితే...ఇదేపరిస్థితి మీకు...మీకు ఎదురయితే" ఆవేశంగా అంది లావణ్య.

"హుఁ మాకా ఈ స్థితి... మాకెందుకు కలుగుతుంది. ఆయన్ని అక్కడనుండి తెచ్చుకొనే అధికారం మాకుంది. వుయ్ ఆర్ నాట్ ఇల్లీగల్ చిల్డ్రన్" హేళనగా, చీదరింపుగా అంటూ వెళ్ళిపోయాడు.

"ఫరవాలేదు, మీరు వుండండి!" అనేసి వెనుదిరిగి వెళ్ళిపోయింది అన్నపూర్ణ అప్పటి వాళ్ళ దీనస్థితికి జాలిపడిపోయి. తల నేలకు వేసి కొట్టుకొని చావాలనిపించింది లావణ్యకు. పిచ్చిదానిలా కూర్చున్న తల్లిని చూడకపోతే మరుక్షణంలోనే బయటపడేదే!

రెండో రోజున లావణ్య బయలుదేరింది తల్లిని వదిలి. కస్తూరి కూడా బలవంతం చెయ్యలేదు వుండమని.

మరో నాలుగు దినాలకు తండ్రి పోయిన కబురుకు పరుగెత్తుకొచ్చింది లావణ్య, మల్లికతో కలిసి.

"నాన్నా! మీ రకం పంచుకు పుట్టి సందుకు మీకు నేనేమీ చెయ్యలేని నిర్భాగ్యురాలినయ్యాను" అంటూ ఆపుకోలేని దుఃఖంతో ఏడ్చింది లావణ్య

ఆ సమయంలో కూడా తృణీకారంతో చూసాడు కరుణ. మల్లిక బలవంతంగా లాక్కువచ్చి మెట్లమీద కూర్చోబెట్టింది.

మూడో రోజు కార్యక్రమంతో అన్ని బంధాలు తెంచుకొని తల్లిని తీసుకొని బయలుదేరారు శూన్యమైన మనసులతో.

* * *

అన్నీ సుఖంగా జరిగిపోతున్నపుడు మనిషి ఏ చిన్న కష్టాన్నీ తట్టుకోలేడు. ప్రతిదీ భరించలేనట్లుగానే అనిపిస్తుంది. పదిమందితో కలిసి పోరాడుతున్నప్పుడు ధైర్యంగా పోరాడుతాడు. అదే ఒంటరి వాడయితే ముందు దిక్కుతోచకపోయినా తరువాత కొనవూపిరి వున్నంతవరకూ పోరాడ నిశ్చయించుకొంటాడు. అలాగే అయింది కస్తూరి పరిస్థితి కూడా! భాను మూర్తి వున్నప్పుడు ఏదీ సమస్యగా అనిపించలేదు. ఏదయినా వచ్చినా అతని అండదండలతో ఎదురు నిలిచేది. అటువంటి కస్తూరిని జీవితమనే ప్రత్యర్థితో ఒంటరిగా వదిలేసినట్లయింది. ఒక్క క్షణం బిత్తరపోయినా వెంటనే తేరుకుంది.

ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేసింది.

కస్తూరికిపుడు 'లావణ్య' తప్ప ప్రపంచంలో మరేంలేదు. అందుకనే తన ఆస్తిని తాను కాపాడుకొందికి గట్టిగా నిశ్చయించుకొంది.

కస్తూరికి కాలం ఇప్పుడు తాపేలు నడకలా అనిపిస్తోంది.

లావణ్య హౌస్‌సర్జన్సీ సాగిపోతోంది. మల్లిక హౌస్‌సర్జన్సీ చేస్తోంది — మధుకర్‌ని పరీక్షలకు తయారు చేస్తూనే!

"హౌస్ సర్జన్సీ అవగానే ఏంచేస్తావ్" అంది మల్లిక.

ఎమర్జెన్సీ వార్డులో సైడ్‌డ్యూటీలో వున్నారు ఇద్దరూ.

"ఏం చేస్తాను జాబ్ కోసం ట్రై చేస్తాను. నువ్వయితే ఎమ్. డి. నో, డి.జి.వో.నో చేస్తావు అవునా?" అంది లావణ్య.

"ఊం... కానీ.. ముందు మధుకర్‌ది పూర్తికావాలి కదా" సాలోచనగా అంది మల్లిక.

"అయితే!"

"అయితే ఏం లేదు. పెళ్ళి చేసుకొన్నాక ఇద్దరం కలిసి చదవొచ్చని"

"అమ్మ, నాన్న ఒప్పుకుంటారా? ఒప్పుకోకపోతే ఏం చేస్తావ్?" కుతూహలంగా అడిగింది లావణ్య.

"ఒప్పుకోరనే భయం లేదు. ఒప్పుకొంటారనే అనిపిస్తోంది. నాన్నగార్కి పెద్ద పట్టింపులు లేవు. అమ్మ సంగతి నాన్నగారు చూసుకుంటారు. నువ్వన్నట్లు ఒప్పుకోకపోతే రిజిస్టరు మారేజీయే గతి" తేలిగ్గా నవ్వుతూ అంది మల్లిక.

"మల్లికా! అంత సాహసం చేస్తావా? నీకు తెగింపే కాని మల్లికా దానివలన ఏం సుఖం లేదనిపిస్తోంది. జీవితంలో ముందు, ముందు ఏం అనుభవించవలసి వస్తుందో శాస్త్రకాస్త దూరం ఆలోచించి చెయ్యి!" చనువుగా బోధపరుస్తున్నట్లే అంది లావణ్య.

"ఏమిటే నీ పిచ్చి! ఈ తరంలో కూడా ఇది సాహసమనంటావా?"

"ఏ తరమైనా, ఏ కాలమయినా మనుషులూ, వాళ్ళ మన స్తత్వాలు మారలేదే. మారిపోయింది, మారిపోయిందనుకొంటూ మనం ముందడుగు వేస్తూంటే, మారలేదు అనడానికి నిదర్శనంగా ఆ అడుగు వెనుకలో పడుతుంది. తెగించిన మనిషిని ఏం చెయ్యలేని సంఘం, అవి దాన్ని మాత్రం అవమానిస్తోంది" ఆవేశంగా అంది లావణ్య.

"లావణ్యా! నువ్వేవుద్దేశం తోఅంటున్నావో నాకర్థం అయింది. కానీ ఇక్కడ ఒక విషయం మరచిపోతున్నావ్! ఏమీ అనుకోకపోతే ఒక్కమాట. మీ అమ్మ పరిస్థితి వేరు, నా పరిస్థితి వేరు. నేను మధుకర్‌కి కాగలిగితే సంఘంలో గుర్తించబడే భార్యనౌతాను. అప్పుడు నాకే సమస్య వుండదు. ఏది ఏమయినా మన హిందూ సాంప్రదాయం, కట్టుబాట్లు కొన్ని సడలించలేనివి వున్నాయ్. అవి వుంటేనేబాగుంటుందనిపిస్తుంది కూడా.."

"అయితే అమ్మ చేసింది తప్పంటావా?"

"తప్పో, ఒప్పో నేను చెప్పేంత దాసను కాదు కానీ... ఇప్పటిస్థితి చూస్తే తప్పు చేసిందనిపించదంలో నీ భవిష్యత్తు తలచుకొన్నప్పుడు, ఈ మారని మనుష్యుల ముందు తల వంచవలసి నప్పుడు తప్పనిపించదంటే? ఏమయినా జంతువుల మాదిరిగా మనుషుల మధ్య వంచుకోవడమనే పద్ధతి లేదు. అందుకే మనకీ సంఘం, కట్టుబాట్లు అంటూ ఏర్పడినాయి. వాటిని ధిక్కరించి ముందుకు పోవాలనుకున్ననాడు ముందు దారి ముళ్ళ బాటయినా, రాచబాటయినా తప్పదుగ్గా!"

"డాక్టర్! కేసువచ్చింది" నర్సు అన్న





మాటలతో యిద్దరూ పరుగెత్తారు.

యాక్సిడెంట్ కేసు.రక్తం బాగాపోయింది. ఫ్రాక్చర్స్ కూడా బాగా అవడంతో హడావిడిగా టెస్ట్‌లు మొదలుపెట్టారు. బ్లడ్ గ్రూప్ తీసుకొని అన్నీ చేసి, మంచం మీదకు చేర్చే సరికి తెల్లగా తెల్లవారి పోయింది.

"అదృష్టవంతుడు. వెంట్రుకవాసిలో ప్రాణం నిలుపుకొన్నాడు!" నిర్లిప్తంగా నడుస్తున్న లావణ్యతో అంటూ తను మెట్లు దిగింది. కళ్ళు మండుతున్నాయి.

మల్లిక తండ్రికి తిరిగి ఈ వూరే ట్రాన్స్‌ఫర్ కావడంతో మల్లిక కూడా యింట్లోనే వుంటోంది.

ఇద్దరూ కలిసి రిక్షా ఎక్కేసారు.

మల్లిక ముందు దిగిపోయి ఆ మలుపు తిరిగిపోయింది. లావణ్య రిక్షా సాగిపోయింది. ఇంటికొచ్చేసరికి ఆత్రంగా ఎదురుచూస్తున్న తల్లిని చూసి అలసటంతా మరిచిపోయింది లావణ్య.

తలారా స్నానం చేసాక హాయిగా నిద్ర పట్టేసింది.




లావణ్యకు ఫ్యామిలీ ప్లానింగ్‌లో, మల్లికకు ప్రక్క పల్లెలో నెల రోజులు డ్యూటీ పడింది. ప్రతిహౌస్‌సర్జన్ కొన్ని ఆపరేషన్స్ చేయాలని ఉంది. లావణ్య డ్యూటీలో ఉండగా ఎక్కువ కేసులు రాలేదు. చాలామంది డబ్బు కోసం చేయించుకునేవాళ్ళే. ఇరవై రెండేళ్ళ కుర్రాడు, సన్నగా, పీలగా వున్నవాడు వచ్చి ఆపరేషన్ చేయించుకుంటానన్నాడు.

భార్య, ఇద్దరు పిల్లలు. తను రిక్షా తొక్కుతానని చెప్పాడు. వివరాలు విన్నాక నమ్మబుద్ధికాక. అతన్ని తీసికొని వచ్చిన ఏజంట్‌ని అడిగింది.వాడు తడుముకోకుండా నిజమేనని చెప్పాడు. అయినా నమ్మబుద్ధి కాలేదు. "సరే! ఆ పక్కనుండు!" అని చెప్పి మిగతా పని చూసుకోసాగింది. ఈలోగా ఎలా తెలిసిందో ఏమో ఆ కుర్రాడి తల్లి ఏడుస్తూ వచ్చింది.

"నీకిదేం పొయ్యేకాలంరా పెళ్ళి పెడాకులు లేవు. వంశం కూలబోస్తావటరా? ఏడీ ఆ సచ్చినోడు..అమ్మో... అమ్మో ఎంత పనయిపోను. ఆ రిక్షా బంగారయ్యగాడు చెప్పబట్టి పరుగెత్తుకొచ్చేసాను" అంటూ గొడవ పెట్టేసరికి...ఆ కుర్రాడికి నాలుగు చీవాట్లు పెట్టి పంపేసారు.

"వెధవలు.. డబ్బుకోసం ఎంతకైనా తెగిస్తారు. వాడి తెలివి చూడండి....ఇద్దరు అని చెప్తే ఎక్కువ డబ్బు ఇస్తారు కదా! అంతా వ్యాపారం అయిపోయింది..." కొలీగ్ అంటూంటే నవ్వి వూరుకొంది లావణ్య.

ఇంటికొచ్చి తల్లితో చెప్తే.."అలాంటి తొందర పనులు చెయ్యకు. సయమే చేసే సావు కాదు. ఆ పాపం నీకు చుట్టుకొన్ను. అయినా ప్రపంచమంతా డబ్బు మయమై పోయింది" అంటూ నిట్టూర్చింది కస్తూరి.

మల్లికను మర్నాడు కలిసినపుడు నవ్వుతూ చెప్తే; "చేసెయ్యవలసింది. నీ

కేసులు పూర్తయిపోను!" అంది వేళా కోళంగా!

రోజూ కొత్త అనుభవాలు, రకరకాల మనుష్యులు, మనః ప్రవృత్తులు. అదో ప్రపంచం. సముద్రమంత ప్రపంచంలో తానొక నీటి బిందువుననిపిస్తుంది.

అనేక యిబ్బందులు ఎదుర్కొని కేంపు జయప్రదంగా ముగించుకొని బయటపడ్డారు. ఆఖరి రోజు వాన్‌లో బయలుదేరి వచ్చేస్తుంటే చెప్పలేనంత రిలీఫ్‌గా అనిపించింది లావణ్యకు.

"అబ్బబ్బ! చంపారు బాబూ! వీళ్ళని ఏ దేవుడూ మార్చలేడు. అందుకే మూర్ఖులంటారు. మనం చెప్పింది వినిపించుకోరేం? ఇలాంటి వాళ్ళున్నంత వరకూ దేశం ప్రగతిని ఎలా సాధిస్తుంది. తెలీనన్నాళ్ళు తెలీదు. తీరా చెప్పాకన్నా వినిపించుకోపోతే ఎలా? ఏంమనుషులుబాబూ" విసుగ్గా అంది ఒక అమ్మాయి.

"వీళ్ళందరికి ముందు చదువులుచెప్పి కాస్తో, కూస్తో జ్ఞానం వచ్చాక ఈ కార్యక్రమం చేపట్టాలి గవర్నమెంట్ !" అంటూ వ్యాఖ్యానించాడు మరో విద్యార్థి.

"ఎలా అయితేనేం పని పూర్తి చేసుకొని పిచ్చెత్తిపోకుండా క్షేమంగా బయటపడ్డాం అంతే చాలు!" లావణ్య అనేసరికి అంతా నవ్వుకున్నారు.

* * *

లావణ్యకు హౌస్ సర్జెన్సీ అయిపోయాక ఖాళీగా కూర్చోవడం విసుగే కాకుండా ఆర్థిక ఇబ్బంది కూడా ఎదురవుతోంది. స్టయిఫండ్, ఆపైన తండ్రి బేంక్‌లో వేసిన పదివేలపై వచ్చే వడ్డీ కలిపి తల్లి ఇల్లు ఎలాగ గడిపిందో ఇన్నాళ్ళు లావణ్యకి తెలిసిరాలేదు. కానీ జాబ్ దొరకటం అంటే మాటలా ? ప్రయివేటు ప్రాక్టీస్ పెట్టాలంటే ధైర్యంలేదు. అయినా యీ రోజుల్లో ఒట్టి ఎమ్. బి. బి. యస్. అన్న బోర్డుమూస్తే ఎవరూరారు. ముందు స్పెషలిస్ట్ అన్న పేరు, చివర నాలుగయిదు ఇంగ్లీషు అక్షరాలు వుండాలి.

రోజులో సగభాగం తల్లి ఏదో అంటూంటే వింటూ కూర్చోవడం, లేకపోతే పడుకోవడం. అప్పుడపుడు మల్లిక వస్తే కబుర్లు...యిలా దొర్లిపోతున్నాయి లావణ్య రోజులు.

ఇంట్లో తీరిగ్గా కూర్చున్న పాతికేళ్ళ కూతుర్ని చూస్తుంటే తన నిస్సహాయత బయటపడినట్లయి ఆవేదన కసిగా మారి కవ్విస్తుండేది కస్తూరిని.

భానుమూర్తి వుండగా ఏ ఒక్కనాడూ తను చేసిన పనికి బాధపడలేదు. పడే అవసరమూ కలుగలేదు. ఆనాడైతే ఎవరికీ తల వంచక, దేనికీ భయపడక ధైర్యంగా నిలదొక్కుకుంది. కానీ ఈనాడు అంతా కట్టకట్టుక వచ్చి తనను ఎదుర్కొంటున్నట్లుగా వుంది.

చుట్టాలు, దగ్గర వాళ్ళు ఎంత అవసరమో అనిపిస్తోందిప్పుడు. ఆయన వున్నప్పుడు డబ్బుకేకాదు, మనుష్యులకూ లెక్కలేనట్లనిపించేది. ఇప్పుడు డబ్బుతో పాటు సాటి మనిషి ఆదరణ కావాలని అనిపిస్తోంది. అన్నీ అమర్చిపెడితే మహారాణిలా సాధించుకొని మరీ జరిపించుకునే కస్తూరికి ఇప్పుడు బియ్యానికి, పంచదారకి బయటికి వెళ్ళవలసిన పరిస్థితి వచ్చింది. హౌస్‌సర్జెన్సీ పూర్తయ్యాక స్టయిఫండ్ రావడం మానేసాక త్రిశంకు స్వర్గంలో వేళ్ళాడుతున్నట్లు అనిపించింది. కన్ను మూస్తే బెంగ.

"రేపు ఎలా జరుగుతుంది. పెళ్ళి

 

జరక్కపోతే మానె, పిల్ల భవిష్యత్తేమిటి? వుద్యోగమన్నా దొరక్కపోతే ఆయన వేసిన నాలుగురాళ్లు ఎన్నాళ్ళకొచ్చేను!" అవే ఆలోచనలు...ఆలోచనలు.

శారీరకంగానే కాక మానసికంగా కూడా ఏ ఒడిదుడుకులు ఎరుగని కస్తూరిని ఈ ఆలోచనలు బాగా కృంగదీసాయి 'ఆలోచనలు అనారోగ్యానికి మూలం' అన్నట్లు కస్తూరి ఆరోగ్యం రోజురోజుకు దిగజారసాగింది. అసలే యింత దానికి అంత చేసే కస్తూరి "ఏమయిపోతానో, ఏమన్నా అయితే బేబి ఎలా?" అన్న ఊహకు ప్రాణం పోసుకొని, అది భయపెడుతుంటే పూర్తిగా మతిపోయినదానిలా తయారై వేధించుకు తినేది లావణ్యను.

"మల్లికా! ఎలా?ఎలా ఈ పరిస్థితుల్ని ఎదుర్కోవడం? నాన్నగారు ఉన్నపుడు నాకేం తెలిసేది కాదు. అమ్మ గొడవ పడలేక పోతున్నాను. ఆమె ఆలోచించేదేమిటో ఆమెకే అర్థం కాదు. తనేం మాట్లాడుతుందో తనకే తెలియదు. నేనేం చెయ్యను? జాబ్ దొరికితే కొంత సమస్య తీరుతుంది కానీ అది అంత సులువా? నాన్నగారు అదృష్టవంతులు. హాయిగాపోయారు. ఈ ఆలోచనలతో నేనేమయి పోతానో అనిపిస్తోంది"అంటూ మల్లిక ఒడిలో తలపెట్టుకొని బావురుమంది లావణ్య.

"ఈ మాత్రానికే అలా అయిపోతే ఎలా చెప్పు? అందుకే జీవితం 'అనుభవ పాఠాల గ్రంథం' అంటారు. ఎన్ని అనుభవాలు కలసి జీవితపుటల్ని నింపుతాయో చివరి వరకు ముగింపు వచ్చేవరకూ చూసుకొంటూ పోవడం తప్ప మనంచేసేదేముంది చెప్పు" ఓదార్పుగా తల నిమురుతూ అంటుంటే లావణ్య మనసుకి హాయిగా ఉంది.

మనసులోని ఆవేదన కన్నీటి రూపంలో బయటకు వచ్చేస్తే మనసెంతో తేలికయిపోతుంది. "సమస్యలు వస్తూనే ఉంటాయి, వాటిని కాలమే పరిష్కరిస్తుంది. ఈ లోపున సమస్యలనెదుర్కొనే శక్తి మాత్రం సంపాదించుకోవాలి. నేను మాత్రం ఏం చేస్తున్నాను? ఖాళీగాలేనూ" ఒడిలో ఉన్న లావణ్యను లేవదీసి పక్కన కూర్చోబెట్టింది మల్లిక.

"నీ సంగతి వేరు మల్లికా! నీకు భవిష్యత్తు ఉంది"

"భవిష్యత్తు అనేది అందరికీఉంటుంది. కాకపోతే మనకు ఎదురయ్యే మంచీ, చెడుల కోసం ఎదురుచూడాలి" నవ్వుతూ అంది మల్లిక.

"అదేలే! మంచో, చెడో అంటే. మన పరిస్థితులనుబట్టి మనకు మంచి ఎదురవుతుందో, చెడు ఎదురవుతుందో మనం ఊహించుకొంటుంటాము. ఆ ఊహలు మనిషికో రకంగా ఉంటాయి. అదే చెప్తున్నాను. నీకు భవిష్యత్తును నిర్మించుకోగలనన్న ఆశ ఉంది. పై చదువులు చదువుతావు.మధుని పెళ్ళిచేసుకొంటావు. అన్నిటినీ మించి బాధ్యత వహించే అమ్మా, నాన్న ఉన్నారు. సంఘం అండదండలున్నాయ్. నాకేం ఉంది చెప్పు? ఏ ఆశతో బ్రతకాలని ఉంటుంది? ఒకరి ఆనందాన్ని దోచుకొని సంఘంచేత వెలివేయబడ్డదాని కూతుర్ని. నాన్నగారు ఉన్నన్నాళ్ళూ నాకీ భయాలు ఏమీలేవు. నేనెపుడూ ఒక తప్పు పనికి ఫలితాన్నని కూడా గుర్తించకుండా పెరిగాను. మా యింట్లో మేము ముగ్గురమే ప్రపంచమనుకొనేదాన్ని. సమస్యలంటే ఏమిటో తెలియని ఆ రోజులు ఆనందంగా గడిచిపోయాయి. ఇపుడేమిటో ఒంటరిదాన్నయి

పోయాను. మల్లికా నేను...నేనేమి చెయ్య
లేననిపిస్తోంది. నాకోసమే బ్రతుకుతున్న
నా తల్లికి కూడా నేనేం ఆనందం యివ్వ
లేకపోతున్నాను మల్లికా!"

పరిస్థితులు మనిషిమీద ప్రభావం
ఎలాచూపిస్తాయో లావణ్యను చూస్తే తెలు
స్తుంది. ఎన్నడూ ఏ విషయానికి పెదవి
విప్పని లావణ్య ఇన్ని మాటలు చెప్తోంది.
సునిశితంగా ఆలోచిస్తోంది. ఇన్ని
సంవత్సరాల తరువాత తన పుట్టుకను
గురించి తనకెవరూ లేరన్న ఒంటరితనం
గురించి బాధపడుతుంటే ఏమని ఓదా
ర్చాలో తెలియనట్లు ఉండిపోయింది
మల్లిక.

* * *

రోహిణికార్తె ఎండలు మండిపోతు
న్నాయి. పదకొండు గంటలకే భోజనం
ముగించి వడగాల్పు తగలకుండా తలుపు
లన్నీ వేసి పడుకొంది కస్తూరి.
లావణ్య గదిలో కూర్చుని మెడికల్
జర్నల్ తిరగేస్తోంది. విసుగ్గా ఉంది.
చేతిలో పనిఉండి చెయ్యకుండా చేతులు
కట్టేసినట్లుంది. ఖాళీ టయిమంతా విసుగ్గా
గడచిపోతోంది. ఏ క్లినిక్‌లోనన్నా అసి
స్టెంట్‌గా చేరుదామన్నా దగ్గర్లో ఖాళీ
లేవు. కొంత మందికి అసిస్టెంట్స్
అక్కరలేదు. 'ఏం చేయాలా?' అని
ఉదయంనుండి రాత్రి వరకూ ఆలోచించి
అలసిపోయి నిద్రపోవడం అంతే. ఇద్దరికీ
కావలసిన వంట, కాఫీ అంతా కస్తూరే
చూసుకొంటుంది. ఇంట్లో పనన్నా
ఉండదు. మధ్యాహ్నం వేడి గాలితో
కలిసి బ్యాండ్ గొడవ వినబడింది దగ్గ
రగా. ఉలిక్కిపడి కిటికీ తెర తొలగించి
చూసింది. ఇంటిముందు నుండి కారులో
పెళ్ళి కొడుకు, పెళ్ళి కూతురు కాబోలు
ఉన్నారు. క్రిష్టియన్స్‌లా ఉంది. చర్చి
నుండి వస్తున్నారేమో. నెమ్మదిగా సాగి
పోతున్న కారులో నుండి తెల్లగా విరిసిన
మాలతీ పూవులాకూర్చున్న పెళ్ళికూతురు
కనిపించేసరికి గుర్తుపట్టింది. తమ వీధి
చివర అమ్మాయే. బాగానే ఉంటుంది.
ఉద్యోగం చేస్తోంది. పెళ్ళి కొడుకు
ఏం చేస్తున్నాడో? ఎన్ని చూసుకోవాలో?
ఆడపిల్ల పెళ్ళంటే మాటలా? కులం,
గౌరవం, కట్నకానుకలు, చదువు, అందం
అన్నీ చూస్తారు. అదే అబ్బాయి
కయితే కులం, ఉద్యోగం చాలు! తనకూ
ఇలా పెళ్ళయితే అమ్మ ఎంత సంతోషి
స్తుందో! తనకూ చేసుకోవాలనే ఉంది,
అమ్మకు చెయ్యాలనే ఉంది. కాని ఎవరు
చేసుకుంటారు? తను హరిప్రసాద్‌ని
తిరస్కరించి తొందరపడిందా? ఛ...ఛ..
అదేం లేదు. తిరస్కరించక ఏమాత్రం
మనసులేని పెళ్ళి ఎట్లా చేసుకొంటుంది!
తన క్లాస్‌మేట్స్ ఎంతమంది ప్రేమించి
పెళ్ళి చేసుకోలేదు. కొందరయితే పెద్ద
వాళ్ల ద్వారానే చేసుకొన్నారు. ఒక తరం
ముందు అయిన అమ్మ తెగించినంత
కూడా తను తెగించలేకపోయింది. తన
మొహమాటం, తన భయం, అందంగా
లేననే కాంప్లెక్స్ ఇవన్నీ కలసి అవకాశాలు
కుదరనివ్వలేదు. లేకుంటే సులోచనలా
తనూ ఎవర్నో ఒకర్ని చేసుకొనేదే!
అమ్మ ఎంత సాహసం చేసింది! బహుశ
ఆమె అందం ఆమెకు భరోసా యిచ్చి
ఉంటుంది. అటువంటి అమ్మకు, నాన్న
గార్కి తనిలా వికారంగా పుట్టడమేమిటి?
వాళ్ల ఖర్మ, తన ఖర్మ. కాకపోతే రంగు
లేకపోతే కనీసం పర్సనాలిటీ అన్నా లేదు.
మల్లిక ఎంత అదృష్టవంతురాలు. జీవితమే
వడ్డించిన విస్తరి. పైగా ఇష్టమైన పదార్థాలు




వడ్డించిన విస్తరే అయింది. తను ఇలా ఇంట్లో ఉండడం, నాన్నగారు పోవడంతో అమ్మ మనసు మరీ ఇరుకయిపోతోంది. అయినా తనింత సిల్లీగా పెళ్ళికోసం ఆలోచిస్తోంది. చదువుకున్న, సంస్కారం ఉన్న తనే పెళ్ళి, పెళ్ళి అని తహతహ లాడటం చూస్తుంటే తనకే నవ్వొస్తోంది. ఇంక చదువు సంధ్యలేక ఇంట్లోకూర్చునే ఆడపిల్లలు తప్పు చేస్తారంటే చెయ్యరా? నాన్నగారు పోవడంతో ఆ సాధింపులు, ఆ అసంతృప్తి అంతా తన మీదే చూపి స్తోంది అమ్మ. ఏమన్నా అంటే ఏడుపు. మల్లిక ఇన్నాళ్ళూ చేసిన ప్రయత్నాలూ, బోధనలూ, ఇంకా పూర్తి ఫలితాన్నివ్వక ముందే తను మళ్ళీ యథాస్థానంలోకి వెళ్ళిపోతోంది. మల్లికలాగా తనూ ముందుకు నడుద్దామనుకొంటే అడుగులు మాత్రం వెనక్కే పడుతున్నాయ్. వికసించిన మనసు సంకుచితమైపోతోంది. అమ్మ ప్రేమ ప్రవాహంలో కొట్టుకు పోతోంది తను. ఏం చేయాలి? చిన్న విషయంలో కూడా అమ్మ మాట వినక పోతే ఆరోజెంత రాద్ధాంతం, ఏడుపు? అబ్బ! ఆ నరకం భరించే కంటే ఇలా అనుక్షణం తన్ను తాను చంపుకొంటూ ఆమెకోసం బ్రతకడం నయమేమో! దుర దృష్టవశాత్తు నాన్నగారు పోయారు. ఆయన ఉండి ఉంటే తనకి బందికానా ఇంతగా ఉండిఉండేది కాదేమో! ఎక్కడో ఓ చోట పోస్టింగ్ వేయించుకొని హాయిగ వెళ్ళిపోయేది.

"బేబీ... బేబీ... పిలుస్తుంటే పలకవేం? ఏమిటంత ఆలోచన? మొహం కడుక్కో! ఇంత ఎండ మండిపోతుంటే కిటికీ దగ్గర ఎలా కూర్చున్నావే రా!... రా... టీ త్రాగుదువుగాని" అన్న తల్లి మాటలకు మైకం వదిలి ఈలోకాని కొచ్చింది. ఎపుడు లేచిందో కస్తూరి మొహం కడుక్కొని 'టీ' తయారు చేసింది. ఏదీ ఏమయినా కస్తూరికి టైం ప్రకారం పనులన్నీ జరిగిపోవలసిందే.

లేవబోతున్న లావణ్య మల్లిక రావ డంతో నిర్లిప్తతను వదిలి పెట్టింది. మొహంలో ఆనందం చోటుచేసుకొంది. కళ్ళల్లో ప్రవేశించిన వెలుగు మొహాన్ని ప్రకాశవంతం చేయగా—

"రా... రా... కూర్చో" అని చెప్పి బాత్‌రూమ్‌కి నడచింది. ముందురోజే వేసు కున్న సినిమా ప్రోగ్రాంకు తయారవు తున్న లావణ్యకి, మల్లికకు చెరో ప్లేటు ఉప్మా తీసుకొచ్చింది కస్తూరి.

"ఇపుడెందుకాంటీ" అంటూనే అందు కొంది మల్లిక.

"మల్లికా! మన లావణ్యకేదన్నా సంబంధం చూడమని నాన్నగార్కి చెప్పమ్మా! మీరు పుణ్యం కట్టుకోకపోతే మా కెవరున్నారు చెప్పు?" బేలగా అంటున్న కస్తూరి మాటలకు జాలిగా చూసింది మల్లిక.

"అమ్మకు చాలా పెద్ద కోరికలు న్నాయ్ మల్లికా! పెద్ద చదువుండాలి, డబ్బుండాలి, ముఖ్యంగాఇల్లరికం రావాలి, అమ్మను నా దగ్గరే ఉంచుకోవడానిక్కూడా ఇష్టపడాలి. అందుకని అది ఇపుడపుడే అయ్యే పనికాదులే!" నవ్వుతూ తేల్చేయ బోయింది లావణ్య త్రోవలో.

నిశితంగా చూసింది మల్లిక.

"అంటే చూడొద్దనా? అవును ఆంటీ కోరేదాన్లో తప్పేముంది? అలా ఇష్టపడిన వాడే చేసుకొంటాడు. నువ్వు నిరాశ

పడడం దేనికి" అంది మల్లిక.

* * *

వీధిలో కారు ఆగిన చప్పుడుకి, వంట గదిలోనుండి కస్తూరి, చదువుకొంటున్న లావణ్య ఒక్కసారే పైకి వచ్చారు.

"నేను భానుమూర్తి ఫ్రండ్‌నమ్మా" అంటూ పరిచయం చేసుకొన్నాక లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టింది లావణ్య. వచ్చినాయన లాయర్ విశ్వనాథం. భానుమూర్తి చిన్ననాటి స్నేహితుడు. వివరాలన్నీ తెలుసుకొన్నాక లావణ్యతో సంబంధం విషయం చెప్పి మరీ వెళ్ళారాయన.

సంతోషంతో తల మునకలయిన కస్తూరి అప్పుడే పెళ్ళి జరిగిపోయినట్లే భావించుకొని ఊహాలోకంలో తేలిపో సాగింది. మర్నాడే పెళ్ళివారిని తీసుకు వచ్చారు. లావణ్యను కూర్చోబెట్టి ముస్తాబు చేస్తుంటే విసుగ్గా అనిపించింది.

"అబ్బ ఏమిటమ్మా మరీ చిన్నపిల్లలా ... ఇంత ముస్తాబు" అంటున్న కూతుర్ని విస్తుపోతూ చూసింది కస్తూరి.

"అదేమిటలా అంటావే! ఇదే మొదటి చూపులాయే ! ఏం చెయ్యాలో నాకు తెలీదంటావా? మీ నాన్నగారే ఉంటే అంతా ఆయనే చూసుకొనేవారు. ఇప్పుడీ భారమంతా నా నెత్తినేకదా ఉంది. ఇంక నువ్వు కూడా ఇలా ప్రతిదానికి పేచీ పెడితే నేనేం చెయ్యగలను? చిన్న పిల్లవు కాక ముసలమ్మవయిపోయావా? లావణ్యా,



నువ్వు చదువుకొన్నదానివి కావచ్చు, డాక్టరువి కావచ్చు. కాని నా కూతురువే! నీకివన్నీ చాదస్తాలుగా కనబడవచ్చు కానీ నా సరదాలు, కోర్కెలు, ఆశలు అన్నీ నీ చుట్టూనే ఉన్నాయి.. ఈ రోజు కోసం ఎంత ఎదురు చూసానో నీకెలా అర్థం అవుతుంది? చిన్నపుడు... నాకే ముద్దు, ముచ్చట లేకుండానే అన్నీ అయిపోయాయి. అటువంటి పరిస్థితి వచ్చింది. నీకలా కానివ్వను. ఇలాగన్నా నా సరదా తీర్చుకోనీ. మల్లికకు కబురంపాను. ఇంకా రాలేదు..." గొంతులో మార్దవం, సంతోషం, దుఃఖం చోటు చేసుకోగా చెమ్మగిల్లిన కళ్ళతో ముస్తాబు చేస్తున్న తల్లికి ఇంకేమని సమాధానం చెప్పాలో తెలియనట్లు ఉండిపోయింది లావణ్య.

మల్లిక వచ్చింది. విశ్వనాథంగారు అన్న టైముకి పెళ్ళి కొడుకుని, తల్లి తండ్రులను తీసుకొనివచ్చారు. అబ్బాయి మామూలుగా లావణ్యకి సరిపడేలా ఉన్నాడు. గ్రాడ్యుయేటు, వ్యాపారం ఉంది. చదువుకొన్న అమ్మాయిని చేసుకోవాలన్న ఉబలాటం ఉంది. ఖాసు మూర్తి వాళ్ళకి తెలిసినవాడే! అన్నీ అయ్యాక, ఉత్తరం వ్రాస్తామంటూ లేచారు. ఇష్టపడినట్లేనని ఇన్‌డైరెక్టుగా అన్నారు.

"ఎలా ఉన్నాడే! నీకు నచ్చాడా?" వాళ్ళు వెళ్ళాక నెమ్మదిగా అడిగింది మల్లిక. తల్లి పెట్టిన బారెడు కనకాంబరాల మాల తీసి దాచేస్తూ ఒక్క క్షణం మల్లిక వైపు చూసింది. ఆ చూపులో ఎన్నో అర్థాలు కనబడ్డాయి మల్లికకు. ఒకప్పుడు నిస్తేజమైన ఆ చూపుల్లో మార్పు రావాలని తపస్సు చేసిన మల్లిక, ఈనాడు ఆ చూపుల్లో కనబడుతున్న ప్రశ్నా పరంపరలకు ఉక్కిరి బిక్కిరి అయ్యింది.

"నాకిష్టా నిష్టాలేమిటి మల్లికా!? నీకు తెలియంది ఏముంది? వాళ్ళంతా ఇష్టపడ్డాక నా కిష్టం లేదంటే, ఇటువంటి అవకాశం మళ్ళీ వస్తుందా? మా అమ్మ కలల సౌధం కూలిపోతే ఆవిడ బ్రతుకుతుందా? ఇందాక ముస్తాబవడానికే నా ఇష్టం అంటూ ఏమీ లేకపోయింది. 'ఎందుకమ్మా?' అంటే అరగంటసేపు ఆవిడ మనసులో బాధను వెళ్ళగక్కింది. ఇంక నేనేమంటాను..." అంది లావణ్య బేలగా.

"నువ్వు అలా మాట్లాడకు లావణ్యా. అన్నీ అమ్మకోసమే అనుకొంటే ఎలా? ఇది నీ జీవిత సమస్య. నీ మనసులో అతనికి స్థానంలేకపోతే జీవితాన్నెలా పంచుకొంటావ్? నీకిష్టం లేకపోతే చెప్పు. ఆంటీకి నేను నచ్చచెప్తాను. ఇది కాకపోతే మరొకటి అవుతుంది. సంబంధాలు రావని ఎందుకు అనుకొంటావు?" కాస్త విసుగ్గా అంది మల్లిక.

"మల్లికా! నా పెళ్ళి మాత్రం అమ్మ కిష్టమైన వాడితోనే జరగాలి. లేకుంటే జీవితాంతం ఆవిడ బాధ చూడలేం! ఇంక ఇష్టమంటావా? నా మనసు ఖాళీ... అందులో అతనికి భర్తగా స్థానం ఇవ్వలేపోను. నాకేం లేదు, ఏదో ఇలా అయిపోనివ్వూ!" తేలిగ్గా తీసిపారేస్తూ అంది లావణ్య. మల్లిక మౌనం వహించింది.

"ఈ మధ్య మరీ విసిగిపోయింది లావణ్య ఆంటీతో. అంతేమరి. భగవాన్ దాన్ని కాపాడు. కనీసం భర్త సాహచర్యంలోనన్నా శాంతిని ప్రసాదించు. జీవితం అంటే 'ఇదేకాదు' అని తెలియచెప్పు!" మూగగా ప్రార్థిస్తూ ఇల్లు చేరింది





మల్లిక. పెళ్ళివారి దగ్గరనుండి ఉత్తరం కోసం ఎదురు చూస్తుంటే లావణ్యకి పోస్టింగ్ ఆర్డర్స్ వచ్చాయి- "పగరలో పున్ని పల్లెలో ప్రైమరీ హెల్త్ సెంటర్‌లో అసిస్టెంట్‌గా వేసున్నట్లు". ఏనాడూలేని ఉద్విగ్నతకు లోనయ్యింది లావణ్య. పరుగునపోయి మల్లికతో పంచుకొంది ఆనందాన్ని.

మల్లికకు యమ్.డి. లో సీటు వచ్చింది.

సుఖదుఃఖాలు తోడునీడలే అన్నట్లు మర్నాడే పెళ్ళివారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. మామూలుగా ఇష్టం లేదని వ్రాస్తే సరిపోయేదానికి "అపుడెపుడో ఆపరేషన్ జరిగిందటగదా. పిల్లలు పుట్టని గొడ్రాలిని మేము చేసుకోము" అంటూ వ్రాసారు. నవ్వొచ్చింది లావణ్యకి. డాక్టరయిన తనకు తెలియదా? ఎంత మూర్ఖులు అనుకొంది.

అది విన్న మల్లిక ఆవేశపడింది.

"పల్లెటూరి బైతులు, వాళ్ళకేం తెలుసు? ఏదీ వాళ్ల ఎడ్రస్! నేను ఉత్తరం వ్రాస్తాను. ఎవరు చెప్పారు వాళ్లకి? చూపించుకోమను ఏ డాక్టరుకన్నా. దానికీ దీనికీ సంబంధమేమిటి?" అంటూ ఎగిరింది.

కస్తూరి ఏడుస్తూ కూర్చొంది. దానికి తోడు, ఉద్యోగం కోసం ఊరు విడిచి పోవలసిరావడం, అంతా అయోమయంగా అనిపించింది. పెళ్ళి సంగతి ఓ పక్కకు తోసి ప్రయాణ సన్నాహంలో పడింది. మల్లికను సాయం తీసుకొని ముందువెళ్ళి జాయిన్ అయి వచ్చింది లావణ్య. ఆ చిన్ని హాస్పిటల్‌లో ఒక ఛీఫ్, ఒక అసిస్టెంటు, కాంపౌండరు, ముగ్గురు నర్సులు ఉన్నారు. లేడీ డాక్టరుగా లావణ్యను వేసారు. డాక్టరమ్మ అంటే చిన్న ఇల్లుకూడా దొరికింది హాస్పిటల్‌కి దగ్గర్లో. అన్నీ చూసుకొని సంతృప్తిగ తిరిగివచ్చి తల్లికి విషయాలు చెప్పింది. ఉన్న మూట ముల్లె సర్దుకొని తల్లీకూతుళ్లు ఆ ఊళ్ళో అడుగు పెట్టారు. మల్లిక వచ్చి రెండు రోజులుంది. ఆ విధంగా కొత్త ఊళ్ళో కొత్త జీవితం ప్రారంభించింది లావణ్య.

* * *

మధుకర్ హౌస్ సర్జన్సీ పూర్తి కాగానే మల్లిక, మధుకర్ రిజిస్టర్ మారేజి చేసుకొన్నారు. లావణ్య వెళ్ళింది తల్లికి చెప్పకుండా. మల్లిక తండ్రి వచ్చి మనసారా ఆశీర్వదించాడు కూతుర్ని. ఆ సాయంత్రం తిరిగి వచ్చిన లావణ్య కస్తూరికి విషయం చెప్పే...

"ఎంతకైనా తగిన పిల్లే! చిన్నప్పటి నుండి అన్నింటికీ తెగింపు, చలాకీతనం ఉండేవి. ఎప్పుడయినా 'ఇలాంటి పని చేస్తుందని' అనుకునేదాన్ని. అయినా అదృష్టవంతురాలు కనుక బంగారంలాంటి భర్తనుసంపాదించుకొంది. నువ్వు ఉన్నావ్ ఎందుకు? నా నుదుట ఏం వ్రాశాడో ఆభగవంతుడు? నీ పెళ్లి చూసే యోగం ఉంటో లేదోనాకు..వచ్చిన ఒక్క సంబంధం అలా తెలిపోయింది. ఖర్మ కాకపోతే ఏమిటి?" అంటూ సాధిస్తున్న తల్లిని విస్తుపోయి చూసింది లావణ్య.

"చిన్నప్పటినుండీ తల్లి ఏ గౌను వేసుకోమంటే అది వేసుకుంటూ, ఏది తినమంటే అది తింటూ వచ్చిన తనకే చీర యిష్టమో కూడా తెలీదే! ఆవిడే తెచ్చేస్తుంది. అదే కట్టుకోవాలి. అటువంటి తను స్వంతంగా భర్తను ఎంచుకోవడమా? జరగలేదు కనుక ఈవిడిలా అంటోంది. అదృష్టమో, దురదృష్టమో జరిగి ఉంటే ఇంకేమన్నా ఉందా? ఏమిటో చిత్రమైన

మనిషి" అనుకొంది లావణ్య.

జరిగిపోయిన సంఘటనలు తలచుకొంటే కాలం గడిచిపోయిందనిపిస్తోంది. కాలగమనానికి సూర్యోదయ సూర్యాస్తమయాలేకాదు అందమైన అనుభవాలు, మరపురాని దుర్ఘటనలు, ఏమీలేని నిస్సారమైన, నిరుపయోగమైన రోజులు.. అన్నీ కలుపుకొంటే ఒక్కొక్కరి జీవితం ఒక్కో విధంగా పొందే మార్పులు తలచుకొంటే కాలం గడిచిపోయిందనిపిస్తుంది. గడిచిపోయింది కూడా.

మల్లిక, మధుకర్ పైచదువులకని 'కెనడా' వెళ్ళిపోయారు. లావణ్య కోసం ఏమీ చెయ్యలేకపోయింది మల్లిక.

అవకాశం అనేది వందసార్లు రాదు. వచ్చిన అవకాశం చేయి జార్చుకొంటే, మరో అవకాశమే పొందలేని స్థితిలోనే కొన్ని జీవితాలు ముగిసిపోతాయి. మరి కొంతమందికి అంతకంటే మంచి అవకాశాలు కూడా రావచ్చు మరోసారి.

అవకాశం వచ్చినపుడు కస్తూరిలోని మితిమీరిన కోరిక ఆ అవకాశాల్ని తన్నుకుపోయింది. ఇపుడు నలభయ్యో పడిలో పడిన కూతుర్ని చూసుకుంటూ, యింకా ఆశవదలని కళ్లతో భవిష్యత్తు వైపు చూస్తూనే ఉంది కస్తూరి.

లావణ్య వయసును మహా యజ్ఞంలా జరుపుకొని వచ్చేసింది. ఇపుడేం లేదు. అలవాటుపడిన ఆ చిన్న ఊరు, తోడి డాక్టర్ల కుటుంబాలు ఎపుడన్నా సినిమాలకు వెళ్ళే వాళ్లతో కలిసి తల్లిని తీసుకొని వెళ్లడం. ఇంకే సరదాలు లేవు. కావలసిన బట్టలవీ, ఏ వాచ్‌మన్‌నో తోడు తీసికొని కస్తూరే వెళ్ళి తెచ్చేస్తుంది.

 

లావణ్య నిరాడంబరత్వం, యాంత్రికంగా పనిచేసుకుపోయే తీరు, అందగత్తె గాకపోవటం, నీడలా వెన్నంటి ఉండే కస్తూరి., యివన్నీ కలసి ఆ పల్లెటూళ్లో లావణ్య జీవితంలో నీలి నీడలేర్పడకుండా చేసాయి. కస్తూరి స్వభావం ఎవర్నీ కలుపుకోనిచ్చేదికాదు. లావణ్య వచ్చాక ఎందరో డాక్టర్లు ట్రాన్స్‌ఫర్లు ట్రైచేసుకుని వెళ్ళిపోయారు. లావణ్యకా అవసరం లేదు. అలవాటయిన ఊరు అని ఊరుకొంది కస్తూరి కూడా. ఆలోచనలు, కోరికలు, కలలు, సరదాలు ఏం లేవు. అపుడపుడు వచ్చే మల్లిక ఉత్తరాలు తుషార బిందువుల్లా బీడువారిన మనస్సుని సోకి ఇంకిపోతుంటాయ్. గవర్నమెంటు వారిచ్చిన ఆ ఉద్యోగంతో రోజులు గడిచిపోతున్నాయనిపించుకొంటుంది. నిస్సారంగా గడిచిపోతున్నాయి తల్లీకూతుళ్ల జీవితాలు. కొత్తలో అంతా ఎక్కడకు వెళ్లినా ఎదురయ్యే "పెళ్లి అయ్యిందా?" అన్న ప్రశ్నలు, ఆపైన వచ్చే వ్యాఖ్యానాలు పాతబడిపోయాయి. యాంత్రికంగా హాస్పిటల్‌కి వెళ్లడం, డ్యూటీ చెయ్యడం, అయిపోగానే యిల్లు, తిండి, నిద్ర అంతే! పై చదువులు చదవమని మల్లిక రాసి రాసి విసిగిపోయింది.

"ఏమిటోనే మల్లికా! జీవితంఎడారిలా అయిపోయింది. చదివి ఏం చెయ్యాలి చెప్పు. నాలాంటి వాళ్లకూడా పైచదువుల కెగబడితే యిలాంటి పల్లెలో ఉండేదెవరు? ఏదో యిలా అలవాటయిపోయింది. ప్రశాంతంగా ఉంది. అయినా చదివి పేరు, డబ్బు సంపాదించి ఏం చెయ్యాలి? ఎందుకు? నీవు, మధుకర్ పిల్లలతో వస్తే ఒక్కసారి జూసి...మళ్ళీ కొత్తజన్మ ఎత్తాలనుంది!" అంటూ విరాగినిలా

జవాబులిస్తుంది లావణ్య.

* * *

ఆ రోజు డాక్టర్ నరేంద్ర వెళ్ళిపోతున్నాడు. అతని స్థానంలో శేఖర్ వస్తున్నట్లు తెలిసిన రోజు లావణ్య మనసులో అట్టడుగున దాగిన జ్ఞాపకాలేవో కలుక్కుమన్నాయి. తరువాత 'యితను ఎవరో' అనేసుకొంది. కానీ జాయిన్ అయిన శేఖర్‌ను చూసి మనసు మూగబోయింది. ఇద్దరికీ పార్టీ యిచ్చి అభినందన, వీడుకోలు సభ ఏర్పాటు చేసారు. శేఖర్ మాత్రం లావణ్యను గుర్తుపట్టలేదు.

"అయినా అతని కెందుకు గుర్తు ఉంటుంది. అతనితో పదిమాటలు మాట్లాడిందనా? అతని మనసులో తనకేమన్నా స్థానం ఉందనా? ఏమని గుర్తు ఉంటుంది? 'విదుల' ఎక్కడ వుందో? ఇద్దరికీ ఒకే చోట వేయించుకోలేదేమో? అదృష్టవంతుడు మల్లికలాగనే. జీవితాన్ని గుప్పెట్లో యిముడ్చుకొన్న మనిషి"... అలా ఆలోచిస్తూ నిద్ర పోయిందా రాత్రి. మర్నాడు హాస్పిటల్‌లో తనను తాను పరిచయం చేసుకోవాలంటే బిడియం అన్పించి ఊరుకొంది. కాని శేఖర్–

"మీరే బాచ్? ఏ కాలేజీ?" అని అడిగినపుడు చెప్పక తప్పలేదు. వినగానే.....

"ఆ...ఆ...మల్లిక మీ ఫ్రెండ్ కదూ చాలా ఏక్టివ్?యిపుడు ఫారిన్‌లో ఉన్నట్లు ఉంది కదూ! మధుకర్‌ని మారేజ్ చేసుకొందిగా..." అంటూ ఉత్సాహంగా అడుగుతూంటే మనసు కలుక్కుమంది. మౌనంగా తలాడించింది. అది చూసిన శేఖర్–

"మీరు అప్పటికీ, యిప్పటికీ ఏం మారనట్టుంది.మీ హజ్‌బెండ్..."అంటూ అర్థోక్తిలో ఆగిపోయిన శేఖర్ మాటను–

"నాకు పెళ్ళికాలేదు...." అంటూ నిర్లిప్తంగా పూర్తిచేసింది.

ఆశ్చర్యపోయాడు శేఖర్.

"ఐ యామ్...ఆల్సో లోన్లీ.'విదుల' తెలుసుగా. మా మారేజి తరువాత చనిపోయింది. ఆమెను దక్కించుకోలేకపోయాను. ఇద్దరు మగపిల్లలు. ఊటీ పబ్లిక్ స్కూల్‌లో జాయిన్ చేసేశాను" అంటూ తన విషయాలు చెప్తుంటే...

"అరెరే..." అంటూ విచారించింది లావణ్య.

* * *

కాంపౌండరు ద్వారా విషయాలు విన్న కస్తూరి మనసులో ఆశలు మొలకెత్తాయి. ఏ వయసయినా కూతురి పెళ్ళి చూడాలన్న తాపత్రయం ఆమెను నిలువనీయడం లేదు. లావణ్యను కదిపితే విసుక్కొంటుందని తనే 'ఎలా ప్రయత్నించాలా?' అని ఆలోచించసాగింది. ఆఖరుకి శేఖర్ 'వంటవాడి' ద్వారా విషయాన్ని కదపాలని నిశ్చయించుకొని ఆచరణలో పెట్టింది. కానీ లావణ్యకేమీ తెలియనివ్వలేదు. వంటవాడి ద్వారా చూచాయగా విన్న శేఖర్‌లో కొత్త ఆలోచన తలెత్తింది. విదుల చనిపోయిన కొత్తలో చాలామంది బలవంతం చేశారు. పిల్లల కోసమన్నా మళ్ళీ పెళ్ళి చేసుకోమని. కానీ ఆ పిల్లలకోసమే అతనా విషయం పట్టించుకోలేదు. ఈ పదేళ్ళూ, విదులతో గడిపిన రోజులు నెమరు వేసుకొంటూ,ఆఅనుభూతుల వరవడిలోకొట్టుకుపోతూ తనను తాను మరచిపోయేవాడు. కానీ ఈ మధ్య ఒంటరితనం అంటే విసుగొస్తోంది. వయసు పైబడుతోంది. అలసి ఇంటికొచ్చేసరికి మనసు విప్పి మాట్లాడేందుకు మరో మనసు కావాలనిపిస్తోంది. వంటవాడు చెప్పిన మాటలు అతనిపై

పని చేశాయి. ఏ బాదరబందీ లేని లావణ్యతోడు దొరికితే మిగిలిన జీవితం ప్రశాంతంగా గడచిపోతుందనిపించింది. బాగా ఆలోచించుకొన్నాక తనే ధైర్యంగా అడిగాడు. ఆ మాటలు విన్న లావణ్య ఆశ్చర్యపోయింది. ఒక్క క్షణం తబ్బిబ్బు అయిపోయిన హృదయం బాధగా మూలిగింది.

ఆశలు అణిగిపోయి, కోరికలు సమాధి కాగా తనేనాడో చరమాంకంలోకి వచ్చేసింది. "ఏదో బ్రతుకుతున్నాం" అన్నట్లు రోజులు వెళ్ళమారుస్తున్న లావణ్యకి మాటలు పన్నీటి జల్లులా అనిపించలేదు. గ్రీష్మంలో కురిసే తడిసీ తడియని జల్లులా తోచాయి.

"నేనేమిటో, నా కులమేమిటో తెలుసుకునే అడుగుతున్నారా ?" మనసు సదిమి పెడుతూ ఏ భావం వ్యక్తం చెయ్యకుండా నిశ్చలంగా అంది.

"లావణ్యా! డోంట్ బి సిల్లీ! ఇద్దరం చదువుకొన్నాం. సంఘంలో ఒక గౌరవ నీయమైన వృత్తిని చేస్తున్నాం. నిన్ను నేను, నన్ను నీవు కించపరచుకునే వయసు కాదు మనది. కులాలు, కట్నాలు అడగడానికి నీకూ, నాకూ ఎవరూ లేరు. ఉన్న ఇద్దరు పిల్లలు దూరంగా ఉండి చదువుకొంటున్నారు. ఒకరికొకరం తోడు కావాలనుకొనీ ,ఒకరి కష్టసుఖాలకు ఒకరం ఆలంబన కావాలనీ, చివరి దశలో ప్రశాంతంగా గడపాలనీఅడుగుతున్నాను. అంతేకానీ నీ కులంతో నాకేం సంబంధం లేదు. నీ కభ్యంతరం లేకపోతేనే! ఇన్నేళ్ళ ఒంటరి జీవితం నీకు మాత్రం తోడు కావాలనిపించడంలే ? అందుకే ఒకరికొకరం తోడుగా గడపాలని అడిగాను" అంటుంటే లావణ్య సంతోషించాలని కూడా మరచిపోయింది.

ఒక వయసులో ఈ మాటకోసమే ఎంతగా తపించిపోయింది తను. ఈ వయసులో అన్ని అనుభవాలు, ఆనందాలు అయిపోయిన అతనితో ముడి పెట్టుకోవాలా ? ఆనాటి తన కోర్కె ఇలా తీరుతోందా ?

"శేఖర్ ఉన్నత కులజుడనీ, ఉన్నతమైన వ్యక్తిత్వం కలవాడనీ, సర్జన్‌గా మంచి పేరున్న వాడనీ, మేధావంతుడనీ తెలుసు. అటువంటివాడు ఇన్నేళ్ళ వసంతం గడచిపోయాక, మళ్ళీ వసంతం కోసం ఎదురు చూసే ఓపికలేనట్లు తల వాల్చిన మొక్కలాగాక వృక్షంలా ఉన్న తనకి 'ఆశ' అనే నీరు పోస్తున్నాడు. ఏమంటుంది ?

ఆ సంగతే మల్లికకు రాస్తే...

"ఆనాడు నీమనసులోని కోరిక ఇలా తీరుతోందన్న మాట. లావణ్యా! మొదటి సారిగా తొలివలపుతో మనసుని స్పందింప చేసిన వ్యక్తి జీవితంలో తోడుగా దొరికితే అంతకన్నా అదృష్టం ఏముంటుంది చెప్పు? కాని విధి నీ పట్ల చిన్న చూపు చూసింది. పోనీలే ఇప్పటికన్నా, ఈ వయసులో చేసుకోబోతున్న పెళ్ళి మనకు తెలిసిన శేఖర్‌తో కావడం సంతోషంగా ఉంది. ఇంక నీ గురించి నిశ్చింతగా ఉండగలను లావణ్యా! 'బేబి, బేబి' అని ఎందుకంటున్నానో తెలుసా ? అమ్మ ఒడిలో ఉన్న బేబీవి కనుక. ఇంక నీవో 'బేబి'కి తల్లివయే రోజులు వస్తున్నాయ్. నీ పరిధి పెంచుకో.నీభర్తకోసం, నీకోసం జీవించు. ఇన్నాళ్లు అమ్మ కోసం బ్రతికావు ఇంక నీ కోసం నీవు బ్రతుకు. నీ జీవితంలో మీ అమ్మ ప్రేమ ఇక ముందు కూడా నీడలా వ్యాపించి నీ జీవితాన్ని చీకటిమయం

 

చేసే అవకాశం రాసివ్వకు. ఇపుడు నీ ప్రేమను ఇద్దరు వ్యక్తులకు పంచాలి. అది నేర్చుకో! ఇంతకన్నా ఏం వ్రాయగలను. నీవు ఆనందంగా ఉంటే సంతోషించే మొదటిదాన్ని నేనే" అంటూ రాసిన మల్లిక సుదీర్ఘమయినలేఖను చదివాక ఏదో భయం చోటు చేసుకొంది మనసులో. అమ్మ మనసు, ఆయన మనసు కష్టపెట్ట కుండా నడచుకోగలదా తను? అదంత తేలికా ?

శేఖర్‌తో లాంఛన ప్రాయంగా మాట్లాడిన కస్తూరి అంతా నిశ్చయం చేసింది. నలుగురి ముందు. వేణుగోపాల స్వామి ఆలయంలో నిరాడంబరంగా జరిగింది పెళ్ళి. తన ఆశలను, సరదాలను, కోర్కెలను చంపుకోక తప్ప లేదు కస్తూరికి. శేఖర్, లావణ్యా కూడా వ్యతిరేకించడంతో మామూలుగానే అయి పోయింది పెళ్ళి. మెడలో దండలతో ఇద్దర్నీ చూడగానే కస్తూరి మనసులో భానుమూర్తి మెదిలాడు. అతనితో తొలి రోజుల అనుభవాలు, అనుభూతులు, అపురూపాలు గుర్తుకు వచ్చి, కూతురు పొందబోయే అనుభవాలకు రూపాన్నిచ్చాయి. జీవితం ధన్యం అయిపోయినట్లు అనుకొంది కస్తూరి.




నలభయ్యేళ్ళుగా ఒక పద్ధతికి, ఒకరి మాటకు కట్టుబడిన లావణ్యాకి జీవితం క్రొత్త. తనపై ప్రతి పనికి ఆధారపడే భర్త... తనకోసం ప్రతి పని అడక్కుండా చేసే తల్లి... ఇదేదో తమాషా ఆటలా అనిపిస్తోంది. ఆలోచించడం మరచి పోయిన మెదడు మొద్దుబారి, ఏ పని చెయ్యాలో తెలియని కంగారు. భర్తతో ఎక్కువ సేపు గడిపితే తల్లి ఎక్కడ "ఒంటరిని చేసేసింద" ని బాధపడు తుందోనన్న బెంగ లావణ్యను కుదురుగా ఉండనివ్వడంలేదు.

అతను అనుభవించవలసిన వయసులో, కోరుకున్న భార్యతో అన్ని ఆనందాలు అనుభవించిన వ్యక్తి. అతనికిపుడు కావల సింది చివరిదశలో 'తోడు' మాత్రమే. కానీ లావణ్యా అలాకాదు. చిన్నతనం వద లని మనసు, తొలిసారి పురుష ని సాంగత్యం, తల్లి చెప్పే మాటలు లావణ్య మనసుని ఉక్రోషపెట్టేవి. హాస్పిటల్ నుండి వచ్చేసిన లావణ్య స్నానం చేసి, బారెడు పూలు పెట్టుకొని ముస్తాబయ్యేది. పెళ్ళి కాకముందు సాదాగా ఉండే లావణ్య ఇపుడు అస్తమానం ఫ్రెష్‌గా ఉండేం దుకు చూస్తుంటే శేఖర్‌కి నవ్వువచ్చేది.

ఆయాలు, నర్సులు చిన్నగా నవ్వుకోవడం గమనించిన శేఖర్‌కి లావణ్యకెలా చెప్పాలో అర్థం కాలేదు. లావణ్య ఈ ప్రవర్తన వెనుక కస్తూరి ప్రోద్బలం ఉందని గ్రహించాక చికాకు పడ్డాడు.

"సింపుల్‌గా ఉంటే నాకిష్టం లావణ్యా! ఈ వయసులో మనకేమిటి చెప్పు. అయినా మనవృత్తిని బట్టి అన్నా మనం హుందాగా ఉండటం నేర్చుకోవాలి. పైపై ఆకర్షణ, అందాలు చూసి కాదుగా నిన్ను చేసుకొన్నది. నాకు కావలసింది

నన్ను ఆదరించి అర్థం చేసుకొని కష్టం, సుఖం పంచుకొనే భార్య. యౌవనంలోలా కమ్మని కలలు కనే వయసుకాదు ఇది. మనం ఒకరిలో ఒకరు చూసుకోవలసింది అందం కాదు. నన్ను అర్థం చేసుకో. మనమధ్య మూడో వ్యక్తి ప్రసక్తి ఉండకూడదు లావణ్యా! భార్యాభర్తలన్నాక ఎన్నో వుంటాయ్, అవి ఒకరికొకరం చేసుకోవలసినవి" మృదువుగా చెప్తున్న భర్త మాటలు క్రొత్తగా అనిపించాయి.. తనలా ప్రత్యేకంగా అలంకరించుకోవడం అతని కిష్టం లేదని మాత్రం స్పష్టం అయ్యింది. మర్నాటినుండి అతనికిష్టమైనట్లు ఉండసాగింది. సాయంత్రం కాగానే కస్తూరి కట్టి తెచ్చిన మూరెడు సన్నజాజి మాలను చూసి... "చిన్నది చాలమ్మా! మిగతాది దేవుడికి వేసెయ్యి!" అంటూ చిన్న ముక్క తుంపి పెట్టుకొంటున్న కూతుర్ని చూసి విస్తుపోయి చూసింది కస్తూరి. "ఏం మీ ఆయన వద్దన్నాడా? ఈ రోజే మొచ్చింది? పువ్వులు పెట్టుకొంటే ఏం? పెళ్ళి కానన్నాళ్ళూ ఏ సరదాలూ లేవు. ఇప్పుడూ అలాగేనా! అతని కన్ని ముచ్చట్లు తీరిపోతే, నీకూ తీరి



పోయినట్లేనా? బాగుంది. ఇవ్వాళ పువ్వులు వద్దంటాడు. రేపు శుభ్రమైన చీర కట్టుకోవద్దంటాడు!" రుసరుసలాడుతూ అంది కస్తూరి.

అదంతా నిజమే అనిపించింది లావణ్యకు. పువ్వులంటే లావణ్యకి



ఎంతోఇష్టం. కాని, "ఎక్కువ పువ్వులు పెట్టుకోకూడదు పెళ్ళికానివాళ్ళు" అని ఎపుడూ సరిగ్గా పువ్వులు పెట్టుకోనిచ్చేది కాదు కస్తూరి. ఇపుడన్నా సరదాగా పెట్టుకొందామంటే భర్తకి ష్టంలేదు. "ఏమిటో జీవితంలో అన్నీ ఉండికూడా ఏదీ పొందకుండానే గడచిపోతోంది !" అనుకొంది.

ఇట్లాగే అతను వెలుపరించే ప్రతి అభిప్రాయానికీ, భార్యాభర్తలు ఒకర్ని ఒకరు అర్థంచేసుకొనే ప్రయత్నానికి కస్తూరి తనకు తెలీకుండానే అడ్డుతగులుతోంది.

"ప్రతి విషయం మీ అమ్మకెందుకు చెప్తావు? మనమధ్య ఇంకేంలేదా?" అని విసుగ్గా శేఖర్ నిలదీస్తే... "ఏం చెయ్యనండీ! అడిగితే చెప్పాను తప్పేముంది ?" అని తేలిగ్గా అనేసే లావణ్యనుచూసి నెత్తి బాదుకొంటాడు 'ఖర్మ' అనుకొంటూ.

* * *

"లావణ్యా! రేపు నా ఫ్రెండ్ ఒకాయన వస్తున్నాడు. అతనితోపాటు డాక్టర్ జాన్, అతని ఫేమిలీ భోజనానికి వస్తారు రేపు రాత్రికి. ఏమేంకావాలో చూసి ప్యూన్‌తో తెప్పించిఉంచు.నువ్వు హాస్పిటల్‌కిరావద్దు. అంతగా అవసరమైతే కబురుపెడతాలే !" అంటున్న శేఖర్ మాటకు అడ్డుతగులుతూ "అంతమందికి అమ్మ వంట చేయగలదా? అడిగి వస్తానుండండి......" అంటూ అతను చెప్పేది వినకుండా తల్లి గదిలోకి వెళ్ళింది. అది విన్న కస్తూరి యింతెత్తున లేచింది.

"భోజనాలు చెప్పేముందు యింట్లో అడగొద్దూ? ఎవరు చేస్తారని చెప్పేశాడు, నేను చెయ్యలేను..." గట్టిగా అంటున్న కస్తూరి మాటలు శేఖర్‌కు వినబడ్డాయి.

"అందుకే వంటవాడిని మాన్పించొద్దన్నాను. నా యింటికి భోజనానికి పిలవటానికి నేను మీ పర్మిషన్ అడగాలా?మీకు మీ యిద్దరే ప్రపంచం కనుక ఇలాంటివేమీ అక్కరలేదు. కానీ నాకు ఫ్రెండ్స్ వస్తారు. వెళ్తారు. రేపు నేను 'కుక్'ని పెట్టి చేయించుకుంటాలెండి, మీ రేం చెయ్యక్కరలేదు" కోపంగా అన్న శేఖర్ సమాధానం విని గొణుక్కుంటూ ఉండిపోయింది. శేఖర్‌లో అంతకోపం ఎన్నడూ చూడని లావణ్య మతిపోయినదాన్లా యిద్దరి మధ్య నిలబడి చూస్తుండిపోయింది. అలా నిలబడ్డ లావణ్యను ఛీత్కారంగా చూసి గదిలోకి వెళ్ళి దఢాలున తలుపు వేసేసుకుని పడుకొన్నాడు. వెళ్ళి తలుపు తీయమనడానికి అభిమానం అడ్డువచ్చి, ఈ గొడవంతకూ మూలకారణమైన తల్లి మీద గొంతు వరకు వచ్చిన కోపాన్ని అణచుకొంటూ నిస్సహాయంగా సోఫాలో వాలిపోయింది. ఆరాత్రి ఆ ముగ్గురూ నిద్ర పోకుండానే తెల్లవారిపోయింది. మర్నాడు శేఖర్ శెలవు పెట్టి దగ్గరుండి వంటవాడినితెచ్చి పట్టుదలగా చేయిస్తుంటే లావణ్య మనసు విలవిల్లాడిపోయింది అతని గాంభీర్యం దగ్గరకు రానివ్వలేదు. తల్లిమీద విసుక్కొంది లావణ్య. దానితో ఏడుపు మొదలు పెట్టింది కస్తూరి. ఏడుస్తూన్న తల్లిని అలావదిలేసి మొహాన్న నవ్వు పులుముకొని వచ్చిన అతిథుల నాహ్వానించింది. మొత్తం మీద భోజనాలు బాగానే అయ్యాయనిపించారు. కాని లావణ్య మాత్రం వారం రోజులపాటు మనశ్శాంతి కోల్పోయింది.

* * *

శేఖర్‌పిల్లలు అనిల్, సునీల్ శెలవులకు

రావడంతో కొత్తసమస్యలు తలెత్తాయి. మొదటి నుండి తను, తన కూతురు. అన్న గిరిగీసుకొని బ్రతుకుతున్న కస్తూరికి ఆ పిల్లలు పెద్దప్రతిబంధకాలుగా, తనకూతురు భవిష్యత్తునుమింగే కాలనాగుల్లా కనుపించ సాగారు. పైగారెండో పెళ్లి వలన కూతురి జీవితంలో పెద్దగాఆనందంలేదని గ్రహించి తట్టుకోడానికి మనసు కూడదీసుకోలేక పోతోంది. పిల్లలు వచ్చిన దగ్గరనుండి వాళ్ళని స్వేచ్ఛగా తిరగనివ్వక పోవడం, తండ్రి దూరం అయిపోయినట్లు వాళ్ళని రానివ్వకపోవడం, అడపాదడపా కస్తూరి విసిరే విసుర్లు శేఖర్ మనసుని ముక్కలు చేసాయి. లావణ్య నిస్సహాయ స్థితిపై జాలికి బదులు అసహ్యం కలగసాంది.

"లావణ్యా, హాస్పిటల్ పక్కనున్న కరణంగారిల్లు ఓ పోర్షన్ ఖాళీగా వుంది. నేను, పిల్లలు అక్కడికి వెళ్తామనుకొంటు న్నాను. నీకిష్టమైతే నాతోరా, లేకుంటే యిక్కడే మీ అమ్మ దగ్గర ఉండు. పిల్లలు యింటికివచ్చేసరికి వాళ్ళకి ఆదరణ, ఆప్యా యత అందిస్తావని నిన్ను చేసుకొన్నాను కానీ యిలా స్వార్థంతో మీరు నన్నుకూడా దూరంచేసే ప్రయత్నం చేస్తారనుకోలేదు. ఎందుకీ చదువు, సంస్కారం లేకపోయాక? ఛీ...ఛీ...నేరక చేసుకొన్నా నీ పెళ్లి..." చీత్కరిస్తున్న భర్తవంక కళ్ళనీళ్ళతో చూసింది లావణ్య.

ఏడుస్తూ పడుకొన్న లావణ్యను చూసి "ఏమ్మా? ఏం జరిగింది?" అంటూ ఓదార్చబోతే అతను అన్న మాటలు చెప్పి బావురుమంది లావణ్య.

కస్తూరి గుండెల్లో అగ్ని పర్వతాలు బ్రద్దలయ్యాయి. తన కూతుర్ని తన నుండి దూరం చేసి, అమాయకురాలైన కూతుర్ని వంచించి ఏదో చేసేస్తాడన్న భావం మనసులో నాటుకొంది. అది పెరిగి మహావృక్షమై మనిషిని ఒక చోట నిలుప నీయ పోయేసరికి తన కూతుర్ని తను చివరి క్షణం వరకు రక్షించుకోవాలన్న నిర్ణయానికి వచ్చేసింది.

అదే సమయంలో ఏటిగట్టున కూర్చు న్నాడు శేఖర్. "హు లావణ్య! పేరుకు తగినట్లు మనిషి ఉండకపోయినా, మనసు అన్నా ఉంటుందనుకొన్నాడు. ఇదెక్కడి చిత్రం? ఇంత వంటరి మనుషులు ప్రపంచంలో ఎవరన్నా ఉంటారా? తల్లి... ఆవిడ తల్లేనా? కూతురి జీవితం బాగు పడేటట్లు చేసి, చెప్పి...భర్త అడుగు జాడల్లో నడవమని చెప్తారు ఎవరన్నా... కానీ ఈమె ఏం చేస్తోంది? తనేది చెప్తే అదే చెయ్యకుండా చేస్తుంది. ఏది చెప్పినా తనున్నంత వరకు "అవునండీ, నిజమే నండీ" అన్న మనిషి తను బయటనుండి వచ్చేసరికి మరో రకంగా మాట్లాడుతుంది. తను చెప్పినట్లు చెయ్యడం వలన కూతురు తనకు దగ్గరైపోయి తల్లిని నిర్లక్ష్యం చేస్తుందన్న భ్రమలో ఉంది కస్తూరి. బ్రతికినన్నాళ్ళు ఆ భర్త ఎలా భరించాడో ఈ మహాతల్లిని. యిదొక సైకాలజీ... ఏ ట్రీట్‌మెంట్ పని చెయ్యని సైకో పేషంట్...యింతే! ఆవిడ ఉన్నన్నాళ్ళు యిది భరించక తప్పదు. ఇంత చదువు కొన్న డాక్టరైనా లావణ్య మనసు వికసించక పోవడానికి కారణం ఇదే! ఆమె మెత్తని మనసే ఆమె శత్రువు. తనకూ చెప్పలేక, తల్లికీ చెప్పలేక మధ్యన నలిగి పోతోంది. స్వతహాగా ఆలోచించే శక్తి లేదు మనిషికి. చిన్నతనం నుండి ఆ తల్లి పెంపకం అలాంటిది మరి. అయినా యిప్పుడు అంత గొడవలేమున్నాయ్?పరి ష్కారం కానంత చిక్కు సమస్యలు ఏమి

ఉన్నాయ్? గోరంతలు కొండంతగా చేసే కస్తూరి స్వభావం యిన్నింటికీ మూల కారణం. ఎవరూలేని ఒంటరి వాళ్లు. తనకూ ఓ తోడు కావాలని కోరి చేసుకొన్నాడు తప్ప ఇంత సంకుచితత్వం కల మనుషు లని తెలియదే! పిల్లలు, తన పిల్లలుకాదను కొంటే ఎలా అవుతుంది? తెలిసి చేసు కొన్నప్పుడు. పోనీ సాటి స్త్రీగా నన్నా ఆదరించవచ్చునే. ఈ పెళ్ళి వలన తనకు, పిల్లలకు ఓ ఆలంబన, ఆత్మీయత లభిస్తా యని భ్రమపడ్డాడు. తను చాలా పొర పాటు చేసాడు. ఈ పది సంవత్సరాలుగా కలగని బుద్ధి యిప్పుడెందుకు కలగాలి? అలా అనంతంగా ఆలోచిస్తున్నాడు శేఖర్.

"బాబూ... అమ్మగారు రమ్మంటు న్నారు..." అని హాస్పిటల్ బాయ్ వచ్చి పిలిచే వరకూ చీకటి పడిందన్న సంగతి గుర్తించనేలేదు శేఖర్.

అతను ఆ హాస్పటల్‌కి ఛీఫ్. తోటి డాక్టర్ల ముందు మేధావి. ఊరి ప్రజలకు మంచి డాక్టరు. స్టాఫ్ దృష్టిలో నిరా డంబరుడు. ఎంత క్లిష్టమైన కేసునన్నా బాగుచెయ్యగల ధీశాలి. కానీ...కానీ అతనూ మామూలు మనిషే. ఒక భార్యకు భర్త, పిల్లలకు తండ్రి, ఒక యింటికి అధి కారి, ఒక సంసారానికి చుక్కాని. కానీ భార్యను అర్థం చేసుకొని సుఖ శాంతులు పొందడానికి మాత్రం ఇవేవీ పనికి రావడం లేదు.

పిల్లలకు శలవులయిపోతున్నాయని ప్రయాణ సన్నాహంలో వున్నారు. వేరే వెళ్ళిపోతామని అన్నాడుగాని ఆ చిన్న ఊళ్ళో భార్య ఒక దగ్గర, భర్త ఒక దగ్గర ఉంటూ తలదించుకొని తిరిగే బదులు, పిల్లలు వెళ్ళిపోయేవరకు ఓపిక పట్టి ఆ తరువాత ట్రాన్స్‌ఫర్‌కి పెట్టుకో వాలని అనుకొని ఊర్కొన్నాడు.

"లావణ్యా! ఈ రోజు హాస్పిటల్‌కి రాను. నువ్వు చూసుకో! పిల్లలకు బట్టలవీ కొనాలి. టౌనుకు వెళ్ళి వస్తాము..." తయారవుతూ చెప్తుంటే విన్న కస్తూరి సహించలేకపోయింది.

"అతనికంత లెక్కలేకపోవడమేమిటి? ఏం నిన్నుకూడా తీసుకువెళ్ళొచ్చుకదా! పిల్ల వెధవలకు 'కొని పెట్టొద్దు' అంటామా? ఇలా వేరుగా పరాయిదాన్లా చూస్తే వాళ్ళకి మాత్రం ఎలా వుంటుంది. ఇద్దరూ కలిసి వెళ్ళి సరదాగా కొనిపెడితే వాళ్ళకి ఎంత 'యిది' గా వుంటుంది. అదేంలేదు. ఎంతసేపూ తన ఆలోచనలు తనవే, ఇవతల మనిషి గురించి ఆలోచన వుండదు. అలాంటపుడు పెళ్ళెందుకు చేసుకోవాలి"

డ్యూటీనుండి వచ్చాక టీ ఇస్తూ పక్కనే కూర్చుని చెప్పిన తల్లి మాటల వెనుక నిజం ఉందనిపించి మనసు ముడుచుకుపోయింది లావణ్యకి.

రాత్రి తొమ్మిది గంటలకు తిరిగి తిరిగి వచ్చినవాళ్ళకి ముభావంగా వడ్డిం చింది. "ఏమండీ... నన్ను రమ్మంటే వచ్చేదాన్నిగా, నాకుమాత్రం సరదాగా ఉండదూ!" ఉపోద్ఘాతంగా అంటూ పక్కన కూర్చొంది లావణ్య. ఏదో సమాధానం చెప్పబోయేంతలో, హాస్పిటల్ బోయ్ వగుగెత్తుకు వచ్చి "ఊళ్ళో కొట్లాట జరిగింది, దెబ్బలు తగిలిన వాళ్లను తీసుకొచ్చారని" చెప్పాడు వగ రుస్తూ. వినగానే ప్రసన్నవదనంగా బయలు దేరి "నువ్వూరా" అన్నాడు శేఖర్.

"నేనెందుకు? అసిస్టెంట్ జాన్ వున్నాడు కదా! డ్యూటీలో సిస్టరుం టుంది. అంతగా అవసరమైతే కబురు

చెయ్యండి..." ఉదయం నుండి విసిగి పోయిన లావణ్య నీరసంగా అంది.

డ్యూటీ నిర్లక్ష్యం చేస్తే దేవుడినైనా క్షమించలేడు శేఖర్. లావణ్యలో అతనికి నచ్చని గుణం అదొకటి. ఒక్కనాడూ ఉత్సాహంగా రాదు హాస్పిటల్ కి. యాంత్రికంగా రావడం "ఏదో తప్పదు" అన్నట్లు పనికాగానే ఠంచనుగా వచ్చేయడం. పల్లెటూరు కనుక సరిపోతోంది.

హాస్పిటల్లో పరిస్థితి చూసాక శేఖర్ కి లావణ్య రాకపోవడం అవమానమనిపించింది. అందుకే ఒక అధికారిగా "అర్జంటుగా రమ్మని" కబురు పెట్టాడు. విసుక్కొంటూ తల్లికి చెప్పి బయలుదేరింది. మెట్లు దిగుతుండగా తల్లి విసుక్కోవడం స్పష్టంగా వినిపించింది. బండబారిన మనసుకు ఏమనుకోవాలో తోచలేదు.

* * *

పిల్లలు వెళ్ళిపోయాక సగం మనశ్శాంతి లభించింది. కానీ ఇంట్లో పరిస్థితి మాత్రం మామూలే! ఆ రోజు ఉదయమే హాస్పిటల్ పనిమీద టౌనుకు వెళ్ళాడు శేఖర్. లావణ్యకి జ్వరం వచ్చింది. ఆ రాత్రి అతను రాకుండానే పడుండని కబురుపంపేసాడు. డాక్టర్ జాన్ వచ్చి చూసివెళ్ళాడు. గాని లావణ్య మానసికంగా బలహీనంగా ఉండడంతో జ్వరంలో 'భర్త ఎక్కడ విడిచి వెళ్ళిపోతాడో' నన్న తపన కలపరింతల్లోకి దించింది. ఇంక కస్తూరి గాభరా అంతా ఇంతా కాదు.

"ఇలాంటి సమయంలో వదిలి వెళ్ళిపోయాడు. ఖర్మ కొద్ది దొరికాడు" అంటుంటే లావణ్య నోరెత్తలేకపోయింది. ఆ మర్నాడు వచ్చిన శేఖర్ ని దగ్గరకన్నా వెళ్లనివ్వలేదు కస్తూరి. "బాబూ, నా కూతుర్నిలా బ్రతకనివ్వు. నీకో నమస్కారం. దాన్నెందుకింకా పీడిస్తావు. నువ్వన్న మాటలకి, వెళ్ళిపోతానన్న బెదిరింపులకు అది హడిలిపోయి యిలా తెచ్చుకుంది. ఇలా కూడా బ్రతకనివ్వవా?" అంటూ గదికడ్డంగా నిలబడి అరుస్తూంటే హతాశుడై నిలబడిపోయాడు. ఈ సంఘటనతో శేఖర్ మనసు కకావికలమయిపోయింది. మొదటి భార్య ఉన్నపుడు ఏనాడూ అతని సుఖ సంతోషాలకు లోటు కలుగలేదు. పదేళ్ళపాటు నిశ్చింతగా గత స్మృతులతోగడిపిన శేఖర్ కి లావణ్యతో జీవితం వింతగా అనిపించసాగింది. ప్రతిదీ సమస్యగా, పరిష్కరించలేని సమస్యగా అనిపిస్తోంది. ప్రతి చిన్న విషయానికి సంజాయిషీ చెప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడ్డంతో తన మీద తనకే అసహ్యం వేస్తోంది. "ఎందుకీ చిత్రవధ? సంఘంలో గౌరవనీయ వ్యక్తిగా గుర్తింపబడిన తనకీ వ్యథ, ఆవేదన దేనికి? మంచితనానికి తావులేనియింట్లో..తనే సుఖ శాంతులు కోరి ఈ పెళ్ళి చేసుకున్నాడో అవే కరువై పోయాక క్షణం క్షణం నరకంలా ఉన్న యింట్లో ఎందుకు గడపడం?" అనుకొన్నాడు. బరువు బాధ్యతలతో కాలవాహినిలో కొట్టుకు వచ్చి అలసిపోయిన అతనికి కాలానికి ఎదురీదే ఓపిక లేనట్లు అనిపించింది. అందుకే మళ్ళీ ఒంటరితనంలోకి దూరంగా వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

* * *

పదిహేను రోజులు పోయాక ట్రాన్స్ ఫర్ ఆర్డర్స్ పట్టుకొని ఇంటికి వచ్చి చెప్పాడు. అది విన్న లావణ్య లబోదిబోమంది.

"ఏమండీ ! నన్ను అన్యాయం చేసి

వెళ్లిపోకండి. మీరొక దగ్గర, నేనొక దగ్గర ఎలాఉంటామండీ. మిమ్మల్ని విడిచి నేనుండలేను. అసలు తెలీకుండా ట్రాన్స్ఫర్‌కి పెట్టుకొన్నారా?" పడుకోబోతూ వెక్కి వెక్కి ఏడ్చింది లావణ్య.

"ఆ ఏడుపేదో మీ అమ్మ దగ్గర ఏడువ్?'' కసిగాఅనుకొంటూ, బయటకు మాత్రం గంభీరంగా...

"ఎందుకు లావణ్యా, ఏడుస్తావ్? నా మనసు పూర్తిగా వికలమై పోయింది. అయినా ప్రేమాభిమానాలు పంచియిచ్చే తల్లి ఉంది నీకు. దూరంగా ఉంటేనన్నా ప్రేమాభిమానాలు ఎక్కువవుతాయేమో! దగ్గర ఉండి ఏం లాభం? మొన్న జ్వరంలో ఉన్న నిన్ను చూడలేక ఎంత చిత్రహింస అనుభవించానో నీకెలా తెలుస్తుంది? ఇలాంటి పరిస్థితుల్లో, ఎక్కడున్నా ఒకటే. నా హృదయంలో నీకు ఎపుడూ స్థానం ఉంటుంది. నిన్ను, నీ అమాయకత్వాన్ని చూస్తుంటే ఎంతో జాలి. కాని దానికి కట్టుబడిపోయి నాకు నేను బలి కాలేను లావణ్యా..." అంటూ చెమర్చిన కళ్లను పక్కకు తిరిగి వత్తుకొన్నాడు.

ఆ విషయం తెలిసిన కస్తూరి గొడవ అంతా యింతా కాదు. "యిలా అర్థాంతరంగా దాని గొంతుకోసి పోవడానికా చేసుకొన్నాడు" అంటూ ప్రారంభించింది. కాని ఒక్క మాటకు సమాధానం చెప్పకుండా శేఖర్ ప్రయాణ సన్నాహం చేసుకొంటూంటే నిస్సహాయంగా

చూస్తూ వుండిపోయింది లావణ్య. ఆయన్ని ఆపే శక్తి మాత్రం తనకు లేదని తేలిపోయింది.

"అమ్మా... ఆయనకు కావలసిన మనశ్శాంతి అక్కడ దొరికితే, అక్కడికే వెళ్లనీమ్మా... మననుండి పారిపోయే పరిస్థితిని మనమే చేసుకొన్నాం. ఇంక బాధపడి ఆయన్ని అనుకోవడం దేనికి? తోటి ప్రయాణీకుడు కలిసినట్టు కలిసారు. మన 'బోర్' భరించలేక పక్క కంపార్టుమెంటుకి మారిపోతున్నారు. మనమే మని అపుతాం!" భర్తను ట్రెయిన్ ఎక్కించి నిర్లిప్తంగా అంటున్న కూతురి మాటలు విని ఇంతెత్తున లేచింది కస్తూరి.

"అయితే... నా వలన అతను వెళ్ళిపోయాడంటావా? అనవే అను. అందుకే ఆయన నీకు అప్పచెప్పి వెళ్లిపోయారు. నీకు మొదటనుండి నన్ను అనడం తప్ప మరేం చేతనవును. కట్టుకొన్న మొగుణ్ణి నిలబెట్టుకోవడం చేతకానిదానివి నన్ననక ఏం చేస్తావ్?" అంటూ కేకలు వేసింది.

"ఇంకెందుకమ్మా గొడవ. అయిందేదో అయింది. నాకు నీవు, నీకు నేను యథాప్రకారం మిగిలివున్నాం. ఇలా జరిగి పోనీ...!" అనేసి హాస్పటల్‌కి వెళ్లిపోయింది లావణ్య.




'కావాలనుకొన్నది పొందలేదని' బాధ పడినన్నాళ్ళు సాగలేదు కూతురి కాపురం. పెళ్ళి అయినందుకు నిదర్శనగా 'ఒక నలుసు' కలిగినా బాగుండును అన్న కోరిక కోరికగానే ఉండిపోయింది. పెళ్ళయిన అయిదేళ్ళకే పెళ్ళయినట్లు మరచిపోవలసి వచ్చింది. ఇలా జరుగు

తుందని ఏనాడూ అనుకోలేదు. చిగురించి పూలు పూస్తుందనుకొన్న మొక్క ఒక్కసారి వాడి నేల రాలిపోయినట్లు అయిపోయింది. అది భరించలేని చేదునిజం. అప్పటికే వార్థక్యం, అనారోగ్యం, ఆక్రమించాయి మనిషినీ, మనసునీ. మానసికంగా చాలా కృంగిపోయింది కస్తూరి. ఏ కూతురికోసమైతే చిన్నప్పటినుండి అహర్నిశలు తాపత్రయపడిందో, ఆ కూతురికి తానేమీ చెయ్యలేని స్థితికి చేరుకొన్నానని గ్రహించిన క్షణంలోనే కస్తూరి మానసికంగా చనిపోయింది.

భర్త వెళ్ళిపోయాడనే బాధగానీ, తల్లి పరిస్థితిగానీ ఏమీ అనిపించని నిర్వికార పరిస్థితిలో ఉన్న లావణ్యను మల్లిక వస్తున్నానని రాసిన ఉత్తరం చైతన్యవంతం చేసింది. ఏడు సంవత్సరాల తరువాత తిరిగి వస్తోంది మల్లిక.

తుషార సమీరంలా మల్లిక పిల్లలతో రానే వచ్చింది. ముత్యాల్లాంటి యిద్దరు పిల్లలు. మల్లిక జీవితాన్ని పరిపూర్ణం చేశారు అనిపించేలా ఉన్నారు చూస్తుంటే.

రాగానే విషయం విన్న మల్లిక ఆశ్చర్యపోయింది. "లావణ్యా! నీ జీవితంలో ఏ నీడయితే పడకూడదని నేను అన్ని సంవత్సరాలు తాపత్రయపడ్డానో ఆ నీడ నీ జీవితాన్ని చీకటి మయం చెయ్యక మానలేదు. కానీ లావణ్యా! మనచదువయ్యాక నువ్వుమారిపోయావనుకొన్నాను. నిన్ను నువ్వు రక్షించుకొనే స్థితికి వచ్చావనీ, నీ బ్రతుకుబాటను పూలబాటగ చేసుకొంటావనీ ఆశించాను. కానీ... కానీ చేతులారా నాశనం చేసుకొంటావనుకోలేదు" అంటూ ఆవేదన చెందింది.

తల వంచుకొని కూర్చుంది లావణ్య. మంచంమీద అనారోగ్యంతో ఉన్న కస్తూరి "చూడమ్మా! దాని బ్రతుకు ఎలా బండలుచేసి పోయాడో! పెళ్ళికాకున్నా బాగుండేది. ఒకటే ఏడుపు మిగిలేది!" అంటూ ఏడుస్తుంటే ఏమాత్రం జాలి కలగలేదు మల్లికకు. ముభావంగా ఉండిపోయింది.

"లావణ్యా! నేను గుంటూరు వెళుతున్నాను. శేఖర్‌ని కలుస్తాను. మళ్ళీ వస్తాను" బ్రెయిన్ ఎక్కుతూ చెప్తున్న మల్లికను వద్దని వారించలేకపోయింది లావణ్య.

* * *

"మల్లికా! ఎన్ని విషయాల్లో నేను సరిపెట్టుకొందామనుకొన్నా తను నాకేం సహకరించకపోతే నేనేం చెయ్యను? ఏది సహించినా లావణ్యలోని వ్యక్తిపట్ల నిర్లక్ష్యం మాత్రం సహించలేకపోయాను. మల్లికా! డాక్టర్‌కి ఉండవలసిన లక్షణం ఒక్కటీలేదు. ఒక సామాన్య వ్యక్తిగా అలా ఎలా ఉంటుందో నాకు అర్థంకాదు. అసలు ఎలా చదివిందో, ఎలా పాసయ్యిందో ఆశ్చర్యంగా ఉంది. ముఖ్యంగా ఆ తల్లికి దూరంగా ఉంటేగాని తనూ ఓ మనిషి అన్న సంగతి గుర్తుండదు. ఎలా?" అంటున్న శేఖర్‌కిఏమనిసమాధానం చెప్పాలో తోచనిదానిలా పేపర్‌వెయిట్ తిప్పుతూ కూర్చుండిపోయింది మల్లిక.

"అది కాదు డాక్టర్...మీకు తెలీదు పసితనం వదలని లావణ్యలో దైవత్వం ఉంది. అందుకే చిన్నతనం నుండి స్నేహం చేశాను డాక్టర్. ఆ తల్లి నుండి తప్పించి లావణ్యను ఒక మనిషిగా చెయ్యాలని నేనెంతో తపన పడ్డాను. నేనాశించినట్లుగానే చదువుకునే రోజుల్లో హాస్టల్లో ఉన్నపుడు మారిపోయింది. ఆ మార్పు చూసి సంతోషించాను. నాకన్నా

తనే ఇంట్రస్టుగా చదివేది. ఇంకా చదవాలని, మంచి డాక్టర్ కావాలని కలలు కంది. కాని సడెన్‌గా వాళ్ల నాన్నగారు పోయారు. తల్లి నిస్సహాయతకు తలవంచి ఆమె చేతిలో మొదటిలాగే మైనపు ముద్దయిపోయింది. డాక్టర్! నిజంగా లావణ్య మైనపు ముద్దవంటిదే. దాన్ని మనకెలా వీలయితే అలా మలచుకోవచ్చు. అలా చేయలంటే ముందు ఆ ముద్దను



చేజిక్కించుకోవాలి కదా! మీరు ఒక డాక్టర్. సైకాలజీ మీకు తెలియంది కాదు. ఒక భర్తగా కాకుండా, ఒక డాక్టర్‌గా ఆమె బాధ్యత స్వీకరించండి. ప్లీజ్. జీవితమంతా చీకటిలోనే తడుముకొంటూ ప్రయాణం చేసింది యింతవరకూ. మీరు దాని జీవితాన్ని కాల్చేయకండి. మీకన్నా ఎక్కువ 'తోడు' అవసరం దానికి. సాటి మనిషిగా ఆదరించండి. అసలా జాబ్ రిజైన్ చేసి వచ్చేయమంటాను. మీరు సంపాదించేది చాలదా? చరమాంకమన్నా సుఖాంతం కానివ్వండి!" ప్రాధేయ పూర్వకంగా అంటున్న మల్లిక మాటలు శేఖర్‌ని ఊపేసాయి.

"మల్లికా...లావణ్యను లావణ్యగానే ఆహ్వానించడానికి నాకెపుడూ అభ్యం



తరం లేదు" అన్న మాట తీసికొని నిశ్చిం తగా కదిలింది అక్కడినుండి మల్లిక.

* * *

ఎటువంటి క్లిష్టమైన ప్రశ్నకన్నా జవాబు దొరుకుతూనే ఉంటుంది. లావణ్యా జీవిత ప్రశ్నల పత్రంలో జవాబు దొరకని ప్రశ్నకు స మా ధా నం దొరికినట్లయింది సడెన్‌గా తల్లి పోవడంతో

ఏ కూతురిని చివరి వరకూ రక్షించాలనుకొని తాపత్రయపడిందో, ప్రాణానికి ప్రాణంగా చూసుకొందో ఆ వ్యక్తినీ లోకంలో ఒంటరిగా వదిలిపెట్టి వెళ్ళిపోయింది కస్తూరి. కూతురి చేయి పట్టుకొని కన్నీరు నింపుతూ ఏమీ చేయలేని, చెప్పలేని నిస్సహాయస్థితిలో వెళ్ళిపోయింది కస్తూరి. తల్లిదండ్రుల దగ్గరున్న మల్లికకు కాంపౌండరు చేత టెలిగ్రాం ఇప్పించింది లావణ్య.

మల్లిక వచ్చేంతవరకు ఎంత నిర్వికారంగా, నిర్లిప్తంగా కూర్చుందో మల్లిక వచ్చాకకూడా అలాగేచూస్తూ కూర్చుండిపోయింది లావణ్య. జరుపవలసిన కార్యక్రమాలు యధావిధిగా మల్లికే జరిపించింది. తల్లి శవాన్ని తీసుకుపోతుంటే అసలు ఏడవనన్నా ఏడవని కూతుర్ని చూసి ముక్కుమీద వేలేసుకొన్నారు ఊళ్ళో జనం.

"మల్లికా! నేను ఫ్రీబర్డ్‌ని.మల్లికా...నేను స్వేచ్ఛాజీవిని.నా యిష్టమే అంతా.ఆదివద్దు ఇదివద్దని చెప్పడానికి ఇహ అమ్మ లేదు కదూ!ఆయన నన్నువదిలేసివెళ్ళిపోయారు. అమ్మ కూడా వెళ్ళిపోయింది. నా యిష్టమే అంతా" అంటూ నవ్వుతున్న లావణ్య ఏస్థితిలో ఉందో గ్రహించడానికి మల్లికకు ఎక్కువ సమయం పట్టలేదు.

* * *

లావణ్యను తీసుకొని శేఖర్ దగ్గరకు బయలుదేరింది." డాక్టర్! మీ కిచ్చిన మాట ప్రకారం లావణ్యను లావణ్యగానే మీ కప్పచెప్తున్నాను. తల్లిపోయిన షాక్‌లో నుండి తేరుకోలేదింకా. మీరే ఈ పసి పాపను లాలించి సాకాలి. విరిగిన బొమ్మ యిది. దీన్ని రిపేరు చేసుకోవాలి. మీకు చేతనవును కదా చేసుకొంటారని తెచ్చాను" అంటూ లావణ్య చేతిని అతని చేతిలో పెడుతుంటే తనకేమి పట్టనట్టు కూర్చుంది లావణ్య.

"మల్లికా థేంక్స్ మల్లికా! అమాయకురాలైన ఈ పసిపాపను పెంచుకొంటాను. నా కోసం బ్రతికించుకొంటాను. ఇపుడు నా చదువుకి సార్థకత లభించిందనుకొంటాను" అంటూ లావణ్య భుజంచుట్టూ చెయ్యివేసి జాగ్రత్తగా నడిపిస్తూ తీసుకు వెళ్ళి మంచం మీద పడుకోబెట్టాడు శేఖర్. వెనుకనే వెళ్ళిన మల్లిక ఆనందం నిండిన మనసుతో...

"డాక్టర్! మీరు నిజంగా మానవాతీతులు. థేంక్యూ డాక్టర్...థేంక్యూ. మీ చేతుల్లో పడిన లావణ్య అదృష్టవంతురాలు. మీ చల్లని నీడలో దాని బ్రతుకు సార్థక మవుతుంది. త్వరలోనే కోలుకుని మీరు కోరుకున్న శాంతిని మీకు ప్రసాదిస్తుంది. ఎవరి మనసూ నొప్పించని దేవత అది. కనీసం ఈ పనన్నా దాని కోసం చెయ్యగలిగినందుకు, సరిగ్గా సమయానికి యిక్కడ వున్నందుకు నా జన్మ ధన్యమైందనుకుని సంతృప్తి పడతాను..." అంటున్న మల్లిక చేయి నొక్కింది లావణ్య. 

# బిల్లిచ్చేపులి

జంతువులచేత గిమ్మిక్కులు చేయించి ప్రేక్షకుల్ని అలరించి డబ్బులు గుంజే ఘనత వహించినసినీదర్శకులు, సర్కసు కంపెనీలవాళ్ళున్నారు. కానీ పెద్దపులి చేత పెట్రోలు బిల్లు ఇప్పించిన ఘనత వాషింగ్టన్‌కి చెందిన జిమ్‌వాట్‌కి దక్కుతుంది.

వాషింగ్టన్లోని బాక్స్‌లో ఇతనికో పెట్రోలు బంకు వుంది. ఇతనికో పెద్దపులి అసిస్టెంటుగా వ్యవహరిస్తుంది. పెట్రోలు పోయించుకున్న వ్యక్తి దగ్గర్నించి డబ్బులుతీసికెళ్ళి మిగతాచిల్లర,బిల్లుతిరిగి తెచ్చిస్తుంది. కొత్త కస్టమర్లు భయపడినా గాని పాత కస్టమర్లకి ఇది అలవాటయి పోయింది. పైగా ఇదొక ప్రత్యేక ఆకర్షణగా కూడా రూపొందింది. చిన్న పిల్లలకి మరీను. 'నాన్నా టైగరున్న పెట్రోలు బంకులో పెట్రోలు పోయించుకో నాన్నా' అని రికమండ్ చేస్తున్నారు.

ఒకటి రెండుసార్లు చెప్పగానే ఆకళింపు చేసుకుంటుందా పులి. జిమ్‌కి కావల్సిన ఫైల్స్‌ని నోటితో కరుచుకుని తెచ్చిస్తుంది. నేలమీద ఏదైనా చెత్త పడివుంటే భద్రంగా తీసుకుపోయి చెత్త బుట్టలో వేస్తుంది. అలా అని ప్రతీది చెత్తగా భావిస్తుందనుకుంటే పొరపడ్డారన్నమాటే. చిత్తుకాగితానికీ, కరెన్సీనోటుకీ తేడా బాగాతెలుసు. ఓసారి ఓ కస్టమరు ఐదుడాలర్ల నోటును నేలమీద జారవిడిస్తే టైగర్ జాగ్రత్తగా తీసికెళ్ళి యజమాని కందించింది.

అన్నిటికంటే వింత ఏమిటంటే బ్యాంకులో డబ్బుకట్టడానికి వెళ్ళేటపుడు టైగర్ని కూడా తీసుకువెళ్తాడు జిమ్‌వాట్- డబ్బు సంచీని నోట కరుచుకుని అతన్ని అనుసరిస్తుంది. జిమ్ బ్యాంకు బైట కార్లో విశ్రాంతి తీసుకుంటుంటే టైగర్ వెళ్ళి డబ్బు జమచేస్తుంది. అక్కడెవరూ దాన్ని చూసి భయపడరు సరిగదా మామూలు తేదీకి వచ్చి డబ్బు జమకట్టకపోతే ఏమిటింకా టైగరు రాలేదు అనుకుంటారు



బ్యాంకువాళ్ళు. టైగర్ వాళ్ళ రెగ్యులర్ కస్టమర్.

ఈ టైగర్ పేరు ప్రఖ్యాతులు చాలా దూరం వ్యాపించాయి. టైగర్ పని చేస్తుండగా చూడ్డానికి ప్రత్యేకించి ఎంతో మంది టూరిస్టులు వస్తూంటారు. జిమ్ పెట్రోలు బంక్‌కి రెగ్యులర్‌గా వచ్చే ఓ కస్టమరు ప్రతిఏటా ఖరీదైనమంచి బహుమతిని టైగర్‌కి ఇస్తూవుంటాడు.



# బాధ్యత

దేశ నాయకుడు కాకపోతే పోనీ కనీసం ఓ ట్రేడ్ యూనియన్‌కన్నా అదీ కాక పోతే ఓ చిల్లర గుంపుకన్నా నాయకుడ వాలని కలలుగనని వారుండరు. అయితే బాధ్యత మాట వచ్చేసరికి కష్టకాలాల్లో నమ్ముకున్నవారిని నట్టేట్లో ముంచడం మళ్ళీ మామూలే. జంతువులు మాత్రం అవసరమైతే ప్రాణాలు వదలడాని



క్కూడా సిద్ధపడతాయి. అలాంటి సంఘటనే 1894లో సెప్టెంబరు 17న మలేషియాలోని పెరక్ రాష్ట్రంలో జరిగింది. దీనికి గుర్తుగా ఆ స్థలంలో జ్ఞాపకార్థం ఒక బోర్డు వందేళ్ళ నుంచి నిలిచి వుంది.

పెరక్ రాష్ట్రంలో తాపారోడ్, తెలుకన్సన్‌ల మధ్య 40 మైళ్ళ దూరంగల రైలు మార్గం వుంది. ఈ రైలు మార్గం అడవి జంతువులు స్వేచ్ఛగా తిరిగే ప్రాంతంగుండా వెళుతుంది. రైలు మార్గం పడినప్పటి నుంచీ అక్కడ తిరిగే జంతువులు కొత్త ప్రదేశాలకి తరలి పోవాల్సి వచ్చింది. అందుకని రైలు డ్రయివర్లు క్రూర జంతువుల భయం లేకుండా స్వేచ్ఛగా ఫుల్‌స్పీడ్‌తో బండి నడిపేవారు.

1894 సెప్టెంబరు 17న పగలు ఓ రైలు వేగంగా ఆ దారిన ప్రయాణిస్తోంది. కనుచూపు మేరలో రైలు మార్గం మీద ఓ ఏనుగుల గుంపును చూశాడు రైలు డ్రైవరు. తెలుకన్సన్ చేరటానికింకో మూడు నాలుగు మైళ్ళు మాత్రమే ఉంది. ఫైర్‌మెన్‌తో జోక్‌లేస్తూ సరదాగా ఉన్న డ్రైవరుకి బండి వేగం తగ్గించాల్సిన అవసరం కన్పించలేదు. పాపం పూర్వ కాలం నుంచీ తిరిగిన స్థలాన్ని ఓసారి చూసి పోదామని వచ్చివుంటాయి. బండి దగ్గిరయేకొద్దీ అవే తప్పుకొని పోతాయిలే అనుకున్నాడు. రైలు విపరీతమైన వేగంతో రయ్యిన దూసుకు పోతోంది. రైలు డ్రైవర్లు దీక్షగా ఏనుగుల గుంపు వైపే చూస్తున్నారు.

రైలు దగ్గిరవుతున్నకొద్దీ ఏనుగులు కదిలి అడవిలోకి వెళ్ళిపోసాగాయి. చెవులు చిల్లులు పడేలా రైలు కూత విన్పిస్తోంది. ఇంతలో హఠాత్తుగా ఒక ఏనుగు తొండం పైకెత్తి రైలు కెదురుగా రైల్వే లైను మీద నడుచుకుంటూ రాసాగింది. ఆ గుంపుకది నాయకత్వం వహిస్తోందన డంలో సందేహం లేదు. తొండం పైకెత్తడం యుద్ధం ప్రకటిస్తోందనటానికి గుర్తు. పొగ వదులుతున్న ఓ భయంకర మృగమేదో తమ మీదకి వస్తోందని భావించిన ఆ ఏనుగు మిగిలిన ఏనుగులను దాన్నుంచి రక్షించటానికి ఆ రైలుతో తలపడింది. ఏనుగు రైలింజనును గుద్దుకో

గానే ఇంజన్‌తో సహా వెనకున్న రెండు రైలు పెట్టెలు పడిపోయాయి. ఏనుగు తల పగిలిపోయి అవతలకి విసిరివేయ బడింది. మరి కొంచెం సేపట్లో ఆ ఏనుగు ప్రాణాలు పోయాయి. అదృష్టవశాత్తు డ్రైవరు, ఫైర్‌మెన్ తప్పించుకున్నారు. కొన్ని నిమిషాలగ్గాని జరిగిన సంగతి రైలు ప్రయాణీకులకు తెలీలేదు. తన వాళ్ళను రైలు బారి నుంచి రక్షించటానికి ప్రాణాలర్పించిన ఆ ఏనుగు జ్ఞాపకార్థం అది చనిపోయిన చోటనే దాని శరీరాన్ని పాతిపెట్టి ఓ బోర్డును పాతారు. పెరక్ రాష్ట్రం పాత రాజధాని రిప్పింగ్‌లోని మ్యూజియంలో ఇప్పటికీ ఈ ఏనుగు పుర్రె, దంతాలు భద్రపరచబడివున్నాయి.

## చిత్ర విచిత్రాలు

పాశ్చాత్య దేశాల్లో సెక్స్, సెంటిమెంటాలిటీ వున్న సినిమాల పట్ల మోజు వుందన్న విషయం అందరికీ తెలుసు. కాని కమ్యూనిస్ట్ దేశాల్లో కూడా ఇలాంటి సినిమాలకు గిరాకి వుండటం ఆశ్చర్యం కలిగించక మానదు. చైనాలో సాంస్కృతిక విప్లవం అత్యున్నత దశలో వున్న 1973-74 కాలంలోనే శృంగారభరిత మైన సినిమాలు చైనా ప్రజలనలరించాయి. మావో - సే - టుంగ్ భార్య చియాంగ్ చింగ్ ఈ రకం సినిమాల అభిమాని అవడం విశేషమే! చియాంగ్ చింగ్ విదేశీ శృంగార చిత్రాలనంగీకరించడమే గాక వాటికి ప్రాధాన్యత కూడా ఇచ్చింది. ఆమె బ్రిటన్‌కి చెందిన 'ది గోబిట్వీన్' చిత్రాన్ని చాలా ఇష్టపడింది. విక్టోరియా కాలపు ప్రేమ కథ ఇందులోని ఇతివృత్తం. కులీన కుటుంబానికి చెందిన స్త్రీ, తోట పనివాడితో రహస్యంగా ప్రేమ వ్యవహారం నడపడం ఆ చిత్రంలో కథ. నిజానికీ చిత్రంలో పేద వర్గాల బరువు, బాధలకి సంబంధించిన ప్రసక్తే లేదు.

ఓ యువతి ముసలివాడిని ప్రేమించడం, విడాకులు పొందిన తల్లిదండ్రుల మధ్య ఓ పిల్లవాడి సంఘర్షణ వంటి ఇతివృత్తాలుగల సినిమాలను చియాంగ్ చింగ్ బృందం అప్పట్లో ఎన్నిక చేసింది. పసిఫిక్‌లోని ఓ ద్వీపవాసుని సాహస సముద్ర ప్రయాణం కథగల 'ది డోవ్'




కూడా చైనీయుల అభిమానం సంపాదించింది. ప్రస్తుతం హువా నాయకత్వంలో విదేశీ చిత్రాలకి ఆదరణ బాగానే లభిస్తోంది. ఎలిజబెత్ రాణి రజతోత్సవ డాక్యుమెంటరీని సామాన్య ప్రజలు చూడటానికి వీలుగా చైనా అంతటా విడుదల చేశారు. ఉత్తర కొరియా కూడా ఈ చిత్రాన్ని తెప్పించింది. ఎమోషనల్ థీమ్ వున్న 'జెన్ ఐర్', పూర్తిగా గూఢచార్లకి సంబంధించిన 'ది ఇంటర్నేషనల్

# దేశభక్తి...దేశద్రోహం!

సరిహద్దుల్లో మిజో విద్రోహుల్ని వేటాడుతున్న భారతీయ సైనిక దళంలోని ముఖ్యుడతను. శత్రువుల కోసం ఉచ్చు బిగించి క్షణంలో ముగ్గురు తిరుగుబాటుదార్లు నేల కూలేలా చేశాడతను. తీరా చూస్తే...ఆ ముగ్గురిలో ఒకరు ఆడమనిషి...! చాలా అందమైన యువతి ఆమె...అంతకు ముందు రెండు వారాల పాటు తనతో కాపురం చేసి శృంగారపుటంచుల్ని చవి చూపిన మిజో అందాల రాశి ఆమె...మరి ఇది నిజమా...? నిజమే అయితే అదెలా సంభవమయింది? ఆశ్చర్య-విషాదాలను ఏక కాలంలో రేకెత్తించే విజేంద్రసింగ్ బాఘా పంజాబీ కథ "ఉచ్చు" జనవరి నెల 'విపుల'లో చదివి చూడండి. ఈ సంచికలోని వివిధ భాషల అనేక అపూర్వ కథలలో ఒకటి ఈ ''ఉచ్చు''. కథలతోపాటు ఎన్నో కార్టూన్లు, సరదాగానే కాక ఆశ్చర్యకరంగా కూడా ఉండే విచిత్ర విశ్వ విజ్ఞానం అందజేస్తుంది విపుల. కథలకు ఆకర్షణీయమైన పంచ వర్ణ చిత్రాలు విపుల మరో ప్రత్యేకత.



విశ్వకథా విపంచి

# విపుల



132 పేజీలు : రెండు రూపాయలే

ప్రాజెక్ట్' సినిమాలను కూడా ఎన్నుకో వడం మిగిలినవారికి ఆశ్చర్యం కలిగించింది. దుష్టచతుష్టయం కాలంలో అనేక నిర్బంధాల నెదుర్కొన్న చైనా ప్రజలు ప్రస్తుతం శృంగార భరితమైన చిత్రాలను చూసి రిలాక్స్ అవుతున్నారు.

ఇది కమ్యూనిస్ట్ దేశాల్లోని నూతన ధోరణిని, స్వేచ్ఛా వాతావరణాన్ని సూచిస్తోంది. హఠాత్తుగా ఇలాంటి మార్పు తీసుకురావడం మంచిది కాదు గనుక నెమ్మదిగా, దశలవారీగా మార్పు తీసుకొచ్చే ప్రయత్నాలుగా వీటిని భావించవచ్చు.

# చీమల కొలువు

నిరుద్యోగ సమస్య నానాటికీ పెరిగి ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్ ముందు పడిగాపులు పడే యువతీయువకుల సంఖ్య పెచ్చుపెరగడం చూసి వారికి ఉపాధి కల్పించే నిమిత్తం బ్రిటిష్ ప్రభుత్వం కొన్ని కొత్త పథకాలను రూపొందించి, సరికొత్త ఉద్యోగాలను కనిపెట్టింది.

ఇటీవల ఒక ప్రయోగశాలలో చీమలకి ఆహారం అందించేందుకు ఇద్దరు యువతులు నియమించబడ్డారు. ఈ పని చూడ్డానికి 'సిల్లీ'గావున్నా వారికి వారానికి 126 రూపాయలు తెచ్చిపెడుతోంది.

అపుడే కాలేజీ చదువు ముగించుకుని బైటికి వచ్చిన ఆడపిల్లలకు అడవిపూలను లెక్కపెట్టడం, సర్కసుల్లో ఆడబఫూన్లుగా వ్యవహరించడం వంటి పార్టు టైం ఉద్యోగాలున్నాయి. ఇవన్నీ ప్రభుత్వ రిక్రూటింగ్ ఏజెన్సీలద్వారానే ఇస్తున్నారు.

ఇందుకోసం ప్రత్యేకించి బడ్జెట్‌తో ఓ కమీషన్ను ఏర్పాటు చేసింది ప్రభుత్వం. దాంతో మరిన్ని ఆసక్తికరమైన ఉద్యోగాలు సృష్టించబడుతున్నాయి. మ్యూజియంలో వున్న పాత తుపాకులకు మెరుగుపెట్టడం, చీమలు పెట్టిన పాము పుట్టల్ని తవ్వడం, అడవి పావురాల్ని లెక్కబెట్టడం, తాబేలు చర్యలు గమనించడం మొదలైనవి.

దిగ్విజయంగా సాగిపోతున్న ఈ ఉద్యోగ విస్తరణ పథకాలు బ్రిటిష్ పత్రికలవారిని ఆశ్చర్యచకితుల్ని చేశాయి. పురాతన వస్తువుల్ని శుభ్రపరచడం, వస్తువుల్ని తవ్వితీయడం అంటే అర్థం




వుందిగానీ అడవిపూలని, కప్పల్ని లెక్కపెట్టడంఏమిటని ఘాటుగా విమర్శించాయి. కానీ ప్రభుత్వానికి చీమకుట్టినట్లు కూడా లేదు.

నాలుగైదేళ్ళుగా నిరుద్యోగులుగా ఉన్నవారు ఆరునెలలపాటు వరుసగా ఈ కొత్త స్కీములో పనిచేసినట్లయితే వారిని ప్రత్యేక తాత్కాలిక ఉద్యోగ పథకం కింద మంచి ఉద్యోగాలిచ్చి కొన్నాళ్ళ తర్వాత పెర్మనెంట్ చేస్తారు.

కాలేజీ చదువు పూర్తి చేసుకున్న యువతీయువకులకు కొన్నాళ్ళపాటు ఉపకార వేతనంతో సహా శిక్షణనిచ్చి ఆ తదుపరి నెలసరి జీతంతో ఏదో ఒక ఉద్యోగం యిస్తారు. మన దేశంలో నిరుద్యోగులను ఎలకల్ని లెక్కపెట్టమంటే చాలు, కొన్ని తరాలపాటు నిరుద్యోగ బాధ తప్పుతుంది.

# మొరగని కుక్కలు

తమిళనాడులోని కోటగిరి దగ్గరున్న గ్రామంలో ఓ అందమైన ఉద్యానవనం వుంది. అందులో ఇటీవల ఛిన్నాభిన్నంగా పడివున్న ఓ మానవకళేబరాన్ని పోలీసులు పోస్టుమార్టంకి పంపగా ఆ వ్యక్తి అడవి జంతువులవల్ల మరణించినట్లు తేలింది. సరిగ్గా అమర్నాడే నాలుగు భయంకరమైన కుక్కలు నూతిలో నీళ్ళు తోడుతున్న ఓ అమ్మాయి వెంటబడి తరిమి కొట్టాయి. ఆ అమ్మాయి భయంతో గట్టిగా కేకలు పెట్టడంతో గ్రామస్తులు పరుగెత్తుకుంటూ వచ్చి ఆమెను రక్షించారు. అప్పటికే ఆమె బాగా గాయపడింది.

పట్టుకుందామన్నా ఈ కుక్కలు పగలు మనుషుల కంట పడడంలేదు. పోనీ ఇవి ముందునుంచి ఇలాగే వున్నాయంటే అదీ లేదు. నిజానికివి అడవి కుక్కలు కాదు. నిన్నటి మొన్నటిదాకా రోడ్లలో తిరిగిన వూరకుక్కలే! ఉన్నట్టుండి ఇలా మాన్ ఈటర్స్‌గా మారిపోవడం అందర్నీ విభ్రాంతుల్ని చేసింది.

గ్రామస్తులు ముందు వీటికి పిచ్చెక్కిందనుకున్నారు. కానీ పిచ్చికుక్కలు పగలూ రాత్రీ తేడాలేకుండా, మనుషులు జంతువులన్న పక్షపాతం చూపకుండా అందరి మీద పడి కరుస్తాయి. కానీ ఇవి మాత్రం పగలు ఎక్కడో నక్కి సాయంత్రం మసక వెలుతుర్లో బైటికి వచ్చి కేవలం మనుషుల్ని మాత్రమే భయపెట్టి మీద పడి చంపుతున్నాయి.

ఒకజాతి అడవినక్క కరిస్తే కొన్ని మామూలు కుక్కలు నరభక్ష కుక్కలుగా మారుతాయనీ, 1892 ప్రాంతంలో హాలెండులోను, 1921 ప్రాంతంలో ఇంగ్లండులోను ఈ తరహా కుక్కలుండేవనీ ప్రముఖుల పరిశోధనా వ్యాసాల వల్ల



తెలుస్తోంది. ఇటువంటి కుక్కల మెదళ్ళను ప్రయోగశాలల్లో పరీక్షించాలని, ఇవి మామూలు కుక్కలన్నింటినీ మాన్ ఈటర్స్‌గా మార్చే ప్రమాదం వుందనీ కూడా నిపుణులు అభిప్రాయ పడుతున్నారు.

ఇంతవరకు ఇటువంటి లక్షణాలున్న పదికుక్కలను కోటగిరిలో పట్టుకున్నారు. ఇకనుంచీ కుక్కలున్నాయి జాగ్రత్త అన్న బోర్డులనేగాక ఏ కుక్కను చూసినా కూడా జాగ్రత్తగా వుండటం మంచిది. ఏ కుక్కలో ఏముందో ఎవరు చెప్పగలరు!




# రావణ పూజ

దసరాకిసాధారణంగా రావణుడి బొమ్మ చేసి కాలుసారు ప్రతిచోట. కాని పంజాబ్‌లో పాటియాలాలోని పయలి అనే ఊర్లో దసరా రోజున పెద్ద ఉత్సవం చేసి రావణుడిని పూజిస్తారు. ప్రతి సంవత్సరం ఈ ఊర్లో దసరా రోజున రావణుడిని పూజించడం ఆనవాయితీగా వస్తోంది. ఈ అలవాటు ఆ ఊర్లోని దయాల్ కుటుంబీకుల మూలాన ఏర్ప



డింది. దయాల్ కుటుంబంలోని పూర్వీ కుడు హకీమ్ పరమ్‌దయాల్ ప్రతి సంవత్సరం తమ కుటుంబంలో ఎవరో ఒకరు చనిపోవడం, ఏదో ఒక అరిష్టం సంభవించడం చూసి భయపడిపోయాడు. ఒకరోజు హకీమ్‌దయాల్ ఓ సాధువును కలిశాడు. అతను ఏటా దసరా రోజున రావణుని పూజిస్తే కుటుంబానికి పట్టిన పీడ తొలగుతుందని సలహా ఇచ్చాడు. ప్రతి సంవత్సరం తన కుటుంబ సభ్యు లొకరు చనిపోవడంతో భయపడి ఈ సలహా ఆచరించాలని నిశ్చయించాడు హకీమ్. అందుకని 18 అడుగుల ఎత్తున్న ఓ రావణుడి విగ్రహాన్ని ఇటుకలు, సిమెంట్‌తో తయారు చేయించి పయలి గ్రామంలో ప్రతిష్ఠించాడు. ప్రతి సంవ త్సరం దసరా రోజున ఆ విగ్రహాన్ని పూజించేవారు హకీమ్‌దయాల్ కుటుం బీకులు. అతను ఆ గ్రామంలో ప్రముఖుడు, పేరున్నవాడు గనుక ఈ పూజా పుర స్కారాల నెవరూ వ్యతిరేకించలేదు. పైగా సామాన్య జనులు కూడా రావణుని విగ్రహాన్ని పూజించడం ప్రారం భించారు. ఇప్పటికీ దసరా పండగకి ఇక్కడ జాతర జరుగుతుంది. చుట్టు పక్కల గ్రామప్రజలు కూడా రావణా సురుణ్ని పూజిస్తుంటారు.

# దోమ పురాణం

దోమల బెడదలేని ఇల్లు సంగతి అటుంచి దేశం కూడా లేదు. వీటి వలన పంటలూ నష్టమే, ఆరోగ్యమూ నష్టమే. దోమల నిర్మూలనకి వాడే మందుల ప్రభావాన్ని కూడా తట్టుకొనే శక్తి సంపా దించి మరీ ఇవి వీరవిహారం చేయడంతో "గంబూషియా అఫినిస్" అనే చేపలను ప్రస్తుతం దోమల నిర్మూలనకు ఉపయో గిస్తున్నారు. వీటిని దోమల చేపలని వ్యవ హరిస్తున్నారు. ప్రస్తుతం ఇవి న్యూజెర్సీ, ఇటలీ, రష్యా లాంటి దాదాపు 20 దేశాల్లో తమ పనిని విజయవంతంగా నిర్వహిస్తున్నాయి. ఈ చిన్న చేపల్లో ఆడచేప మూడు అంగుళాల వరకూ, మగ చేప ఒకటిన్నర అంగుళాల వరకూ పెరుగుతుంది. ఒక్కో చేప రోజుకి 100 దోమ 'లార్వాలను' ఫలహారం చేస్తుంది.

ఓ నీళ్ళ గుంటలో 6,000నుంచి 9,000 చేపలను వేయగా రెండున్నర మాసాల్లోనే



దాదాపు రెండు మిలియన్ పిల్లలను పెట్టాయవి. మిస్సోంలాకి తూర్పున 40 మైళ్ళ దూరంలో మొంటానా వద్ద ఓ వేడి నీటి సెలయేర్లో 1959లో కనుగొనబడ్డాయివి. ఈ చేపల పెంపకానికి దోమల నిర్మూలనలో వాడే రసాయనిక మందులకయ్యే ఖర్చుకన్నా తక్కువ అవుతుంది. దోమల నిర్మూలనా వ్యయాన్ని ఇవి సగానికి సగం తగ్గిస్తాయి. ఈ చేపలను ఉపయోగించడం వలన రసాయనాల వాడకం నాలుగు నుంచి ఒక శాతానికి తగ్గింది.

## పక్షితీర్థం

మద్రాస్‌కి 45 మైళ్ళ దూరంలో వున్న తిరుక్కళు అనే చోట ఈశ్వరుడి దేవాలయం వుంది. అక్కడికి రోజూ ఒక నిర్ణీత సమయంలో గాలిపటాల్లా వుండే ఓ రెండు పక్షులు వచ్చి ఆహారాన్ని స్వీకరిస్తుంటాయి. చిక్మగళూర్ జిల్లాలో వున్న ఈ స్థలాన్ని కుందరమ్ లేదా పవిత్రమైన పక్షుల పర్వతమని పిలుస్తుంటారు.

డచ్ వారి వర్ణనలు, వ్రాతలలో దక్షిణ భారతంలో నివసించిన పాశ్చాత్య ఉన్నతాధికారులు 1664, 1689లో ఈ స్థలాన్ని దర్శించి రెండు పక్షులు వాటికిచ్చిన ఆహారాన్ని తినడం చూశారని వుంది. అప్పటి నుంచి ఇప్పటి వరకూ కూడా ఈ పక్షులు రోజూ వచ్చి ఆహారం తిని వెళుతుంటాయట. ఇప్పటికీ ఈ పక్షులు ఎక్కడనుంచి వస్తాయో ఎవరూ చెప్పలేక పోతున్నారు. అక్కడి స్థానికులు ఈ పక్షులు పూర్వజన్మలో ఋషులని నమ్ముతారు. ఈ పక్షులు వచ్చే ప్రదేశం 500 అడుగుల ఎత్తున కొండమీద వుంది. ఈ గుడిని చేరాలంటే 500 అడుగుల ఎత్తునీ మెట్లు ఎక్కుతూ చేరాల్సిందే. ఈ స్థలాన్ని మహాబలిపురం వెళ్ళే బస్సులో చేరవచ్చు. ఈ పక్షులను చూడ్డానికి విదేశీయులు కూడా వస్తుంటారు.



ఇన్నేళ్ళయినా ఈ పక్షుల ఉనికిమాత్రం ఓ రహస్యంగానే మిగిలిపోయింది.





# హిమాలయాల్లో అంతరిక్ష కేంద్రం...?

కుబేరుడి దగ్గరుండే పుష్పక విమానాన్ని రావణాసురుడు సంపాదించాడు. రావణ వధానంతరం శ్రీరాముడు ఆ పుష్పక విమానంలోనే సీతాలక్ష్మణ సపరివార సమేతంగా అయోధ్యకి తరలి వచ్చాడని వాల్మీకి రాశాడు. పుష్పక విమానానికి ప్రత్యేకించి సారథి (పైలెట్) ఎవరూ వున్నట్టు కనబడదు. ఆటోమాటిక్ అన్నమాట! ఇంద్రుడు తన రథ సారథి మాతలి నడిపే రథాన్నెక్కి-

తరచూ విహారాలు చేసేవాడు. యక్ష, కిన్నెర, కింపురుష, గంధర్వాది దివ్యపురుషలు భూమ్యాకాశాల భేదం లేకుండా ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళివస్తుండేవారు. అంతేగాక పర్వతాలకి రెక్కలుండేవనీ, అది భరించలేని ఇంద్రుడు తన వజ్రాయుధంతో వాటి రెక్కలు నరికేశాడనీ, దేవతలు, రాక్షసులు ఇద్దరికీ కామరూప విద్య తెలుసుననీ ఇలాంటి ఎన్నెన్నో వింతలు మన పురాణాల్లో పొందుపర్చబడ్డాయి.

కానీ మానవుడు గాలిలో ఎగిరే విమానాన్ని కనిపెట్టడానికి మాత్రం కొన్ని శతాబ్దాలు కృషి చేయాల్సివచ్చింది. 1903లో రైటు సోదరులు కనిపెట్టిన సాధనమే విమానానికి తొలి రూపం. అది ఎన్నో మార్పులూ, చేర్పులూ పొంది, ఎన్నో పరిశోధనలూ, ప్రయోగాల పాలబడి ఈనాటి ఆధునిక విమానంగా రూపు దిద్దుకుంది.

చరిత్రగతిలో మనకు తెలియని ఎన్నో నిజాలు, రుజువులులేని నమ్మకాలు నిక్షిప్తమై వున్నాయి. ఆ రంగంలో ఉత్సాహం, శ్రద్ధాసక్తులు వున్నవారు ఆ విషయాన్ని శోధించి వెలికి తీసిన సత్యాలు వింటుంటే దిగ్భ్రాంతి కలుగుతుంది.

రష్యాలో పుట్టి భారతదేశంలో స్థిరపడిన ప్రఖ్యాత చిత్రకారుడు నికొలయ్ రోరిచ్‌కి భారతీయ చరిత్ర, సంస్కృతి పట్ల వల్లమాలిన అభిమానం. స్వతహాగా అతను కళాకారుడేగాక కవి, రచయిత, పరిశోధకుడు కూడా. అందుకే ప్రసిద్ధ చలన చిత్ర నటి దేవికారాణీని తన కొడుకు స్వెతస్లావ్ రోరిచ్ పెళ్ళాడుతానన్నపుడు అభ్యంతర పెట్టలేదు.

కొన్ని యేళ్ళపాటు హిమాలయ పర్వత ప్రాంతంలోని గుహలను, భూగర్భ ప్రదేశాలను క్షుణ్ణంగా పరిశీలించి అక్కడ వుండే ఒక విశిష్ట జాతిని గురించిన వివరాలను వెలుగులోకి తెచ్చాడు రోరిచ్. అందుకోసం సాహసంతో అతనెన్నో కష్టనష్టాలను ఎదుర్కోవల్సి వచ్చింది.

హిమాలయాల్లో మానవ మాత్రులు వెళ్ళడానికి భయపడే అజ్ఞాతప్రాంతాల్లోని అగమ్యగుహల్లో ఆకాశయానం చేసే దివ్యపురుషలున్నారనీ, వీరు ప్రత్యేక వాహనాల మీద వెళ్ళి అంతరిక్షయానం చేసేవారన్న విషయం అభూతకల్పన కాదు. యదార్థమేనని అతని పరిశోధనా గ్రంథాల వల్ల తెలుస్తోంది. ఈ దివ్య పురుషల్ని టిబెట్టు భాషలో 'లాంగోం పాలు' అంటారు.

అగ్ని, పొగలతో ఆకాశాన్ని మింగివేసేంత శక్తిగల లోహ సర్పాలు అక్కడ వుండేవని బౌద్ధ గ్రంథాలు తెలియజెబుతున్నాయి.

క్రీస్తు పూర్వము 2346 సంవత్సరంలో జన్మించిన యా - ఓ అనే ఒక చైనా చక్రవర్తి సభలో ఒక గొప్ప ధనుర్ధారి వుండేవాడుట. అతగాడు అంతరిక్ష వాహనం అని పిలువబడే ఒక దివ్య పక్షి నెక్కి అంతరిక్షంలోని ఏదైనా ఒక కేంద్రాన్ని చేరుకున్నపుడు అక్కడ్నించి సూర్యోదయ, సూర్యాస్తమయాల్ని చూడలేకపోయేవాట్ట. అయితే అది దృష్టిదోషం వల్ల కాదు. ఆధునిక అంతరిక్ష యాత్రికులు కూడా అక్కడికి చేరుకున్నాక సూర్యపరిభ్రమణ స్థితిగతులను దర్శించలేకపోతున్నారు మరి.

బొందితో స్వర్గానికి వెళ్ళాడని ప్రసిద్ధి

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనం కాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

పొందిన యా-సీ-జాన్ అనే చైనా తత్వవేత్త గాలిలో తేలుతూ మేఘాల మీద ఎక్కి ఆకాశంలో విహరించేవాడని తావో మతస్థుల నమ్మకం. గాలిలో తేలడమే గాక ఓ పెద్ద పక్షినెక్కి భూమిపై నుండి 52, 303, 368 కిలోమీటర్ల ఎత్తుకు ఎగిరేవాడని కూడా ప్రసిద్ధి.

చైనా, టిబెట్, మంగోలియా ప్రాచీన గ్రంథాలలో అంతరిక్షానికి సంబంధించిన అద్భుత సమాచారం ఎంతో రాసి వుంది. వీటి ఆధారంగా హిమాలయ ప్రాంతాలలో జరిగిన అంతరిక్ష యాత్రల సజీవ ప్రామాణికతలను కొంత వరకూ విశ్వసించవచ్చు. టిబెట్ సరిహద్దుల్లో వున్న నాగాలు, ఇతర స్థానికులు సమగ్ర సమాచారం ఇవ్వడంలో ఈ పరిశోధకుల కెపుడూ మార్గదర్శకంగా వుంటారు. టిబెట్ సరిహద్దుల్లో వున్న విశాల కంచన్ గంగా అడుగు భాగంలో అపారంగా గుప్తధనం దాచబడి వుంది. దానికి 'హిమభాండాగారం' అని పేరు. హిమాలయ అడుగు భాగంలో వున్న రాజభవనాలు, గుప్తమార్గాలు, ధనాగారాలను తలపై మెరుస్తున్న మణిదీపాలను ధరించిన ఎగిరే సత్వాలు ఎల్లవేళలా కాపాడుతూ వుంటాయిట.

భూగర్భంలో వున్న అతిపొడవైన, ఇరుకైన ఆ సన్నని దారులు మానవ మాత్రులు నడిచేందుకు ఏ మాత్రం అనువుగా వుండవు. కానీ ఈ దారుల వెంబడి అపుడపుడు కొంతమంది శ్వేత వర్ణీయులు బైటకి వచ్చి బంగారు నాణేలు ఇచ్చి అక్కడి దుకాణాల్లో తమకిష్టమైన వస్తువులు కొనుక్కుని చూస్తుండగానే తిరిగి తమ రహస్య స్థావరాలకు వెళ్ళిపోయేవారు . . వారిచ్చే బంగారు నాణేలు అతి ప్రాచీన కాలం నాటివి. వారు ఏ దేశంవారో, ఏ కాలంవారో ఎవరికీ తెలీదు. వీరి వస్త్రధారణ తమాషాగా వుంటుంది. ఒక్కోసారి పశువులకాపర్లుగా, మరోసారి వ్యాపారస్థుల్లాగా, ఇంకోసారి సైనికుల్లాగా వస్త్రధారణ చేసుకునేవారు. స్థానికులకి, వారికి వున్న తేడా శ్వేత వర్ణం మాత్రమే. మంగోలియన్లు ఇప్పటికీ ఈ వింతల్ని కథలు కథలుగా చెప్పుకుంటారు.

ఈ శ్వేతవర్ణీయులు కరాకొరం కొండ ప్రాంతంలో కూడా తిరుగాడుతూ వుండేవారు. పర్వత సానువుల్లోని రహస్య మార్గాల నుండి వచ్చేవారి చేతుల్లో దీపశిఖ లుండేవి. ఆ వెలుతురులో చీకటిని చీల్చుకుంటూ ప్రయాణించేవారు. వీరి వద్ద స్వర్ణముద్రలుండేవి. ప్రయాణించేటపుడు మార్గమధ్యంలో ఎవరైనా మనుష్య మాత్రులు కనబడితే వారికి బంగారు నాణేలను పంచిపెట్టేవారు కూడా.

"ఎడారుల్లోనూ, పీఠభూముల్లోనూ కనబడే ఈ రహస్య వ్యక్తులు,హిమాలయ భూగర్భ మార్గాల నుండి బయటికి వస్తూ ఎందుకు కనబడరు?" అని రోరిచ్, 1935లో ఓ చైనా పత్రికలో తను రాసిన వ్యాసంలో ప్రశ్నించాడు. ఆ ప్రశ్న అప్పట్నించి ఇప్పటి వరకు ప్రశ్నగానే మిగిలిపోయిందిగానీ సరియైన సమాధానానికి నోచుకోలేదు.

కరాకొరం గుహల్లో 1926 ప్రాంతాల్లో ఓ విశాలమైన చక్రం వుండేది. ఎండకి మెరుస్తూ చూపరుల కళ్ళకి మిరుమిట్లు గొలిపే ఈ చక్రం ఓసారి తటాలున పైకి ఎగరడం ప్రారంభించి చూస్తుండగానే ఆకాశంలో అదృశ్యమైపోయింది.

ఆ కాలంలో మధ్య ఆసియాలో వాయు విమానాలు, గాలి గుమ్మటాలు లేవు. హిమాలయంలోని దేవి, కైలాస్, కాంచన గంగా మొదలైన శిఖరాల మీద నివసించే దేవతలదే ఆ చక్రమని స్థానికు లంటారు. కైలాస పర్వతం మీద మహా శివుడు నివసిస్తాడనీ, కైలాస పర్వతం అంతరిక్ష ప్రవేశద్వారమనీ, అక్కడున్న విమాన కేంద్రం నుండి ప్రాచీన కాలంలో లాగే ఈనాడు కూడా అంతరిక్ష వాసులు తమ వాహనాల మీద భూలోకానికి వస్తుం టారని టిబెటన్ల విశ్వాసం. మహాశివుడు తదితర దేవతలు కైలాస పర్వతం మీద నివసించేవారనీ, అక్కడున్న ఒక కేంద్ర ప్రాంతానికి వచ్చి దేవతలు మహా భారత యుద్ధాన్ని తిలకించేవారని కూడా మహాభారతంలో పేర్కొనబడింది.

శ్వేతవర్ణు లుండడంలో అసంభవ మేమీ లేదు. ఎట్లాంటిస్ ద్వీపం సముద్రంలో లీనమై పోయినపుడు అక్కడ నుండి కొందరు జ్ఞానులు మధ్య ఆసియాకు పారిపోయి వచ్చి హిమాలయాలలోని భూగర్భంలో చాలా పొడవైన, మనిషి పట్టేంత వైశాల్యంగల సన్నని ఇరుకు



దారులు నిర్మించుకుని జీవించడం ప్రారంభించారని ప్లేటో తన గ్రంథంలో రాశాడు.

మంగోలియనుల ప్రధాన లామా ఈ విషయాన్ని మరో విధంగా మలిచాడు. చాలా కాలం కిందట అట్లాంటిక్, ప్రశాంత మహాసాగరం అనే రెండు ద్వీపాలుండేవి. ఏవో ప్రాకృతిక కారణాల వల్ల అవి మహాసముద్రాల అట్టడుగుకు మునిగిపోయాయి. మునిగిపోయిన వారు పోగా మిగిలిన అదృష్టవంతులు భూగర్భంలోని సురక్షిత స్థానాల్లో శరణు పొందారు. వారికి ఆశ్రయం లభించిన చోట అసాధారణ కాంతి వ్యాపించి వుండేది. ఆ కాంతిలోనే వారూ, చెట్టు చేమలు జీవించేవారు. అలా వుంటూనే వైజ్ఞానిక రంగంలో వారు చేసిన గణనీయమైన ప్రగతికి నిదర్శనమే వారి ఆకాశయానాలు. అంతరిక్షంలోని ఎన్నో గ్రహాలను వారు కనుగొన్నారు. ఆ గ్రహాల మీదకి వెళ్ళి అక్కడి జీవితాన్ని గూర్చి ముమ్మరంగా పరిశోధనలు జరిపారు. అలా వెళ్ళిరావడానికి వారివద్ద భూగర్భంలో వలలాగ వ్యాపించిన జటిలమైన మార్గాలలో అతివేగంగా నడవగలిగే చిత్ర విచిత్రమైన శకటాలుండేవి. మానస సరోవర క్షేత్రంలోని వారి అద్భుత వైజ్ఞానిక ఆవిష్కారాలు పరిశోధకుల్నే ఆశ్చర్యచకితుల్ని చేస్తుంటాయి.

శ్రీమతి డేవిడ్‌నీల్ అనే ఆవిడ టిబెట్ గురించి ఎన్నో పరిశోధనలు చేసింది. అప్పట్లో ఆవిడ 8 సెంటీమీటర్ల లోతైన మంచులో 'డిఛూ' నదీ తీరాన నివసిస్తూ వుండేది. ఆవిడకి తెలిసిన ఓ వందిమాగధుడు చైనాలోని 'చిన్‌హాయ్' క్షేత్ర పర్వత గుహల్లో నివసించే దేవతల నివాస స్థావరాలకు రాకపోకలు సాగించేవాడు. ఓసారి ఎండాకాలంలో, అక్కడ్నించి అపుడే వికసించిన ఓ నీలిరంగు పుష్పాన్ని తెచ్చి డేవిడ్‌నీల్‌కు భక్తితో సమర్పించుకున్నాడు.

హిమాలయాల్లోని ఓ కొండలోయలో చెప్పుకోదగ్గ సంస్కృతి, సభ్యతలుగల అజ్ఞాత వ్యక్తులు నివసించే ఒక సామ్రాజ్యం వుంది. ఈ సామ్రాజ్యాన్ని గురించి ఐకరాజ్య సమితికి తెలియనే తెలియదని విశ్వవిఖ్యాత ఫ్రాన్స్ పరిశోధకుడు మైకెల్ డీసెల్ చమత్కరించాడు.

టిబెట్‌లోని శంఖాల్‌కు మూడు సరిహద్దు పహారా కేంద్రాలున్నాయి. వాటిలో ఒకదానికి 'శ్వేత' సరిహద్దు పహారా కేంద్రం అనిపేరు. అక్కడి లామా చెప్పిన ప్రకారం శంఖాల్ భూగర్భంలోని మనుషులు అపుడపుడు తమ నివాస స్థలాల నుండి భూలోకానికి వస్తారని, భూలోకవాసులకు గత యుగ వివరాలు అందించి తిరిగి వెళ్ళిపోతారని తెలుస్తోంది. శంఖాల్ అనేపేరు 'సమాలి' అనే పదం నుండి వచ్చిందని పండితుల అభిప్రాయం. సమాలి ఒక దైత్యుడు.

పూర్వం రాక్షసులవి రెండు శక్తి కేంద్రాలుండేవని పౌరాణికగాథల సారం. ఒకటి హిరణ్యకశిపుని ఏలుబడిలోవుందని చెప్పబడే కాస్పియన్ సాగరం. రెండవది హేతి, ప్రహేతి అనే ఇద్దరు రాక్షస రాజులు పాలించిన శ్రీలంక. హేతికి మాలి, సుమాలి, మూల్యాదానుడు అని ముగ్గురు మునిమనుమలు. వీరిలో సుమాలి దేవతలు రాక్షసులను ఓడించి పారద్రోలినపుడు ఎట్లాంటిస్ ద్వీపం సముద్రంలో లీనమైన పాతాళానికి పారిపోయి తలదాచు




కున్నాడు. ఆ తర్వాత అతగాడు మధ్య ఆసియాకి తరలి వుండవచ్చుననీ, అతని పేరనే 'శంఖాల్‌లాట్' స్థాపించబడి వుంటుందనీ విజ్ఞులు భావిస్తున్నారు.

ఉత్తర శంఖాల్‌లో ప్రస్తుతం ఇసుక, ఉప్పునీటి సరోవరాలున్నచోట ఒకప్పుడు సముద్రముండేది. మధ్య ఆసియాలోని ఈ సాగరంలో మొట్టమొదట ఒక ద్వీపం వుండేది. ప్రస్తుతం దానిస్థానే పర్వతశ్రేణులు మాత్రం కనపడుతున్నాయని భౌగోళిక శాస్త్రజ్ఞులంటున్నారు. పదిహేడో శతాబ్దిలో బెల్జియంలో అచ్చు వేయబడిన ఒక మ్యాప్‌లో శంఖాల్ దేశము, దాని సరిహద్దులు చూపబడ్డాయి. ఈ మ్యాప్ ప్రకారం శంఖాల్ సిర్‌దరియా నది అవతల 45° - 50° ఉత్తర అక్షాంశాల మధ్యన ఉంది. కొందరు పర్యాటకులు శంఖాల్‌ను 'జెంబాలా' అనికూడా వ్యవహరిసారు.

రష్యా జియొగ్రాఫికల్ సొసైటీ వారు ముద్రించిన ప్రత్యేక సంచికలో మధ్య ఆసియాలో ఒక ఆదర్శలోకమున్నదనీ, దానిని శ్వేత పర్వతాలు ఆవరించి వున్నాయనీ రాసి వుంది. శంఖాల్‌ను కూడా శ్వేత పర్వతాలు ఆవరించి వున్నాయి దీనికి బేల్‌వోడాయ్ అని మరో పేరు కూడా వుంది. పెద్ద పెద్ద సరస్సుల కవతల ఓ రహస్య ప్రదేశంలో బెలోవోదాయ్ వుంది. ఎందరో పరిశోధకులు అక్కడికి వెళ్ళేందుకు విశ్వ ప్రయత్నం చేసి విఫలులయ్యారు. ఆదేశంలో కాలు పెట్టిన కొద్దిమంది కూడా అందుకు సంబంధించిన సమాచారాన్ని రాబట్టలేకపోయారు. అందుకు కారణం తమ విషయాలు బైటి ప్రపంచానికి తెలియడం అక్కడి ప్రజలకు ఇష్టంలేకపోవడమే. భూగర్భంలో గొర్రెల్ని పోషించి వాటి సంతతి నభివృద్ధిచేసే కేంద్రం కూడా వుంది.

హిమాలయాలలో గొప్ప గొప్ప ధనాగారాలేకాక, అతి విశాలమైన గ్రంథాలయాలున్నాయనీ, వాటిల్లో ఆధునిక ప్రపంచంలోని అనేక మంచి పుస్తకాలను అమర్చేందుకు కావల్సినంత చోటుండటమేగాక ఇప్పటికీ అక్కడ కోట్లకొలదీ హస్తలిఖిత గ్రంథాలున్నాయనీ లామాలు చెబుతారు.

హిమాలయ క్షేత్రంలోని ఈ అజ్ఞాత స్థలాలకు సంబంధించిన ఈ వింత సమాచారం ప్రఖ్యాత నవలా రచయిత జేమ్స్ హిల్టన్‌ను ప్రభావితం చేసిందనడానికి అతని 'లాస్ట్‌హారైజన్' అనే నవల తార్కాణం. హిల్టన్ నవలే సినిమాగా వచ్చింది. 40 ఏళ్ళ కిందట ఈ నవల ప్రపంచంలో ఎంతో చలనాన్ని సృష్టించింది. టిబెట్ లోయలో అతను వర్ణించిన ఆదర్శలోకం పైన చెప్పిన ఆదర్శలోకంతో సరిగ్గా సరిపోతుంది.

విజ్ఞానం ఎంతఅభివృద్ధి చెందినాకల్పనా సాహిత్యంమీదే సగటు పాఠకునికి మోజు. కానీ వాస్తవాలను విజ్ఞాన శాస్త్ర పరిశోధనలతో మిళితంచేసి వినిపించినపుడు ఆ చిత్ర విచిత్రాలు కథలూ గాథలకంటే ఎక్కువగా ఆసక్తిని రేకెత్తిస్తాయి. భారత దేశం రత్నగర్భేగాక కథా సరిత్సాగరం కూడా.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

